

వెలుగునీడలు

ఫోటో—శ్రీ ఎస్ ఆర్ కె మూర్తి (న్యూఢిల్లీ)

Johnson's BABY POWDER

Johnson & Johnson

# తల్లి పెంపకమువలె సౌమ్యమైనవి...
# డెబ్బది ఏళ్ల అనుభవముతో చేయబడే
# జాన్సన్స్ తయారులు!




చిన్న పిల్లల విషయములో సాటిలేని అనుభవము
వలన పిల్లల చర్మ రక్షణకైన ప్రతి వస్తువును
జాన్సన్స్ వారు మాత్రమే తయారుచేస్తున్నారు!

సౌమ్యమైన మరియు తెల్లని జాన్సన్స్ బేబీ సోప్
...ప్రపంచములోకెల్ల అత్యంత శ్రేష్ఠమైన
టాల్కు నుండి తయారుచేయబడే మృదువైన
మరియు ఉపశమనము చేకూర్చె జాన్సన్స్ బేబీ
పౌడర్...చంటి పిల్లల లేత చర్మముల అతి
జాగ్రత్తయైన సంరక్షణ పూర్తి అగుటకు
జాన్సన్స్ బేబీ క్రీమ్ మరియు బేబీ ఆయిల్!

జాన్సన్ అండ్ జాన్సన్ ఆఫ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

# ఆంధ్రసచిత్ర వారపత్రిక



Founder
K. Nageswara Rao

స్థాపితము
1908



సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



సంపుటము 55
సంచిక 46

27-7-60
బుధవారం

శార్వరి శ్రావణ శుద్ధ చవితి



విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0



ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1.


## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
ఆర్. కె. ఫిలిమ్స్‌వారి
'జిస్ దేశ్ మే గంగా బహతీ హై' చిత్రంలో
రాజ్ కపూర్, పద్మిని



### బెన్ - హర్

క్రీస్తు భగవానుని గాథ జనరల్ లూ వాలెస్ రచించిన 'బెన్-హర్'ను అగస్టు 3, 1960 సంచిక నుంచి ధారావాహికగా పాఠకులకు అందజేయను న్నాము అని తెలియజేయడానికి ఆనందిస్తున్నాము. ఈ కథ ఆధారంగా మెట్రో-గోల్డ్విన్-మేయర్ సంస్థ 150 లక్షల డాలర్ల ఖర్చుతో నిర్మించిన చలన చిత్రం అనేకమైన బహుమతులు పొందినది. ఎమ్. జి. ఎమ్. సౌజన్యంతో కథతో పాటుగా 'బెన్-హర్' చిత్రాలు కూడా ప్రచురించనున్నాము.

—సంపాదకుడు.

## ఉత్తరాలు

### ముందు హాటు, తర్వాత స్వీటు

ఈ వారం (13-7-60) సంచికలో రాజధాని కబుర్లు, న్యూఢిల్లీ లేఖ చదువు నిరపకాయల్లా రెండుసార్లు ఖారం తినిపిస్తే, ఆ తర్వాత శ్రీ అధిభట్ల దేవబాలగారు 'నేపాల్‌లో వింతలు - విశేషాలు' అనేవారి అనుభవం చెప్పి, కమ్మని స్వీటు తినిపించారు. ఇందులకు శ్రీ ప్రవీణ్, శ్రీకృష్ణ, దేవబాలగార్లకు నా హృదయపూర్వక అభినందన లర్పిస్తున్నాను. ఈ వారం పొట్టికథలు శీర్షికలో వెలువడిన కథ తాలూకు నచ్చలేదు.

ఎమ్. రంగారావు పట్నాయక్
(వేణమ్మపేట).

* * *

ఎప్పుడు శుక్రవారం వస్తుందా! ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఎప్పుడు కొంటామా అని ప్రతిరోజూ అనుకుంటూ ఉంటాము. దీనికి కారణం ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వ్యాసాలు బాగుండడమే. 13 వ తేది పత్రికలో "నేపాల్‌లో వింతలు, విశేషాలు" వ్యాసము చాలా బాగుంది. ప్రచురించిన ఫోటోలు బాగున్నాయి. కాని మరికొన్ని ఎక్కువ ప్రచురించి ఉంటే ఇంకా బాగుండేది. వ్యాసము చాల చక్కగా వ్రాశారు. కాని వారి దుస్తులను గురించి ఎక్కడా కన్పించలేదు. రచయిత్రి అధిభట్ల దేవబాలగారికి నా ధన్యవాదాలు మీ పత్రికద్వారా అందించండి.

బూణింగి శ్రీరాములు (బొంబాయి).

* * *

13-7-60 సంచికలో 'నేపాల్‌లో వింతలు విశేషాలు' చాలాబాగున్నవి. రచయిత్రి గారికి మా అభినందనాలు తెలుపవలయును.

కె. హెచ్. ఎల్. సింగ్ (తెనాలి).

* * *

### జీవనగంగ

ప్రతివారము మేము కొనే పత్రికల్లో మీ వారపత్రిక ఒకటి. మీ వార పత్రిక యందలి కథలు, వ్యాసములు మమ్మల్ని అందర్ని రంజింపజేయుచున్నవి. అందులకు మా కృతజ్ఞత.

13-7-60 నాటి పత్రిక యందలి "జీవనగంగ" సీరియల్ నాకు (ముఖ్యముగ) చాల నచ్చింది. ఆ రచయితకు నా అభినందనలు ఈ పత్రిక ద్వారా తెలియపరచుచున్నాను. ఇట్లే మంచి మంచి కథలు,

(4-వ పేజీ చూడండి)



ఇంకా రెండు పొయ్యిలెందుకు? ఇదిగో మీకోసం తెచ్చాను పెద్ద కుండ
అయితే వంట ఎవరు చేస్తారు? అత్తయ్యగారూ మీరా?
సికిందరాబాదు
హైదరాబాదు
జంటనగరాల విలీనీకరణం
ఈ వ్యాధి మళ్ళీమళ్ళీ ప్రకోపించకుండా చేయలేరా!
సమ్మె జ్వరం
దేశం
బ్రిటన్ లో అమెరికా సైనిక స్థావరాలు
తగిలేదెవరికి

# ఉత్తరాలు

(2-వ పేజీ తరువాయి)

సీరియల్సు మున్నగునవి పాఠకులకు మీరు అందించగలరని ఆశించెదను.

టి. ఎస్. ఆర్. కృష్ణ (చీరాల).

## కొనాలనిపించింది....

20-7-60 పత్రిక ఎంతో ఆకర్షణీయంగా ఉంది. ఎప్పుడూ లైబ్రరీలో చదివే నాకు కూడా అట్ట చూడగానే కొనబుద్ధి వేసింది. అట్టే కాకుండా లోపలి రచనలు కూడా ఎంతో బాగున్నయ్. అందుకు నా హృదయ పూర్వక అభినందనలు.

రామకృష్ణ (మద్రాసు).

"కథ కాని కథలు" మొట్టమొదట ఉన్న ఉత్సాహాన్ని కలిగించుటలేదు. నేను ప్రతి బుధవారం ఎంతగా "ఆంధ్ర సచిత్రవార పత్రిక" కొరకు చూస్తానో అంతగా ఆనందపడలేనప్పటికీ "హరివంశము"ను చూచి తృప్తిపడుచున్నాను.

"తెలుగు వెలుగులు" అన్న శీర్షిక పత్రికకు చాలా శోభను గూర్చుచున్నది. ఈ విధముగానే ఆంధ్రదేశములోని ప్రముఖ మహిళల చరిత్రలు ప్రకటిస్తారని ఆశిస్తున్నాను.

పరమాత్ముని వెంకటసుబ్బారావు (గుంటూరు).

* * *

## బహుమతులు

వారపత్రికలలో అత్యుత్తమ పత్రిక అనిపించుకున్న ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని కథలు, వ్యాసాలు, తెలుగు వెలుగులు, సినిమా మొదలగు శీర్షికలే కాకుండా, రాశిఫలాలు - వనితాలోకం శీర్షిక కూడా పాఠకు లందరినీ ఎంతగానో ఆకర్షించి ఆనందపరుస్తున్నాయి. కవితా కింకిణి బహుమతి - కథ కాని కథ బహుమతి - బాలల సంఘము సభ్యులకు బహుమతి - గళ్ళ నుడికట్టు బహుమతి - ఇన్ని బహుమతులు పాఠకులకు ఇవ్వడమే కాక, ప్రతిసంవత్సరం కథానిక పోటీ - వ్యాసములు - కార్టూనులు - ముగ్గులు పోటీలు పెట్టి వివిధ బహుమతులు ఇచ్చే పత్రిక ఒక్క ఆంధ్ర సచిత్రవారపత్రికేనని గర్వంగా చెప్పవచ్చు. ఈ పత్రిక చిరకాలం వర్ధిల్లుతూ, పాఠకులను అలరిస్తుందని ఆశిస్తున్నాను.

నల్లా దత్తాత్రేయులు (పూరి).

* * *

## ఎప్పుడూ ఇంతే

శంకర్ గారు వ్రాస్తున్న ఎప్పుడూ ఇంతే చాలా బాగుంటోంది. శుక్రవారము పత్రిక రాగానే ఎంతో ఉత్సాహముతో శంకర్ గారి కార్టూనులు తీసి, చూసి ఆనందిస్తున్నాను.

మా అమ్మగారికి మాత్రము శంకర్ గారి పేజీ చింపి పుస్తకము చదువుటకు ఇస్తున్నాను. చూసిందా...ఇక మీ పత్రిక నేను కొనను. కొనలేను. శంకర్ గారికి నా ధన్యవాదములు. ఆంధ్ర సచిత్ర వారపత్రిక వర్ధిల్లుగాక !

కామినేని ధనలక్ష్మి (గుంటూరు).

* * *

## కథలు

ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని కథలు అంత చక్కగా ఉంటూంటే బాగులేవని వారానికి ఒకరిదరు అయినా వ్రాస్తూంటారు. అలాంటివాళ్ళకు ఎలాంటి కథలు కావాలో మరి? ఏమో! నాకుమాత్రం కథలు చాలా చక్కగా ఉంటున్నాయ్.

టి. ఎస్. శంకర్ (ఆదోని).

* * *

## తెలుగు వెలుగులు

తెలుగు వెలుగులలో గొట్టిపాటి బ్రహ్మయ్యగారి జీవిత ఘట్టాలను నిష్పాక్షికంగా ప్రచురించినందుకు సంపాదకులకు నా హృదయపూర్వకాభినందనములు. "...తన దారిన తాను పోయిఉంటే...కృష్ణాజిల్లా రాజకీయ ప్రతిష్ఠ పరపతి, వేరుగా ఉండేవి" ఇది సత్యం, ముమ్మాటికీ నిజం.

భరణి (హైదరాబాదు).

* * *

ప్రతివారం ప్రచురించు "తెలుగు వెలుగులు" ఆంధ్ర లోకాన్ని వెలుగులోనికి తీసుకొచ్చిన గొప్పవారి గాథలే. ఒక్కొక్కరిని గురించి తెలుసుకున్నప్పుడల్లా మనస్సెంతో ఆహ్లాదకరంగా ఉంటుంది. వచ్చేవారం ఎవర్ని గురించి పరిచయం చేస్తారోనని ఆతురతతో మీ పత్రికకోసం ఎదురుచూస్తూ...

పి. తిరుమలాచార్యులు (చీమకుర్తి).

* * *

### 'యుగళగీతం'

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 20-7-1960 సంచికలో ప్రచురితమైన కథ 'యుగళగీతం' రచించినవారు శ్రీమతి కొడుమల శైలజ. కథతో పాటుగా రచయిత్రి పేరు ప్రచురించక పోవడం పొరపాటు.

—సంపాదకుడు.

## మీ సాహిత్య పరిచయమెంత?

6-7-1960 పత్రికలో మీరు ప్రచురించిన "మీ సాహిత్య పరిచయమెంత?" అనే శీర్షిక ఎంతో బాగుంది. ఇటువంటి శీర్షికలవల్ల పాఠకులకు సాహిత్యరంగంతో నిజంగానే కొంత పరిచయం ఏర్పడుతుంది.

రోజురోజూ ఎన్నో శీర్షికలతో సర్వాంగ సుందరంగా వెలువడుతూ, అఖిలాంధ్ర ప్రజానీకాభిమాన పత్రికగా సేవచేయుచున్న మీ పత్రికకు, మీకు నా హృదయపూర్వకాభినందనలు.

ఆర్. ఎల్లయ్య (డోర్నకల్).

* * *

6-7-60 సంచికలో మీరు ప్రచురించిన "మీ సాహిత్య పరిచయం ఎంత?" చదివి, జవాబించి, ఆనందించాను. కాని అది సాహిత్య పిపాసులకు విద్వాంసులు అ, ఆ, లు నేర్చుకొన్నంత ఉత్సాహాన్ని కలిగిస్తుంది. బహుశా మీరు దానిని 'సాహిత్య అజ్ఞానుల' కొరకు ప్రచురించిఉంటారు. పాఠకులలో మీరీ విధంగా సాహిత్యమంటే జిజ్ఞాసను కలిగించడం హర్షించతగ్గ విషయం. ఇకముందు 'మీమీద సాహిత్యప్రభావమెంత?' అనే శీర్షికను మీరు మామీద విసురుతారని ఆశించవచ్చా? చల్లని వెన్నెలలో మెరిసే తెల్లని మేఘాలవంటి కథలతోనూ, శోభను గూర్చే "తెలుగు వెలుగు"లతోనూ, చంద్రబింబమువంటి ముఖచిత్రముతోనూ, తారలవంటి ఉత్తరాలు, రాశిఫలాలు, ఛలోక్తులు, గేయాలతోనూ, సినిమా గెలాక్సీ తోనూ నిండిన మీ ఆంధ్రసచిత్రవారపత్రికా ఆకాశమండలంలో త్వరలోనే నేనుకోరిన శీర్షిక సాహిత్య సూర్యోదయం అవుతుందని ఆశిస్తున్నాను.

కె. సత్యేంద్ర, యజ్ఞశ్రీ (చీరాల).



# తెలుగు వెలుగులు 44

సాటి పార్లమెంటు సభ్యులు కొందరు కొత్తరకం కార్లు ఎక్కి రాయంచనడకతో, మత్తేభయానంతో, ఠీవి ఒలుకుతూ, నాయకత్వపు నయగారం తొణికిసలాడుతూ పార్లమెంటు భవనానికి వెళ్లుతూఉండగా, సైకిలెక్కి పార్లమెంటు భవనంముందు దిగి, స్టాండులో సైకిలుపెట్టి, బీగం బిగిసిందో లేదో లాగిచూచుకొని, కారియర్‌కు కట్టిన కాయితాల ఫైలు పుచ్చుకొని, లోపల ప్రవేశించి, తన స్థానంలోకూర్చుని, నిష్ఠతో తన పనులలో లీనమయ్యే వ్యక్తి శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య అని తెలుసుకున్నప్పుడు అపరిచితులకు ఆశ్చర్యం కలుగుతుందేమోకాని, పరిచితులకు ప్రతిదిన దృశ్యం.

పదిహేనేళ్ల క్రితం కలకత్తాలో ఆయనకొక సన్మానం ఏర్పాటుచేశారట. ఆయన ఏ ఫస్ట్‌క్లాస్ పెట్టెనుంచో అట్టహాసంతో దిగుతాడని పూలదండలతో ప్లాట్‌ఫారంమీద వేచిఉన్న జనం నిక్కరు, పొట్టిచేతుల చొక్కా ధరించి, ముతకజల్లి అనే ఉడుపులు, ఒక్క సబ్బు ముక్క ఉన్న జంబుఖానాచుట్ట చంకలో పెట్టుకొని దిగి, తనదారిని పోతున్న ఆయనను గుర్తుపట్టలేకపోయిందట. ఆయన నిరాడంబరత్వాన్ని తెలిసినవారు కొంతసేపటికి తెప్పరిల్లి, ఆయనను గుర్తుపట్టి మర్యాదలతో పిలుచుకొని వెళ్లారట.

శ్రీ సుందరయ్య బాగా కలవారింట పుట్టినా, ఈ నిరాడంబరత్వం, తాను నమ్మిన విషయాలను నిష్ఠగా, భల్లూకపట్టుతో అనుసరించడం చిన్ననాడే అలవడ్డాయి. ఈ రెండింటిలో పైచేయినిష్ఠదే. ఏదిచేసినా నిష్ఠగా, తపస్తీవ్రతగా చేయడం ఆయనకు అలవాటైపోయింది. ఈ గుణం పధ్నాల్గవఏట రాజకీయాలలో ప్రవేశించి 'సోదరసమితి' స్థాపించినప్పుడు పొటమరించి, అన్నవరం ఆశ్రమంలో చిగిరించి, సైమన్ కమిషన్ వ్యతిరేక ప్రదర్శనంలో విరిసి, బోర్‌స్టల్ స్కూలు శిక్షానుభవంలో మరింత విస్తరించి, ఆయనను రాష్ట్రకాంగ్రెస్ కమిటీ సభ్యునిగాను, అఖిలభారత కాంగ్రెస్‌కమిటీ సభ్యునిగాను, రాష్ట్ర సోషలిస్టుపార్టీ కార్యదర్శిగాను తీర్చి దిద్దింది.

అయితే నిష్ఠలోను, కఠోరనియమపాలనలోను ఒక ప్రమాదం ఉంది. కొంచెం గాడి తప్పితే తీవ్రమార్గానికి పడదోస్తుంది. అలాటిదే ఆయన విషయంలోను సంభవించింది. ఆయన అతివాదులవైపు, వామపక్షంవైపు మొగ్గి, కమ్యూనిస్టుగా మారి 1934 లో ఆంధ్రలో కమ్యూనిస్టుపార్టీ స్థాపకుడు అయాడు. ఈ నిష్ఠవల్ల, కఠోరతవల్ల ఆయన స్వభావం కొంత రూక్షంగాను, స్వరూపం కరకుగాను కావడం వింతేమీకాదు. ఇటీవల కొద్దిగా నాజూకుతనం చేర్చుకున్నాడు.

ఆయనలోని వేరొక విశేషం పరిశ్రమశీలత – దీనిని నిష్ఠలో ఒకశాఖగానూ చెప్పవచ్చు. ఏవిషయమైనా వివిధదృక్పథాలతో క్షుణ్ణంగా చదివి, ఆకళించుకొని ప్రతివాదులతో పోరుకు తలపడతాడు. ఒకసారెవరో "నీకు ఆంధ్రసాహిత్యం సంగతి ఏమి తెలుసోయ్!" అని అధిక్షేపించారట. ఆనాటి నుంచే ఆయన రాత్రిందివం నన్నయమొదలు చిన్నయదాక ఉన్న ప్రధాన గ్రంథాలను పుక్కిటపట్టి, అర్థంకానివాటిని పండితులవద్ద అరసి 'ఇక భయంలేదు' అని గుండెమీద చేయివేసుకున్నాడట.

తనపార్టీలో తనపైనే పితూరీ చెలరేగినా ఆయన జంకలేదు; గాంధీజీకి తనపార్టీ చిఠా అవర్జా ఉన్నదున్నట్టుగా చూపడానికి వెనుదీయలేదు. ఎవరో ఆయనను హత్య చేసినట్టు వదంతులు వ్యాపించాయి. ఇది సుందోపసుందులసమరంలే, ముసలంపుట్టిందిలే అనీ జనం అనుకుంది. కొందరు అవకాశవాదులు అభిప్రాయభేదాల సాకుతో సరిహద్దుదాటి, 'నో మ్యాన్స్ లాండు'లో తిరుగాడి, కొంతకాలానికి దక్షిణ పక్షాలలో చేరారు. కాని, ఆయన నాటినుంచి నేటిదాక వామపక్ష ప్రతీకగా, ఆశయానికీ ఆచరణకూ భేదాలేని అతివాదపక్ష ప్రతినిధిగా ఉంటూనే ఉన్నాడు.

ఆయన పెక్కు పుస్తకాలు రచించినా — అవన్నీ ప్రచారధోరణివే గనుక — గొప్ప రచయితగా పేరుపొందలేదు. కాని, 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' మాత్రం నేటి ఆంధ్రప్రదేశ్ నిర్మాణానికి మూలబంధం వేసిందనే అనాలి.

ఏమైనా, ఎంతయినా, ఆయన అలనాటి కర్ణుణ్ణి తలపింపచేస్తాడు. కర్ణుడూ పాండవేయుడే. పరశురామునంతటి ఆచార్యునివద్ద అస్త్రశస్త్రాలు అభ్యసించినవాడే. త్యాగాది గుణసంపదగలవాడే. అయితే ఏం? పరప్రత్యయనేయ బుద్ధి; పెడదారి పట్టినవాడు. కమ్యూనిస్టులు అలాటివారు; వారి నాయకుడు సుందరయ్య అలాటివాడే.





అమెరికా నుంచి చలన చిత్రాలు దిగుమతి చేయడానికి జరుపుకొన్న ఒప్పందంపై కేంద్రప్రభుత్వ వాణిజ్య పారిశ్రామిక సంయుక్త కార్యదర్శి శ్రీ కె ఆర్.ఎఫ్. ఖిల్నానీ, అమెరికా తరఫున శ్రీ ఛారెస్ ఇ ఇగన్ ఇటీవల ఢిల్లీలో సంతకాలు చేశారు.

## న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

# కేంద్రప్రభుత్వ సిబ్బంది సమ్మె కొన్ని రాజకీయ పక్షాల స్వప్రయోజనాలకే

కేంద్ర ప్రభుత్వోద్యోగులు సమ్మె విరమించుకొన్నారు.

ప్రధాని శ్రీ నెహ్రూ భ్రమ పూర్తిగా తొలగిపోయి ఉండాలి. పన్నెండు సంవత్సరాల పర్యంతం ఆయన నిరాఘాటంగా పరిపాలన సాగించారు. ప్రజాస్వామిక వ్యవస్థలో కూడా సుదృఢమైన వైఖరి అవలంబించడంవల్ల ప్రయోజనం ఉన్నదని ఈనాడు అయినా శ్రీ నెహ్రూ గుర్తించి ఉంటారు. ఇంతవరకు వచ్చిన వార్తలుబట్టి కేంద్రప్రభుత్వ సిబ్బంది సమ్మె విఫలమైనట్లే. రాజధాని నగరంలో వర్షం కూడా లెక్క చేయకుండా గుమాస్తాలు, నాలుగవ డివిజన్ ఉద్యోగులు (ఫ్రాసీలు) నిర్ణీతసమయానికి ముందుగానే కార్యాలయాలకు హాజరైనారు. ఢిల్లీలో తంతి తపాలాశాఖసిబ్బంది, రైల్వేఉద్యోగులు మామూలుగా పనిచేస్తూ వచ్చారు. నీరు విద్యుత్ సర్వీసులుకూడా ఎప్పటివలెనే కొనసాగినవి. వేరొకవిధంగా చెప్పాలంటే ప్రభుత్వకార్యకలాపాలు స్తంభించిన సూచన ఏమీలేదు.

ప్రాబల్యం సంపాదించే లక్ష్యంతో సాగిన ఈ పోరాటాన్ని సింహావలోకనం చేసుకొనవలసిన సమయంవచ్చింది.

వేతనాలు పెంచాలని కోరుతూ సమ్మె చేయడానికి తంతి తపాలా శాఖ సిబ్బంది సంకల్పించగా 1957 సెప్టెంబరులో రెండవ వేతనసంఘం నియమించారు ప్రముఖ ఆర్థికవేత్తలు సభ్యులుగా నియుక్తులైనారు. సుప్రీమ్‌కోర్టు న్యాయమూర్తి అధ్యక్షత్వం వహించారు

వేతనసంఘం తన నివేదిక సమర్పించేలోగా తాత్కాలికసహాయంగా కొంత మంజూరు చేయాలని కేంద్ర ప్రభుత్వోద్యోగులు కోరినారు

వేతనసంఘం 1957 డిసెంబరులో తాత్కాలిక నివేదిక సమర్పిస్తూ తక్కువజీతాల ఉద్యోగులకు నెలకు అయిదురూపాయిలు మంజూరు చేయమని సిఫార్సు చేసినది. దానివల్ల అదనంగా చాలా ఖర్చు అవుతుంది. అయినా సరకుచేయక ప్రభుత్వం వెంటనే ఆ సిఫార్సు అంగీకరించి అమలుపరచినది

వేతనసంఘం తన నివేదికను 1959 ఆగస్టులో సమర్పించినది దానిని, వేతనసంఘం సిఫార్సులలో ప్రధానమైన వాటిపై తాను జరిపిన నిర్ణయాలను ప్రభుత్వం 1959 డిసెంబరులో ప్రకటించినది. ఆతరువాత మరికొన్ని సిఫార్సులపై జరిపిన నిర్ణయాలను కూడా ప్రభుత్వం ప్రకటించియున్నది. కనీస వేతనం విషయంలోను, కరవుభత్యం రేట్ల విషయంలోను వేతనసంఘంచేసిన సిఫారు

లను ప్రభుత్వం అంగీకరించినది.

అయితే వేతనసంఘం సిఫార్సు చేసిన రకాల వేతనాల సరళికి అనుగుణంగా వివిధ రకాలఉద్యోగాలకుఉన్న వేతనాలను మార్పు చేయడంమాత్రం ఇంకా పూర్తికాలేదు. వందలాదిరకాల (కాటిగరీస్) ఉద్యోగాలు ఉండడమే దానికి కారణం. ఈ కార్యక్రమంకూడా పూర్తి కావచ్చినది. ప్రభుత్వం తన నిర్ణయాలను త్వరలోనే ప్రకటించవచ్చు.

ఇది ఇలా ఉండగా వేతనాలు ఇతోధికంగా పెంచాలనికోరుతూ కేంద్ర ప్రభుత్వోద్యోగుల సంఘాలసమాఖ్య 1960 ఫిబ్రవరిలో ఉద్యమం ప్రారంభించినది. ఆ తరువాత అఖిలభారతరైల్వే పనివారిసమాఖ్య ఈ ఉద్యమంలో చేరినది. ఫిబ్రవరి 20 వ తేదిని పార్లమెంటు భవనంవద్ద ప్రదర్శనం జరిపినది. ఏప్రిల్ మొదటివారంలో నాలుగు సంస్థల ప్రతినిధులు బొంబాయిలో సమావేశమై సంయుక్త కార్యాచరణసంఘం స్థాపించారు. ఆ సంస్థలు ఇవి:

1. కేంద్ర ప్రభుత్వోద్యోగుల సంఘాల సమాఖ్య. 2. అఖిలభారత రైల్వే పనివారి సమాఖ్య. 3. అఖిలభారత రక్షణ శాఖోద్యోగుల సమాఖ్య. 4. అఖిలభారత తంతి తపాల శాఖోద్యోగుల సమాఖ్య.

బొంబాయి సమావేశం ఆరు కోరికలు కోరినది. అవి నెరవేరేటట్లు చూడడానికి అవసరమైతే ప్రత్యక్ష చర్య జరపడానికి ఆ సమావేశం సంయుక్తకార్యాచరణ సంఘానికి అధికారమిచ్చినది. ఆ కోరికలు సువిదితమైనవే. అయితే అఖిలభారత రైల్వేపనివారి సమాఖ్య కేంద్రమండలి ఫిబ్రవరిలో సమావేశమై రూపొందించిన ప్రతిపాదనలనే బొంబాయి సమావేశం యథాతథంగా అంగీకరించి తనవిగా ప్రకటించడం మాత్రం గమనించదగిన విషయం.

సంయుక్త కార్యాచరణ సంఘం రెండు ప్రధానమైన కోరికలను ప్రభుత్వంవెంటనే అంగీకరించాలని పట్టు పట్టినది. అవసరాలకు అనుగుణంగా కనీస వేతనం నిర్ణయించడానికి, కరవుభత్యాన్ని జీవన వ్యయసూచితో ముడిపెట్టడానికి సంబంధించినవి అవి.

కేంద్రప్రభుత్వోద్యోగుల సంఘాల వాదనతోపాటుగా ఈ రెండు అంశాలను రెండవ వేతనసంఘం కూలంకషంగా పరిశీలించి ఉన్నది.

**"ఉద్యోగులు ప్రతిపాదించినట్లుగా అవసరాలనుబట్టి నెలకు 125 రూపాయల కనీసవేతనం ఇవ్వడంఆర్థికంగా సాధ్యంకాదు" అని వేతనసంఘం అభిప్రాయపడినది.**

అయితే కేంద్ర సిబ్బందికి లభించే కనీస




వేతనాన్ని నెలకు 75 నుంచి 80 రూపాయలకు పెంచాలని వేతనసంఘం సిఫార్సు చేసినది. ఈ సిఫార్సును ప్రభుత్వం అంగీకరించినది.

ఇక కరవుభత్యానికి సంబంధించినంతమట్టుకు ధరల సూచిలో మార్పులనుబట్టి కరవుభత్యం మార్పు చెందడానికి అనుమతించరాదని వేతన సంఘం నొక్కి చెప్పినది.

ఈ విధంగా సంయుక్త కార్యాచరణ సంఘం కోరికలలో ప్రధానమైన 'రెండింటిని వేతన సంఘంవంటి నిష్పాక్షికమైన సంఘం పరిశీలించి వాటిని అంగీకరించరాదని నిర్ణయించినదని స్పష్టం అవుతున్నది. అలాంటి సంఘం ఖండితంగా త్రోసిపుచ్చిన కోరికలనే అంగీకరించాలని సంయుక్త కార్యాచరణసంఘం తిరిగి బట్టుబట్టడం వాస్తవ పరిస్థితులకు విరుద్ధమైన వైఖరి అవలంబించడం.

ఆ కోరికలను తిరిగి పరిశీలించడానికి ప్రభుత్వం అంగీకరించినదనే అనుకొందాము. తత్ఫలితంగా ఎలాంటి పరిణామాలు సంభవించగలవో తెలుసుకోనడం అవసరం. వేతన సంఘం సిఫార్సులను ఆమోదించకపోవడం, వేతనసంఘం పరిశీలించిన అంశాలను తిరగతోడడం మంచి సంప్రదాయంకాదు. ఇలాంటివి జరిగితే సుప్రీమ్ కోర్టు న్యాయమూర్తులవంటి వారెవరూ ఇక ముందు ఇట్టి బాధ్యతలు స్వీకరించడానికి అంగీకరించరు. సమగ్రమైన పరిశీలనానంతరం వేతనసంఘం చేసిన సిఫార్సులు అంగీకరించకపోవడం ప్రభుత్వానికి మంచిదికాదు: సిబ్బందికి మంచిదికాదు. ఇలాంటిసంఘం సూచనలను త్రోసిపుచ్చడం ప్రభుత్వానికి సాధ్యమూకాదు. అలా చేసేపక్షంలో ఇకముందు వేతనాల విషయంలో ఏర్పడే పేచీలు పరిష్కరించడానికి ఈపద్ధతి అనుసరించే అవకాశం ఉండదు. వేతనసంఘం సిఫార్సులు అమలుపరచడానికి సాలుకు అదనంగా దాదాపు 40 కోట్ల రూపాయలు ఖర్చుఅవుతుంది. కేంద్ర ప్రభుత్వోద్యోగులకు అదనంగా తలకు మరొక రూపాయి ఇచ్చినా సాలుకు మరి రెండుకోట్లరూపాయలు ఖర్చు అవుతుంది.

సంయుక్త కార్యాచరణ సంఘంలో ప్రాతినిధ్యంఉన్న సంఘాలు అన్నీ వామపక్షాల (ప్రజాసోషలిస్టుపార్టీ, కమ్యూనిస్టు పార్టీ) నాయకత్వంక్రింద ఉన్నవే. కేంద్ర ప్రభుత్వ సిబ్బందిగనుక సమ్మె సాగించితే వారిపై తమ పలుకుబడి అధికంగా పెంచుకొనడానికి అవకాశం లభిస్తుందని కమ్యూనిస్టుపార్టీ నాయకులు ఆశించారట. అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, ప్రజాసోషలిస్టుపార్టీకూడా బహిరంగంగానే ఈ సమ్మెను బలపరచినవి. ఈసమ్మె ప్రధానంగా కొన్ని పక్షాల రాజకీయలక్ష్యాల సాధనకు ఉద్దేశించినదే కాని, కేంద్రప్రభుత్వోద్యోగుల పరిస్థితి చక్కబరచడానికి ఉద్దేశించినది ఎంతమాత్రమూ కాదని స్పష్టం అవుతున్నది. 



# పేయింగ్ గెస్ట్

వై.వి. రామారావు

"నిన్నిసార్లు చెప్పానమ్మా ఆగది అద్దెకివ్వనేవద్దని. నీ మొండిపట్టు మాత్రం నువ్వువదలవు. ఉన్నదానితో కాలక్షేపం చేసుకోవాలేగాని ఎవడికో ముక్కూ మొగమూ తెలియనివాడికి గది ఇస్తే ఏంబాగుంటుంది" అంటూ జోళ్ళు నేలను టపటపా కొట్టుకుంటూ గదిలోకి వెళ్ళింది శశి. వెనుకనే అనునయింపుగా తల్లి వెళ్లి నెమ్మదిగా భుజం మీద చెయ్యివేసింది.

"చూడు శశీ... నువ్వు కాలేజీలో చదువుతున్నావేగాని లోకాన్ని అర్థంచేసుకునే బ్రతకగలజ్ఞానం నీలో తక్కువ. మన పరిస్థితులు జాగ్రత్తగా ఆలోచించి చేశానీపని నేను. మీ నాన్నగారే వుండినట్లయితే అసలింటిని అద్దెకివ్వవలసిన పరిస్థితే వచ్చేది కాదు. ఇంతకూ ఆయన లేకపోవడం, నువ్వు కాలేజీ చదువులు చదవడంచేత నా కీమాటలు పడడం తప్పనిసరి ఐంది."

"ఏంమాటలన్నానమ్మా? ఉన్న దాంట్లోనే గడుపుకోవాలన్నాను. నేను మంచికే అన్నా కళ్ళనీళ్లు కుక్కుకుంటావు. నీయిష్టం వచ్చినట్లు చేసుకో. కాడి రంగయ్య కిచ్చుకో ఇంటిని."

"అదేమిటే! వాడు నావేలు విడిచిన మేనమామకు స్వయాన మనవడు. అడ్డదిడ్డమైనవాళ్ళకి నేనుమాత్రం ఎలా ఇస్తాను చెప్పు. దూరపుచుట్టం. ఏమైనా కడుపులో పెట్టుకునేవాడు కాని రచ్చకీడ్చే రకమే కాదు వాడిది. వాళ్ళతాత మరీమరీ రాశాడు. మీకు సాయంగావుంటాడు, ఊరు కొత్తగనక తనవాళ్ళ దగ్గర వున్నట్టుంటుంది వాడికి, ఇక వాడిపూచీ నీదేసుమీ అని. కాస్తో గొప్పో వున్నవాళ్ళే కనక వాళ్ళనాన్నకి ఏడు పంపే అవసరంలేదట. కుర్రవాడు చాలా బుద్ధిమంతుడు. [illegible]

భోజనం కాఫీలకు, ఇంటికి కలిపి తీసుకుంటే వాడికి కష్టం వుండేదు, మనకి ఖర్చు సర్దుకుంటుంది. "సరేలేకాని. మనయింట్లోకి ఏపరిస్థితిలోనూ రాకూడదు. తనగదికి తాళంవేసుకోని వెళ్ళొండమనను. బాత్ రూమ్‌లో ప్రవేశించేముందు చెప్పి ప్రవేశించమను. దానికి గడియలేదు. అంతా దబ్బిదాకొచ్చింది" అంటూ వీధిలోకి వెళ్ళిపోయింది.

మేడమీద గదిలో పడుకుని వింటూఉన్న నాకు శశి ఆడే ప్రతిమాటలోని కర్కశత్వం స్పష్టంగా అర్థమైంది. వచ్చి నాలుగుగంటలు కాలేదు, మొదటి అనుభవం చాలాగట్టిగా జరిగింది. పట్నం, నాగరికులుండే స్థలం అని పేరుపొందివున్నది గనుక నాగరికత ప్రథమలక్షణం ఇక్కడ ఇదేనేమో అనిపించింది. ఊరుచూద్దామని బాత్ రూమ్ లోకి వెళ్ళి స్నానంచేసి టాయిలెట్ అయి గదిబయటకు వచ్చాను.

"రామం! ఇదిగో కాఫీ తీసుకుని ఊరు చూసిరా. మాగోపీ వుంటే నీతో పంపించి వుందును. నీకు వూరు కొత్తాయెను. ఆడుకుందుకు వెళ్లి పోయాడు వాడు" అంటూ అత్తయ్య (నీకు అత్తయ్య నవుతానని తనే చెప్పిందిలెండి) మేడమెట్లెక్కి వచ్చింది. గదిలో బల్లమీద కాఫీగ్లాసు పెట్టి మంచంమీద కూర్చుంది. నేను లోపలకువచ్చి కాఫీ తీసుకుంటున్నా.

"చూడురామం. మా శశి దుడుకుపిల్ల. కాలేజిలో చదువుతున్నదేకాని లోకజ్ఞానం లేదు దానికి. అందుచేత అది నాలికజారి ఏమైనా అన్నా నువ్వేమీ పట్టించుకోకు బాబూ. ఆ భయంతోనే ఇన్నాళ్ళూ ఎవ్వరికీ ఇంటినివ్వలేదు. కావలసినవాడివి కనక చెప్తున్నాను. ఇటూ అటూ గాని పరిస్థితులవల్ల..."

"సరేలెండి అత్తయ్యా. మీరింతగా చెప్పాలా. చదువు పూర్తయ్యేసరికి లోకజ్ఞానం కూడా పూర్తిగా వచ్చేస్తుంది" అని ఆవిడ సంభాషణను వాళ్లయింటిపరిస్థితులను గురించి వినడం ఇష్టంలేక ముగించివేశాను.

* * *

విశాఖపట్నం అంతవూర్లో ఎవరో ఒక స్నేహితుడు కలియకమానడు. చిన్ననాటి క్లాస్‌మేట్ వేణు కనిపించాడు. కబుర్లు చెప్పుకుంటూ పదిగంటలకు ఇంటికిచేరాను. తలుపు మెల్లిగా తట్టాను.

"ఎవరువారు" శశికంఠం.

"నేను"

"అంటే..."

"ఇంకెవరే మన రామం వచ్చాడు. అలా అడుగుతావేమిటి" అంది అత్తయ్య.

"వెళ్ళి తలుపుతీసుకో" శశి మెల్లిగా గొణిగినా నాకు వినబడ్డాయా మాటలు. అత్తయ్య తలుపుతీసింది.

"స్నేహితుడొకడు కలిశాడత్తయ్యా. అందుచేత ఆలస్యమయింది" అని ఒక చిన్న ఎక్స్‌ప్లనేషన్ ఇచ్చుకున్నాను.

"దానికేంలే నాయనా. రా కాళ్ళు కడుక్కొని కూర్చో" అంటూ వంటఇంట్లోకి వెళ్లింది. నేను బాత్ రూమ్‌కి దారితీశాను.

"ఇక్కడ దేనికిభోజనం. ఆయన గదిలో పెట్టు అదేదో" అంది శశి.

"మరీ బాగుందే ఈ వరస" అని అత్తయ్య విసుక్కుంది.

లుంగీ కట్టి తలదువ్వుకుంటుంటే కంచం, ప్లేటుతో అత్తయ్య గదిలోకి వచ్చింది.

"చాలా శ్రమ అత్తయ్యా మీకు" అన్నాను.

"బాగుంది రామం. మా శశి సినిమాకి వెళ్ళొస్తే ఆలస్యం కాదూ. మరేం ఫర్వాలేదు. మొగమాటంపడకుండా కావలసినది అడిగివేయించుకో. మీ అమ్మ వేరూ నేను వేరూ అనుకోవద్దు" అంటూ అత్తయ్య లోకాభిరామాయణం మొదలుపెట్టింది. బలవంతంగా కొసరి కొసరి తినిపించే ఆ ఆప్యాయతచూస్తే అమ్మకూ అత్తయ్యకూ తేడా కనిపించలేదు.

మర్నాడు డ్యూటీలో యథాక్రమంగా చేరాను. కాని చెవిలో శశిమాటలే ప్రతిధ్వనిస్తున్నాయి. నా గురించి శశి వుద్దేశమేమిటో. ఏదో మామూలు టవునులో చదివి గ్రాడ్యుయేట్‌ని అయ్యానని ఈ యూనివర్సిటీ స్టూడెంట్‌కి ఈసడింపా? లేక మగవాళ్ళమీద ఏహ్యతా? లేక తన పరిస్థితి నాకు తెలిసిందన్న ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు యొక్క పరిణామమా? ఇంకా ప్రథమదశలో వుంది నా పరిశోధన.

ఆఫీసు పని పూర్తికాగానే, ఇంటివేపు బయలుదేరాను. ప్రొద్దుట ఆఫీసుకొచ్చేటప్పుడు గోపి పైకి ఎగిరే బుడగలు కావాలని మారాం చేస్తుంటే చూశాను. హైడ్రోజన్ బెలూన్లు రెండు, చాక్లెట్ పేకెట్ ఒకటి కొన్నాను. ఇంట్లో అడుగు పెట్టేసరికి వరండాలో శశి, గోపి ఆడుతూ కన్పించారు. నన్ను చూడగానే శశి హఠాత్తుగా ఆగి ప్రక్కకు మళ్లింది. గోపి నా చేతులో బెలూన్లు చూడగానే ఒక్క గంతులో దగ్గరకు వచ్చాడు. "రాంబాబుగారూ బెలూన్లెందుకు తెచ్చారండి?" అంటూ ఆశగా వాటివేపు చూశాడు.

"ఎందుకో చెప్పు" అంటూ శశివేపు చూశాను. అంతవరకూ నావేపే చూస్తున్న శశి నా చూపుల్ని తప్పించుకోలేకపోయింది. ఏం జవాబు చెప్పాలో తెలియక తికమకపడుతూ గోపి నావంక చూశాడు.

నేను శశివంక చూడడం చూసి "తెలిసిందిలెండి. అక్కయ్యకోసం తీసుకు వచ్చారు. తెలిసింది. తెలిసింది" అంటూ ఎగిరాడు.

"ఒరేయ్ గోపీ, నోర్ముయ్ వెధవా" అని వురిమింది శశి. నాకు నవ్వాగలేదు.

"గోపీ అలా అనకూడదు. ఇవి నీకోసమే తెచ్చాను. ఇదిగో" అంటూ గోపిచేతిలో బెలూన్ల దారాలు రెంటినీ వుంచి మెట్లెక్కు



# పేయింగ్ గెస్ట్

చున్నాను. శశి గబ గబ గోపి దగ్గరకు వచ్చి "ఏమిట్రా పేలావ్ విధావా" అని లెంప కాయకొట్టింది. నేను వెనకకి తిరిగి చూశాను. గోపి చేతిలోవున్న బెలూన్లను రెంటినీ లాగి విసిరివేసింది. బెలూన్లు ఎగురుతూ మెట్ల మీదకి వచ్చాయి. రెంటినీ పట్టుకున్నాను. బిక్కమొగం పెట్టినగోపి మళ్ళీ ఒక్కసారి నవ్వాడు. శశికి కోపం ఆగలేదు "మిస్టర్ ..." "రామారావ్ మిస్ శశి" అని పూర్తిచేశాను.

"సంతోషించాం కాని మీ రిలా బెలూన్లు పకోడీలు కొని ఇవ్వడాని కిది పత్తిపాడు కాదు". నా మనసు ఈ మారు బాధపడింది. శశి ప్రవృత్తి పరిశీలిస్తుంటే అంతకంతకూ క్లిష్టంగా తయారవుతోంది.

ఇంకా ఆశగా చూస్తున్న గోపికి వచ్చి తీసుకోమని బెలూన్లను చూపించాను. శశి ఎంత ఆపినా ఆగక నాగదిలోకి పరిగెత్తుకొచ్చాడు గోపి.

* * *

"గోపీ ఒరేయ్ గోపీ" శశి పిల్చింది.

"నేను రానుఫో" నాగదిలోంచి సమాధానమిచ్చాడు గోపి.

"రాకపోతే తంతాను"

"అసలీ గదిలోంచి రానేరాను. ఏం చేస్తావ్?" నాకు మళ్లీ నవ్వొచ్చింది.

తప్పనిసరి అన్నట్లు శశి కాఫీగ్లాసుతో బలవంతంగా మేడమెట్లెక్కుతూ వచ్చి గది గుమ్మంలో వుంచి వెళ్ళిపోయింది?

"గోపీ కాఫీతాగుతావా" నే నడిగాను.

ఒద్దండీ ఇప్పుడే తాగాను అని గోపీ సమాధానం. "కొద్దిగా తాగుదూ పరవాలేదు" అంటూ గ్లాసులో కొద్దిగా పోసి ఇచ్చాను.

"మా అక్క తంతుంది" అందుకుంటూ అన్నాడు.

"నేను చెప్పనుగా ఇంకెలా తెలుస్తుంది." ఆనందంతో గోపి కాఫీ త్రాగేశాడు. చాకలెట్ పాకెట్ చించి చాక్లెట్లందించాను గోపికి. "మీ అమ్మగా రెక్కడికి వెళ్ళారు" ప్రశ్నించాను.

"ఎక్కడికీ వెళ్లలేదండి, జరం వొచ్చింది" గోపి జవాబు.

త్వర త్వరగా మెట్లుదిగి వరండాలోనికి వెళ్ళాను. వరండా వెనుకగుమ్మందగ్గర శశి నిల్చుంది. నన్ను కోపంతో "మిష్టర్ రామారావ్ ఇక్కడ కెందుకొచ్చారు."

"అత్తయ్యగారికి ఒంట్లో బాగులేదంటే వచ్చాను. ఎక్కడున్నారు?"

"ఇప్పుడే నిద్దరపట్టింది. డిష్టర్బ్ చెయ్యవద్దని డాక్టర్ చెప్పారు. మీరు దయచేసి..." హేళనగా అంది.

"ఐ యామ్ సారీ, అవిడకంతే నేను మిమ్మల్నెక్కువ డిస్టర్బ్ చేసినట్టున్నాను" అని వ్యంగ్యంగా అని వెనక్కు తిరిగాను.

"నాయనా రామం మాట" అత్తయ్యకంఠం వినిపించింది. సగర్వంగా శశి వైపు చూసి అత్తయ్య వున్న గదిలోకి వెళ్ళాను.

"రా నాయనా కూర్చో"

"ఒంట్లో తేలిగ్గా వుందాఅత్తయ్యా? మందు తీసుకునే వేళయినట్లుంది" అన్నాను. శశి దూకుడుగా వచ్చి ఔన్సుగ్లాసులో మందు పోసి బల్లమీద పెట్టి వెళ్లిపోయింది.

"చూడు నాయనా పెద్దదాని నయ్యాను కదూ. అప్పుడప్పుడు జ్వరం, దగ్గు వస్తూంటుందిలే. నేను లేవలేను. నీకు శశే సరుకులన్నీ చేస్తుందిలే. మొహమాటపడకుండా అన్నీ అడిగి చేయించుకో. దాని మాటలకేం పట్టించుకోకు." అత్తయ్య అంతా వివరించింది. సరేనని గదికి వచ్చి టాయ్‌లెట్ ఐ బజారుకు వెళ్ళాను.

బత్తాయిపళ్ళబుట్టతో సహా ఎనిమిది గంటలకు రిక్షా దిగాను. గోపి ఎదురు వచ్చాడు. గోపీ ఈపళ్లు ఇంట్లో పెట్టించు" అని చెప్పి రిక్షావాడికి డబ్బు లిచ్చి మెట్లెక్కాను.

"ఇవన్నీ ఎక్కడివిరా" శశి ధ్వని,

"రాంబాబుగారు తీసుకొచ్చారు. ఇంట్లో పెట్టమన్నారు"

"ఉద్ధరించారే"

"అంటే ఏమిటే అక్కా"........

"ఛ నోర్మూయ్"

* * *

కాళ్లు చేతులు కడుగుకొని గదిలో కూర్చుంటుండగా శశి ప్లేటుపట్టుకువచ్చింది. మాట్లాడ్డామన్న పట్టుదలతో "మీకు చాలా శ్రమ ఏమేమి వండా రేమిటి?"అని అడిగాను.

"వండినవన్నీ కంచంలో వేసే తీసుకువచ్చాను. ఏమైనా అవసరమైతే తెలియజేయండి వస్తాయి"అంటూ క్రిందికి చరచర దిగిపోయింది.

అమ్మచేతి వడ్డన తప్పితే ఇంకెక్కడా తిని ఎరుగను. అందులో సరదాగా కబుర్లు చెబుతూ ఆప్యాయంగా వడ్డిస్తుంటే తిన డానికి అలవాటుపడ్డ నాకు అదేవిధమైన ఆదరణ అత్తయ్యవద్ద లభించడంచేత చాలా అదృష్టవంతు ణ్ననుకున్నాను. ఇప్పుడు శశి మాటలలోని కఠినత్వం నా ఆకలిని చంపివేసింది. ఎంగిలిపడి లేచిపోయాను. కబురు కోసం నిరీక్షించిన శశికి విసుగు పుట్టిందని ఆ ప్రవేశించి కంచం తీసుకువెళ్లిన తీరే చెప్పింది.

మర్నాడు ఉదయం కాఫీ గోపి తీసుకు వచ్చాడు. కాళీగ్లాసు మాటాడకుండా తీసుకు వెళ్లాడు. ఆఫీసు టైము సమీపిస్తోంది. కంచం పట్టుకువెళ్లి మేడమీద పెట్టమని గోపిని పురమాయించింది శశి.

"ఆయనతో మాట్లాడొద్దనిచెప్పి మళ్లీ ఎందుకు పంపిస్తావ్. నేను వెళ్ళనుఫో." లోపలినుండి అత్తయ్య "నువ్వే వెళ్లి అతనికేం కావాలో కనుక్కో తల్లీ. మగవాడికేం తెలుస్తుంది" అంది. తప్పనిసరిగా కంచంతో ప్రవేశించింది శశి. యథాప్రకారంగా "ఏమైనా కావలిస్తే కబురుపెట్టండి" అని చెప్పి వెళ్లిపోయింది. నేను అడగను. నే నడగనిదే తను మారు వడ్డించదు. ఇద్దరిలో పట్టింపు వృద్ధి కాసాగింది. మారడగకుండా లేచిపోయాను. శశి కంచం తీసుకువెళ్లింది. ఆమె ప్రవర్తన నన్ను బాధపెట్టసాగింది. సహనానికి ఒక హద్దు వుందిగా.

సాయంత్రం హోటల్లో కాఫీ త్రాగి బీచికిపోయి ఎనిమిదిగంటలకు ఇంటికి చేరాను. గోపి గుమ్మంలో కన్పించాడు. "ఎలావుంది గోపీ మీ అమ్మగారి జ్వరం"... "కొద్దిగా తగ్గిందటండి"—మాట్లాడకుండా మెట్లెక్కాను. భోజనం...ప్రొద్దుటికన్నా కంచంలో చాలా తక్కువ పదార్థాలున్నాయి. కావలసినవడగమని శశి చెప్పడం నే నడగకుండా లేచిపోవడం జరిగాయి.

మరునాడు అత్తయ్య వణుకుతూ మేడ మెట్లెక్కడం చూశాను. మెట్లు దిగివెళ్లి ఆమె చేతిలో కంచం అందుకున్నాను.

"పరవాలేదు బాబూ, ఈమాత్రందానికేనా. పద నేనూ కూర్చుంటాను భోజనం చెయ్. నీ కిష్టమని వంకాయ మెంతికారం వేసి వండాను." ఆ ఆప్యాయతకు సాటి మాతృప్రేమే. మారుమాటాడకుండా భోజనం చెయ్యసాగాను. వద్దంటున్నా మారు వడ్డించి తినిపించింది. నాకు మాటాడడాని కేమీ తోచలేదు.

"సాయంత్రం కాఫీకి రాకపోతే నామీద ఒట్టే" ఆ ఆప్యాయతలోని అధికారం నన్ను వివశుణ్ణి చేసింది.

ఉపాధ్యాయుడు – 'ఒరేయ్ రఘూ, రామునికీ, ఆంజనేయునికీ యుద్ధంఎందుకొచ్చిందిరా?'

రఘు – 'మరండీ, నిన్ననేమో రాముని పుస్తకం ఆంజనేయులు తీసుకొని పారేశాడండి. అందుకని ఇద్దరూ పోట్లాడుకున్నారండి.'

—రావూరి ఉదయశ్రీ (గుంటూరు)

సాయంత్రం కాఫీకి ఇంటికి వచ్చాను. వచ్చేసరికి ఈ మాటలు వినబడుతున్నాయి. "డాక్టరుగారు ఓవల్టిన్ తీసుకోమని చెప్పారే కాని డబ్బెక్కడినుంచి వస్తుందో చెప్ప లేదు"... "ఐతే ఆయన చెప్పడం తప్పటే? ఉంటే కొనుక్కుంటాం, లేకపోతే లేదు. దానికింత రాద్ధాంతం దేనికి" అత్తయ్య సమాధానం. గుమ్మంలో జోడు చప్పుడు చేసి నా గదిలోకి వెళ్ళాను. కాఫీ త్రాగి బజారుకు వెళ్ళాను. తిరిగి వచ్చినపుడు ఓవల్టిన్ డబ్బా ఒకటి కొని గోపి కిచ్చి లోనికి పంపాను.

* * *

మర్నాడు జీతాలందరోజు. జీతంమీదే ఆధారపడవలసిన అవసరం లేకపోయి నా మొదటి జీతం అందుకోవడమనే సంతోషానుభూతులతో రాత్రి చాలసేపటివరకు నిద్ర పట్టలేదు. ఏవిధంగా మొదటి జీతంతో పెద్దల్ని సంతోషపెడదామా అనే ఆలోచనలు పదే పదే మనసులో దొర్లాయి.

ఉత్సాహంగా లేచి కాలకృత్యాలు తీర్చుకున్నాను. అత్తయ్య గ్లాసుతో ప్రవేశించింది. గ్లాసులో ఓవల్టిన్ ఉంది. "ఇదేమిటత్తా ఓవల్టినిచ్చావు?"

"అదేమిటి బాబూ నిన్న నువ్వే తీసుకువచ్చావు కదూ మర్చిపోయావా?"

"అది నీకోసమత్తయ్యా. నా కది సహించదు."

"నేను తెమ్మని చెప్పానా. అనవసరంగా డబ్బు కర్చుపెట్టకూడదు బాబూ. పదో పరకో మిగల్చడానికి ప్రయత్నం చెయ్యాలి గాని ఇలా కర్చుపెడితే ఎలా?"

"నీకు నీరసంగా వుందని తీసుకొచ్చాను. మా అమ్మకోసం తీసుకురావడం నా కలవాటేగా."

భోజనం చేసి హుషారుగా ఆఫీసుకు బయలుదేరా. సాయంత్రం ద్రాక్షపళ్ళ పొట్లం పర్సునిండా ధనంతో ఇంట్లో అడుగు పెట్టాను. అత్తయ్య ఓవల్టిన్ తీసుకువచ్చి బల్లమీద పెట్టి మంచంమీద కూర్చుంది.

"అత్తయ్యా నీ చెయ్యేది."

"ఇదిగో బాబూ ఏం?"

తియ్యగా తీసిపుంచిన నోట్లనూ ద్రాక్షపళ్ళ పొట్లాన్ని అత్త చేతిలో ఉంచి మనస్ఫూర్తిగా నమస్కరించాను.

"నా మొట్టమొదటి జీతం అత్తా. అమ్మ దగ్గర లేదుగా. అందుచే అమ్మ స్థానాన్ని నువ్వు గ్రహించాలి" అన్నాను. ఆ నోట్లను దేముడిదగ్గర వుంచి నమ్రతతో కళ్లు మూసుకుంది.

"కొద్దిరోజుల్లోనే పెద్ద ఆఫీసరువై వందలు వందలు సంపాదిస్తావు బాబూ" అంటూ ఏడు పదిరూపాయల నోట్లుంచుకొని మిగతావి చేతులో పెట్టబోయింది.

(53 వ పేజీ చూడండి)

# క్రొత్తకోడలు

మాధవ

అత్తగారింటికి
కొత్తగా వచ్చినా
జవరాల నీనేమి
జవహారీ తెస్తినే?

క్రొత్తగా మీయింటి
కత్తరో వస్తూను
అణకువయు వినయమ్ము
ఒడినిండ తెచ్చాను.

మామగారింటికి
భామగా నీవొస్తు
సొమ్ములను ఏమేమి
ఇమ్ముగా తెచ్చావు?

అత్తకును మామకును
బత్తిమై పరిచర్య
చేసేటి హృదయమును
తీసికొని వచ్చాను.

ఆడుబిడ్డను నేను
కూడయున్నానంటు
మగువకును నా కేమి
సిరులనూ తెచ్చావు?

పతితోడబుట్టినా
అతివరో నీ కొఱకు
హృదినిండ నెయ్యంపు
సుధ నింపి తెచ్చాను.

సరసమ్ము లాడేటి
మరదలి నే నొదినె
మఱువకను నా కేమి
చిఱుతిండి తెచ్చావు?

నగపాలు వలికేటి
ముగిపెంపు నా మఱది,
చేతితో లడ్డూలు
ప్రీతితో వండాను

నీతియును హాస్యమ్ము
కలగల్పి తెచ్చాను
చూసుకొని అవి యెల్ల
తీసుకొని పోవయ్య.

తోడికోడల నేను
ఈడయున్నానంటు
మది నెంచి నా కేమి
పదిలముగ తెచ్చావు?

తల్లి లేకున్నదైన
ఇల్లొక్కటే మనకు
పోగులేని పొందు
భాగమిని తెచ్చాను.

వారికిని వీరికిని
వరుసగా తెచ్చావు
మగువరో నా కేమి
మిగిలింది లేదాయె?

ప్రత్యేకమై నమా
సత్యముగ నీ కొఱకు
హృదయంతో మధియించి
సుధయంతా తెచ్చాను.

నా దైన సర్వమ్ము
నీదెగా యుండంగ
వేరేమి తేకున్న
నేరమే లేదుగా.

# మారని మనసు



ఇంటి పనులన్నీ ముగించుకున్న పిదప – తలుపులన్నీ బాగా మూసివున్నాయా అని ఒకసారి చూసింది కమల. తర్వాత పడగ్గదిలోకి ప్రవేశించింది. అప్పటికి గోడ గడియారం తొమ్మిదిన్నర జష్టిచేసింది.

మంచంపై పడుకున్న ప్రభాకర్ – చదువుతున్న పుస్తకాన్ని మూసి – "నీ పనులన్నీ ముగిసినట్టేనా, ఇంకా ఏమైనా మిగతా వుందా?" అని నవ్వుతూ తన అర్థాంగిని ప్రశ్నించాడు...

"సంసారమన్న తర్వాత – ఎప్పుడూ ఏదో ఒక పని వుండకుండా వుంటుందేమిటి?...ఆమాట ఇప్పుడెందుకు గాని, మీ రింకా నిద్రపోలేదా?" అంటూ భర్త పాదాలదగ్గర కూర్చుని, చీరకొంగుతో తన ముఖాన్ని మెల్లగా ఒత్తుకుంది, కమల.

"నిద్ర వస్తేనా" అని చిలిపిగా – ఓరగా ఆమె కళ్లలోకి చూశాడు ప్రభాకర్.

భర్తమాటలకి ఊకొట్టి, ఒక నవ్వును పువ్వులా విసిరి – అక్కడినుండి లేచి, టేబిలుముందు కూర్చుంది కమల. ఆ వారపు వారపత్రికను తిరగేస్తూవుండిపోయింది, కొన్ని నిమిషాలవరకూ.

కొంతసేపటి తర్వాత తన ముంగురులను ఎవరో తాకినట్టు అనిపించగా – చదువునుంచి చూపు మరల్చింది కమల.

"కమలా!..." ఆప్యాయంగా – ఆమె కురులను నిమురుతూ జాలిగా అన్నాడు ప్రభాకర్.

మౌనం వహించింది కమల.

## సి. డి. ఎస్. రామయ్య

"కమలా!..." మళ్లీ జాలిగా పిలిచాడు భర్త.

"చెప్పండి – ఊరికే పిలవడం దేనికి?... నాకు వినబడుతోందిగా!..."

"ఒక్కమాట!..."

"చెప్పకపోతే – నా కెలా తెలుస్తుందండీ?"

"తీరా, నా మనస్సులోని మాట చెప్పిన తర్వాత – నువ్వేమైనా అనుకుంటావేమోనని – నే ననుకుంటున్నాను..."

"మీ మాట విననేనా మీ అనుమానం..." అంటూ – పుస్తకం మూసి భర్తవైపు చూసింది కమల: "ఫరవాలేదు, చెప్పండి!"

"ఒకని ఆపదలో, చేయూత నిచ్చి, సహాయపడడం – ఒక స్నేహితుని ధర్మం కాదా?"

"నిజమే; ఎవరు కాదన్నారు?"

"అదిగో, అడ్డు ప్రశ్నలు వేశావంటే, నే చెప్పను!"

"తర్వాత...?"

"ఆ పరీక్షాసమయం నాకూ వచ్చింది. మా ఆఫీసులోనే పని చేస్తున్న నా స్నేహితుడికి ఆదుర్భాగ్యం పట్టింది. అతని భార్యకు నెలలు నిండాయట. కాన్పుకు ఆస్పిటల్ చేర్పించాడట. ఎక్కడినుంచో రావలసిన డబ్బు, అవసరానికి – చేతికి అందలేదట... ఒక్క యాభైరూపాయలు ఎలాగైనా సరిదిద్దమని ప్రాధేయపడ్డాడు..."

"పోనీ, అతగాడి కోరిక తీర్చలేకపోయారా? ఈ విషయం – నాతో చెప్పవలసిన అవసరం యేముందని?"

"అదిగాదు, కమలా!...నెలాఖరులో –

ఉన్నపళంగా యాభైరూపాయలు సహాయ పడమంటే, నాలాటివాడికి సాధ్యమా?..."

"అయితే, నన్నేం చేయమంటారండీ?"

"మరేం లేదు, కమలా!...ఎలాగూ అతనికి ఇస్తానని మాట ఇచ్చాను కాబట్టి, తీరా ఆలోచించి ఆ డబ్బు సంపాదించగలిగిన మార్గం కూడా కనిపెట్టాను..."

"ఘటికులే!..."

"ఆ మార్గం చెపుతాను! మరేం కోప్పడవు గదా?"

"కోపం దేనికి? చెప్పండి!"

"నీ... నీ... నెక్లెసు తాకట్టు బెట్టి, ఆడబ్బు..." అని ప్రభాకర్, తన మాటల్ని పూర్తి చేయకముందే, కమల కమల నయనాలు - అతన్ని ఊరుకోబెట్టింది ఆవేశించిన కళ్ళతో అతని ముఖంలోకి చూసి, చివాలున లేచి—

"ఓహో! ఇదా, మీ ఎత్తుగడ! ఇందుకేనా మీరు నన్ను సలహా లడుగుతున్నట్టు లాలించారు" అని నాలుగు మాటలూ కక్కి, చక్కా వెళ్ళి మంచంమీద కూర్చుంది.

"ఏం చెయ్యను, కమలా!...అతను నా స్నేహితుడు...ఎప్పుడూ కించిత్తు సహాయమైనా అడిగినవాడు కాదు...అడక్క, అడక్క అడిగాడు...సరేనని చెప్పాను... అందుకే..." అంటూ - వేడుకుంటున్నట్టు భార్యను సమీపించాడు ప్రభాకర్.

కాని, కమల ముఖంలో ఆవేశచిహ్నాలు తగ్గలేదు..."మీ స్నేహితుడి సహాయానికి - నా నెక్లేసే - మీ కళ్ళబడింది. స్నేహితుడికి సహాయం చెయ్యాలని అంతగా అభిలాషవుంటే - ఎక్కడో మీ కెరిగినచోట అప్పో, సప్పో చేయడానికి ప్రయత్నించండి!..."

"నెలాఖరులో అప్పు ఎవరిదగ్గర పుట్టుతాయి, చెప్పు కమలా?..."

"ఏమో, అదంతా నాకు తెలీదు!... ఏమైనా సరే, నా సొమ్ముని తాకట్టుబెట్టే పనికిమాత్రం - నే నొప్పుకోను!"

"ప్లీజ్..."

"వీల్లేదు!..."

"అలా చెప్పకు కమలా!...కుదువబెట్టడం వల్ల నీ సొమ్ము చేయిజారిపోతుందనుకుంటున్నావా?...పిచ్చిపిల్లా!... నాలుగురోజులు ఓపికపట్టు!...జీతంరాగానే నేనే విడిపించి, నీదగ్గిర చేరుస్తాను..."

"మీ రేమైనా చెప్పండి!...నెక్లెసు ఇవ్వడానికి నేను సమ్మతించను!"

భార్యలోకనుపించిన మొండిపట్టు-భర్తకు చిరుకోపం తెప్పించింది: "కమలా!...నీ భర్తనన్న హోదాలో అడుగుతున్నాను... ఆ సొమ్మును ఇవ్వవా?"

"ఇవ్వను..." అని పట్టుగా జవాబిచ్చింది కమల: "ఆ సొమ్మును మీకేం చేయించలేదు- నాకు! నా తలిదండ్రులు చేయించారు!...దాన్ని...- వినియోగించు కోవడంలో మీకేం అధికారంలేదు!..."

"కమలా!.." ఆవేశం రగిలి, ప్రజ్వరిల్లి - అగ్నిపర్వతంలాగా బద్దలయిపోగా- చేయెత్తి భార్య చెంపమీద చెళ్లున కొట్టబోయి-

మానవత్వం అతన్ని మేల్కొలిపింది;—

తమ ఐదేళ్ళ గృహస్థజీవితంలో-కమలతో ఎన్నోమార్లు అల్లరితనంతో చిల్లరపోట్లాట జరిపాడు. అవన్నీ మంచుపొరలలాగా విడిపోయాయి. అలాటి సమయాలలో - ఎప్పుడూ చెయిజేసుకోలేదు తను. కాని, ఈ క్షణంలో - అర్ధాంగిచెంపను చెళ్లుమనిపించడం ఏదో నీచతనంగా- నాగరికత హరించిపోయిన రాక్షసత్వంగా అనిపించి-

ఆవేశాన్ని అణచుకుని - మరోమాట గూడా మాట్లాడడానికి అశక్తుడయి- కుమిలిపోయి- మంచంమీద కుప్పగా కూలిపోయాడు ప్రభాకర్.

భర్తకు ఆవేశాన్ని తెప్పించానన్న స్త్రీత్వం కమలను హెచ్చరించినా- తను నడుచుకున్న విధంలో ఎలాంటి తప్పిదం లేదని ఆమె తృప్తిపడి నిట్టూర్చింది.

ఆ ఘటనమూలంగా - ఆ రెండు హృదయాల్లూ వేర్వేరు పడకలను ఆశ్రయించాయి..

* * *

ఆఫీసుకు బయలుదేరబోతూ- టేబిలుమీదున్న రిస్టువాచీ అందుకోబోయిన ప్రభాకర్- ఆ టేబిలుమీదనే మరో చీటీకాగితం వుండడం గుర్తించాడు... అందులో "ఈ పూట వంట ఏమిటండీ?" అని వ్రాసివుంది. ఆ కాగితపు ముక్కను ఎవరు వుంచారో గ్రహించడానికి- అతని కాట్టేసేపు పట్టలేదు...రాత్రి జరిగిన రాద్ధాంతంమూలంగా- తన అర్ధాంగి అలక జెందిందనీ, తర్వాత రెండు రోజుల వరకూ- ఆ పరిణామం అలాగే కొనసాగుతుందనీ అతనికి తెలుసు. కాబట్టి, మరేం ఆలోచించలేకపోయాడు!... వాళ్ళకది మామూలే! అందువల్ల, ఆచీటీ వెనకనే - "చెప్పడానికి నేనెవర్ని?-రాణిగారియిష్టం!" అని నాలుగుముక్కలూ వ్రాసి, బయటికి నడిచిపోయాడు...

ఆఫీసులో ప్రవేశించగానే - తనని సహాయం కోరిన స్నేహితుడు- సుందర్రావు ఎదురయ్యాడు. అతన్ని చూడగానే - ముఖం ఎత్తి అతనికేసి చూడలేక-వంచుకున్నాడు ప్రభాకర్... డబ్బువిషయమై సుందర్రావు ప్రశ్నిస్తే తనేం సమాధాన మివ్వగలడు?

తనని సమీపించగానే- ప్రభాకర్ ఒడిదుడుకుగా కలవరం జెంది ... "సుందర్"... అని ఇంకా ఏమో చెప్పబోయేంతలోనే, ఆ మిత్రుడు మాటల్ని అందుకొన్నాడు:

"ప్రభాకర్!... డబ్బువిషయంగురించి నీతో చెప్పాలనే నేను వస్తున్నాను...నే నడిగిన డబ్బు, నాకవసరంలేదోయ్!..."

మిత్రుడి మాటలు విని ప్రభాకర్ తెల్లబోయాడు. ఒకవేళ- తనలోని బలహీనతను గుర్తించాడా ఏమిటి అనుకుని- నింపాదిగా "ఏం?" అని మాత్రం అనగలిగాడు- ఆశ్చర్యంగా.

"మరేంలేదు ... మా మామగారు గ్రామం నుండి రాత్రివచ్చాడు...డబ్బుఇబ్బందిని ఒకవిధంగా సరిదిద్దాడుగూడా!..." అని చిరునవ్వుతో- సంతోషం వెలిబుచ్చాడు, సుందర్రావు.

"ఓహో!... అలాగా!..." అని సూటిగా సమాధానమిచ్చి ఊరుకున్నాడు ప్రభాకర్.

"నీకు చాలా శ్రమ కలిగించివుంటాను-ఈ విషయంలో!- మరేం అనుకోకు!"అన్నాడు సుందర్రావు.

"ఫరవాలేదు! ఇదో శ్రమా, తక్కా?!" అని-

తన బలహీనతను గ్రహించి, భగవంతుడే ఒకవిధంగా తన మిత్రుడికి సహాయపడి- తనను స్నేహధర్మాన్నుండి రక్షించబడ్డట్టు- తృప్తిగా నిట్టూర్చాడు—ప్రభాకర్.

* * *

రెండోరోజు సాయంకాలం—

ఆఫీసునుండి-ఇంటికి తిరిగి వస్తూండగా- బజార్లో, తన్నెవరో పేరెట్టి పిలవగా-వెనుతిరిగి చూశాడు ప్రభాకర్.

కొంతదూరంలో-బ్యాంకిలో ఉద్యోగం చేస్తున్న రామమూర్తి - తన మిత్రుడు-ఆగమన్నట్టు సైగచేశాడు...

ఇద్దరూ కలిసి—పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ కొంతదూరం నడిచారు. కొంతసేపటి తర్వాత రామమూర్తి—ఏదో జ్ఞాపకానికి తెచ్చుకున్నట్టు—"అవును గానీ, ప్రభాకర్! చేతినిండా సంపాదిస్తున్నా గూడా—నీజీతం చాలడంలేదా, ఏమిటి?" అని తటుక్కున అడిగేసరికి—ప్రభాకర్ ఒక్కసారి భ్రమిసిపోయాడు...తన జీతం రాళ్లు తన సంసారానికి చాలడంలేదని, ఎవరు చెప్పారీ ఘనుడితో? ఏ పరిణామాన్ని బట్టి, అతనలా ప్రశ్నించాడో ప్రభాకర్ కు బోధపడలేదు.

"ఎందుకలా అడుగుతున్నావ్?" అని

**మనమంచికే!**

ఒకడు: హోటల్లో ఏదితిన్నా త్వరగా అరిగి చావదురా?

ఇంకొకడు: అదీ మనమంచికే! అన్నిటికీ ధరలు పెరిగాయికదా: త్వరగా అరిగి మళ్ళీ అకలైతే!

—శేషాచార్యులు (మద్రాసు)

# మగవమనసు

ప్రశ్నించాడు ప్రభాకర్, ఆశ్చర్యముఖం పెట్టి.

"మరేంలేదు; నీ శ్రీమతి నిన్నటిరోజు — మా కొంపకు వచ్చి, ఓ నెక్లెస్ తాకట్టు పెట్టి, వందరూపాయలు తీసుకుపోయింది... మీకేం అవసరమొచ్చిందో, అడుగుదామనే అనుకున్నాను... కాని, ఆమె నడగడం భావ్యంగా అనిపించలేదు... కాబట్టే నిన్ను అడుగుతున్నాను... ఏమిటోయ్, అంత అవసరం?" అని రామమూర్తి తనను అడిగినప్పుడు, ప్రభాకర్ ఒక్కసారి అతని మాటల్ని నమ్మలేకపోయాడు. అయితే రామమూర్తి పరిహాసానికైనా అబద్ధం చెప్పే మనిషి కాదన్న విషయం తనకు తెలుసు కాబట్టి, మిత్రునిమాటల్ని నమ్మక తప్పలేదు... కాని, అతని ప్రశ్నకు ఉన్నపళంగా సమాధానం చెప్పలేకపోయాడు...

"నేను తీసుకురమ్మన్నాను!" అని అబద్ధాన్ని — అవసరమొచ్చేందువల్ల — చెప్పాడు ప్రభాకర్!

"కారణమేమిటోయ్?" — రామమూర్తి మళ్ళీ ప్రశ్నించగానే —

"గ్రామంనుండి మా బంధువులెవరో వచ్చి — వాళ్ళ డబ్బుకుగాను ముందులా అవి కొనడానికి కావాలని —" అని, ఆ క్షణంలో తోచిన సమాధానాన్ని వదిలాడు ప్రభాకర్!...

"నెక్లెస్ తాకట్టు పెట్టేంతటి ధీరుడవయ్యావన్నమాట!... అవసరానికి సాయం చెయ్యడానికి — స్నేహితులమంటూ — మేం చచ్చిపోయామనుకున్నావా — దొరా?! — పైగా నీ ప్రవర్తన ఈ మధ్య మారుతున్నట్టు కనిపిస్తోంది — జాగ్రత్తరా నాయనా!—" అని హెచ్చరిస్తున్నట్టు మందలించాడు రామమూర్తి.

నవ్వలేక నవ్వి — ఇంటిముఖంపట్టాడు ప్రభాకర్!

* * *

"ఏయ్!...కమలా!..."—ఇంట్లో జొరబడుతూనే ఆవేశంతో పిలిచాడు ప్రభాకర్.

వంటింట్లోవున్న కమల, తనభర్త పిలుపుకు ఆశ్చర్యపోయింది...నెమ్మదిగా—భర్త దగ్గరకు వచ్చింది. అతనిలోని ఆవేశపు చిహ్నాలను గుర్తించి — జరగకూడనిదేదో జరిగిపోవడంవల్ల, అతని మూర్తిలోని రంగులు మారివుంటాయని గుర్తించింది.

"నెక్లెస్ ఏదీ?" అని ప్రశ్నించాడు ప్రభాకర్.

ఆశ్చర్యంగా భర్తముఖంలోకి చూసింది అర్ధాంగి.

"ఏమిటి?!—నామాటలు వినబడ్డంలేదూ? —నీ నెక్లెస్ ఏదీ అని అడుగుతున్నా!—" అని మళ్ళీ ప్రశ్నించాడు ప్రభాకర్.

"ఇప్పుడెందుకూ?" అని అడిగింది కమల.

"నేను తొడుక్కొని, అందం చూసుకోడానికి!" అని అపహాస్యంగా అని—"ఎందుకైతే నీకేం?—అడుగుతుంటే, తీసుకురా!" అని హుంకరించాడు...

"ఇప్పుడు నాదగ్గర లేదు!" అని ముఖం దించుకుంది కమల.

"ఏం? ఎక్కడికి వెళ్ళింది?"

"మా బంధువులొకరు డబ్బు అవసరమని రాస్తే, దాన్ని తాకట్టు పెట్టి వందరూపాయలు వాళ్ళకు పంపించాను!"

తన మిత్రుడివద్ద బొంకినమాటలు—ఇలా నిజస్వరూపంలో—తన అర్ధాంగిచేత విన్నందుకు, ప్రభాకర్ ఆశ్చర్యపోయాడు...

"మగవాడున్నాడన్నమాటగూడా మరచి, సొమ్ము తాకట్టు పెట్టేంత స్వేచ్ఛగూడా పొందావన్నమాట!—నాతో ఆ విషయం చెప్పడంలో నీ సొమ్మేం పోతుంది?"

"చెప్పుదామనే అనుకున్నాను...కాని, ఎలాగూ మీరు సమ్మతిస్తారనే నమ్మకంతో..."

"నోర్ముయ్!... దొంగతిరుగుళ్ళు!... నా అవసరానికి తాకట్టుపెట్టమంటే—విరజిమ్ముకున్నావు!...తీరా, మీ బంధువులకయితే మాత్రం మనస్సొప్పిందికదూ!..."

"ఈ విషయంలో మీరేపొరబడుతున్నారు...అలాంటి అభిప్రాయం నాకేమీ లేదు గూడా!..."

"అయితే, నువ్వు నడుచుకున్నవిధం సబబయినదేనా నువ్వు అనేదీ?"

"తప్పక!...ఆడబ్బు పంపించడం ఎవరికన్నవిషయం—మీకు తెలిస్తే—మీ రీవిధంగా—అనవసరంగా మాట్లాడరు!"

"ఎదిరించడానికి తయారయ్యావన్నమాట!...ఫో, అవతలకి!" అంటూ—

తనచెంపకు తగిలిన భర్తచేతి దెబ్బకు—కమల కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి...ఆవేదనతో అతని ముఖంలోకి ఒకసారిచూసి—చర్రున లోపలికి వెళ్ళిపోయింది.

* * *

స్త్రీకి సహనం అన్నది సర్వసాధారణ భూషణం అంటారు పెద్దలు. కాని, దుదువు

(60-వ పేజీ చూడండి)



## కానీకిరాని సరకు

### (మొదటి బహుమతి రు. 10 లు)

ఇంట్లోవాళ్లు ఏవో కొని తీసుకురమ్మంటే మొన్నోరోజున కోమటి కొట్టుకు వెళ్ళాను. కొట్టు బాగా రద్దీగా వుండటంచేత, అదీగాక నాది కొంచెం పెద్దమొత్తం అవటంచేత, రద్దీ తగ్గేదాకా ఒకమూల నుంచున్నాను.

ఇంతట్లోనే ఒక కుర్రాడు (మహాఉంటే ఎనిమిదేళ్లు ఉంటాయేమో) అక్కడికి వచ్చాడు. ఒక శేరు కందిపప్పు తీసుకొని 11 అణాలు ఇచ్చేడు. శేరు కందిపప్పు ఖరీదు పదణాల ముక్కాని తీసుకొని తిరిగి కాని ఇవ్వబోతూంటే, ఆ కానికి బెల్లంముక్క ఇమ్మన్నాడు. అసలే రద్దీగా ఉందేమో విసుగుతో "కానీకి బెల్లంరాదు పోవయ్యా" అని గసిరాడు మా కోమటి.

ఆ కుర్రాడతినెమ్మదిగా "అలా అయితే ఒక అర్ధణాది తూచు" అన్నాడు. సరే అని అలాగే చేశాడు మా కోమటి. ఒక చిన్న ముక్క తూగింది. "దాన్ని సగం చేయ్" అన్నాడాకుర్రాడు మళ్లీ.

అంతే! కొట్లోవాళ్ళమంతా నోరు తెరుచుకొని ఉండిపోయాం కొన్నిక్షణాల వరకు.

—పి. రామశేషు (రాజమండ్రి)

* * *

## సులువు గ్రహించిన విద్యార్థి

### (రెండవ బహుమతి రు. 5 లు)

లెక్కల మాస్టారంటే మాకందరికీ తగని భయం. అయితే అతను పిల్లల నెవ్వరినీ కొట్టడు. ఏ విద్యార్థి అయినా లెక్క తప్పు చేసినా లేక తప్పు సమాధానం చెప్పినా... ఆ విద్యార్థి జుట్టుపట్టుకొని తలను క్రిందకూ పైకీ బలంకొద్దీ లాగేవాడు. అలా చేయటంలో పాపం ఆ విద్యార్థికి ప్రాణాలు పోయేటంతపని జరిగేది! అయితే ఆ 'ఊపు' లకు అనుగుణంగా తలను క్రిందికీ పైకీ ఆడించితే అంత బాధనిపించదు. మాలో ఒక విద్యార్థి ఈ సులువు గ్రహించి ఆచరణలో పెట్టాడు. ఒకరోజు మాస్టారు ఆ విద్యార్థి జుట్టుపట్టుకొని ఊపుతూ మధ్యలో వదిలేశారు. కాని ఆ విద్యార్థిమాత్రం తలను క్రిందికీ పైకీ ఆడించనిదా ఊపుతున్నాడు. క్లాసంతా ఒక్కసారి గొల్లుమని నవ్వేసరికి ఆ విద్యార్థి మైకంలోంచి బయటపడ్డాడు.

—జె. చక్రపాణి (ఏలూరు)

* * *

## తొందరపాటులో పొరపాటు

### (రెండవ బహుమతి రు. 5 లు)

ఈ సంఘటన ఈ మధ్యనే జరిగింది. బస్సు శరవేగముగా పోతున్నది. నా ప్రక్కన ఎవరో ఒకాయన-మనిషి చాలా భారీగా - తలపాగా, ఖద్దరు లాల్చీలతో-ధాన్యం వ్యాపారికాబోలు - ఏదో మాటాడుతూ బస్సులో కాలక్షేపం చేస్తున్నాడు.

కండక్టరు డబ్బు వసూలు చేస్తున్నాడు. బస్సులో చాలా ఇరుకగాఉన్నది. ఆ ఆసామీ డబ్బులు తియ్యడానికి తన జేబులో చెయ్యిపెట్టబోయి, నాజేబులో పెట్టి పర్సుతీశాడు. మా ఇద్దరికీ ప్రక్కజేబులే! - పొరటాటు తెలుసుకున్నాక అందరం నవ్వుకున్నాం!...

ఆ తర్వాత ఆయన ప్రక్కజేబులమీద ఉపన్యాసం- ఉన్నవీ, లేనివీ కలిపి - దంచాడు. సరే, ఆయన దారిలోఎక్కడో దిగిపోయినాడు.

తర్వాత కొంతదూరంలో నేనూ దిగాను ఏమిటో నాజేబు బరువుగాఉంది. చూదును గదా! ఇంకేముంది - ఆయన పర్సు. పాపం! ఆయనమాటలసందర్భంలో పొరపాటు పడ్డాడు గాబోలు! నాగుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి. కాళ్లు వణికాయి. చెమట పోసింది. భయంవేసింది.

తిరిగి ఇద్దామా; ఆయనది ఏఊరో! ఆయన ఎవరో! - ఎక్కడ ఉన్నాడో! - కాని, ఆయన కనబడితే ఇద్దామనే ఉంది నాకు.

పోతిరెడ్డి శ్రీమన్నారాయణరావు

(బందరు)

* * *

## "తానొకటి తలిస్తే"

### (రెండవ బహుమతి రు. 5 లు)

ఇది నేను అయిదవఫారము చదివేటప్పుడు జరిగిన సంఘటన. మా మిత్రునికి కంచు పాత్రలు చేసే ఫ్యాక్టరీ ఒకటి ఉందిలెండి. కంచుపాత్రలు చేసేందుకు వాళ్లు ముడిసరుకు 'గన్‌మెటల్' దిగుమతి చేసుకొంటారు. ఆ ముడిసరుకులో ఒకరోజు మెటల్‌తో తయారుచేసిన ఒక బొమ్మతేలు వచ్చిందం- ఆ మిత్రుడు దానిని నాకు చూపించాడు. అది అచ్చం తేలులాగే ఉండెను. రంగు మాత్రము ఎరుపురంగు. దానిని చూడగానే నా కొక ఆలోచన తట్టింది. మా ఇంట్లో తమ్ముళ్లి, చెల్లెళ్ల దగ్గర గమ్మత్తు చేయాలను కొని ఆ బొమ్మతేలును తీసుకొని ఇంటికి పోయి, ఎవరికీ తెయకుండా ఆ బొమ్మ తేలుపై బొగ్గునూరి నలుపురంగు పూశాను. అప్పుడది అచ్చం తేలులాగే తయారయింది.

ఆ సాయంత్రం అమ్మ, నాన్న, తమ్ముళ్లు, చెల్లెళ్లు అందరూ వరండాలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూండగా నేను ఇంట్లోకివెళ్లి కొంచెం బంకమన్ను గోడకు అంటించి దానిపై ఈ బొమ్మతేలును అంటించాను. తర్వాత పిల్లలదగ్గరకొచ్చి "ఒరే అబ్బాయిలూ! మనగోడకు ఒక మండ్రగబ్బ లాంటి తేలు కరచుకొనిఉంది. దానిని చూసేందుకే భయంగాఉంది. అయినా మీరేం భయపడకండి. నాకుదుతేళ్లంటే భయంలేదు. నేనొక మంత్రము నేర్చుకొన్నాను. తేళ్లను సునాయాసంగా చేతితో పట్టుకొని నలిపి పారేయగలను" అని వాళ్లందరను లోపలికి పిలుచుకొనిపోయి, ధైర్యంగా దాని దగ్గరికిపోయి నిలబడి, అమ్మ వద్దని వారిస్తున్నా, పిల్లలందరూ భయంతో అరుస్తున్నా, దానిని సునాయాసంగా చేతిలోకి తీసుకున్నాను. ఇంకేముంది, దానిని చేతిలోకి తీసుకున్నానో, లేదో, "అమ్మ బాబోయ్" అని కేకపెట్టి చేతిలోనుండి విసిరిపారేశాను. అప్పటికే 2, 3 చోట్ల తన ప్రతాపం చూపించింది అది. అలా పారిపోతున్న తేలును నాన్న చంపేశాడు. నాకు ఏడుపు ఒకవైపు, అంతకన్నా ఎక్కువగా ఆశ్చర్యం మరొకవైపు. గోడక్రింద చూడగా నా బొమ్మతేలు పడిఉంది. ఇంతకూ జరిగిందేమిటంటే అటకమీదనుండి నిజమైన తేలొకటి సంచారంచేస్తూ, అచ్చం తేలువలె గోడకు కరచుకొని ఉన్న బొమ్మతేలును చూచి, తన మిత్రుడిని పలకరించుదామని దీనిదగ్గరకువచ్చి, దీనిని కదిపింది. ఇది క్రింద పడిపోగానే దీని స్థానంలో అది నిలచింది. ఆ తర్వాత జరిగింది తెలిసిందేగా. తర్వాత ఆ మందు ఈ మందు వేయగా 20 రోజులకు కాని బాధ తగ్గలేదు. అప్పటినుండి ఎక్కడ తేళ్లను చూచినా, ఈ సంఘటన జ్ఞాపకం వస్తుంది.

పోలి వెంకటముని

(పావగల్, కాళహస్తి.)

# హరి వంశము

## సభా పర్వము-4

అ|క్రూరుం డట బోకమున్న
మధురేశాజ్ఞప్తుడై
కేశినామ|క్రూరాసురు డశ్వరూపమున
నున్మాదాతిరేకంబుచే
నా|క్రాంతంబగు నంతరంగమున
బృందారణ్యముం జొచ్చి
దోర్విక్రాంతిం జరియించె
గోపకుల ముద్వేగిల్ల
వేగోద్ధతిన్.

—హరివంశము

అంధకుని మాటలు వినగా కంసునికి కళ్లు ఎఱ్ఱబడినాయి. క్రోధం చేత అతను వివశుడై పోయినాడు. ఆ క్రోధంలో కూడిన దృష్టితో సభను ఒక్కసారి కలయజూచి కంసుడు మరోమాట మాట్లాడక, సభను చాలించి తన మేడలకు కదిలిపోయినాడు. తక్కుంగల రాజులు గూడా తమతమ ఇండ్లకు వెళ్లిపోయినారు. కంస వైకృతి కింసనులు, విగతసంకల్పులు అయి ఆ అందరు వెళ్లిపోయినారు. కంసుడు మాత్రం విగతసంకల్పుడు కాలేదు. అతనికి ఇప్పుడు శ్రీకృష్ణునివలన భయంతోపాటు క్రోధంగూడా అధికమైపోయింది. అక్రూరుని ఆహ్వానాన్ని అందుకొని వారు వస్తారా! వస్తే, తన కార్యం నెరవేరినట్లే ననుకున్నాడు కంసుడు. కంసునికి కృష్ణుణ్ణి గూర్చిన చింతనమే చింతనమైపోయింది. ఈ కృష్ణుడు నీలమేఘాన్ని బోని శరీరవర్ణం కలవాడట; తామరరేకులవంటి కన్నులు కలవాడట; సర్వగోపికాజనమనోహరాకారుడట; వసుదేవుని లోని సాధుత్వము, దేవకియొక్క మంచితనము, అతనిలో వుండి వుంటాయి. లేకపోతే ఇంతమంది ప్రేమకు ఆ కుఱ్ఱవాడు పాత్రం కావడమే వుండదు. అయితే ఆకుఱ్ఱవాడు ఎంతటి వీరుడు! ఎంతటి పరాక్రమం కలవాడు! వసుదేవుని సాధుత్వం వున్నదిగాని అది విచిత్రమైన సాధుత్వం. సభలో తాను అన్నిమాటలు అనగా, ఆ వసుదేవుడు తిరిగి ఒక్కమాట అనలేదు. అది తనయందు ప్రేమచేతనా! జాలిచేతనా! లేక పుత్రులయందు తనకుగల మమకారంచేతనా! కంసునికి ఏదీ అర్థంకాలేదు. కాని కంసునికి ఒకటి అర్థంఅయింది. సభలో తన్ను అంధకుడు అవమానించిన పద్ధతి ఒకటి. వసుదేవుడు అవమానించిన పద్ధతి ఒక్కటి. అంధకుని వాగ్ధోరణివలన తనలో క్రోధం రెట్టించింది. వసుదేవుని మౌనం తన్ను అతిమర్మమైన స్థానంలో కొట్టింది. ఆయన ఆ మౌనాన్ని వీడి ఒక్కమాట మాట్లాడివుంటే, తనకు సంతోషం కలిగేది. ఇప్పుడు ఈ వసుదేవుడు తనకు ఆ సంతోషం అన్నది లేకుండా చేసినాడు. అంధకుడు బయటపడినాడు. వసుదేవుడు బయటపడలేదు.

కంసునకు దేవకీ వసుదేవుల చరిత్రమే విచిత్రమనిపించింది. వారిలో ఒకరిని మించిన శాంతం ఇంకొకరిలో వుంది. వారి సంతానాన్ని తాను ఆరుగురిని చంపివేయగా, వారు తన్ను పల్లెత్తుమాట అనలేదు. మరి తానో? ఆ ఆలోచన రాగా కంసుడు కాలనేమి అయిపోయినాడు. జన్మజన్మల వైరం అతనిలో ప్రాదుర్భవించింది. జన్మజన్మలుగా విష్ణువు అనగా తనలో పెరిగిన భయం అతనిలో పెల్లుబికింది. ఈ కృష్ణుడు విష్ణువు. తన్ను చంపడానికి, తనవారిని చంపడానికి ఆవిర్భవించినాడు. ఇతనిని తాను చంపడమో, లేక అతనిచేతిలో చావడమో! వేరే మార్గంలేదు. అనుకోగా కాలనేమి కంసుడైపోయినాడు. అక్రూరునికి తాను ఇచ్చిన ఆజ్ఞలు గుర్తుకు వచ్చినాయి. అక్రూరుడు మందలకు బయలుదేరిపోయినాడా! ఆకృష్ణుడు మిథిలనుంచి వచ్చినాడా! మిథిలనుండి ఇంకా రానిచో, ఇప్పుడు అక్రూరుని ప్రయాణము వ్యర్థము. ఈ ఆలోచనలో కంసుడు ద్వారికుని పిలిచినాడు.

"ఎవరురా! అక్కడ!

"చిత్తము! నేను ద్వారికుడను"

"ఓరి! మహామాత్రుణ్ణి పిలు"

"చిత్తము"

ద్వారికుడు వెడలిపోయినాడు. కంసుడు తిరిగి ఆలోచనలో పడినాడు. దేవకి ఏమిదేవకి? తాను తనపిల్లలను సంహారించగా "కంసా! వారు అట్లా నీచేతిలో మృతినందుటకు పుట్టారు" అన్నది. తన్ను కంసుణ్ణి, సుఖంగా వుండమన్నది. మరి ఆసుఖం తనకు లేదు. దేవకికి,లేదు,వసుదేవునకు లేదు. ఎవ్వరికీలేదు. ఆ లేనిసుఖంకోసం తాను ఏదోచేస్తున్నాడు. ఇప్పుడు దేవకి అష్టమగర్భం సంహారం కోసం తాపత్రయ పడుతున్నాడు. దేవకి తన్ను ఏమి చేసింది? వసుదేవుడు ఏమిచేసినాడు? ఈకృష్ణుడు ఏమిచేసినాడు? తన్ను ఏమిచేసినా తనలోనిభయం చేస్తోంది.

"మహారాజా!"

"ఎవ్వరు! మహామాత్రుడా!"

"అవును! మహారాజా!"

"మిథిలనుండి వార్తలు ఏమైనా అందినవా?'

"ఇప్పుడే కేశి వచ్చినాడు!"

"మిథిలకు కేశికి సంబంధం ఏమిటి?"

"ఆవార్త తెచ్చినాడు"

"ఏమని తెచ్చినాడు?"

"శ్రీకృష్ణుడు మిథిలలో బయలుదేరినాడట"

"అయితే అప్పుడే అక్రూరుడు బృందావనంపోయి ఏం చేస్తాడు?"

"కేశిగూడా అదూటే అన్నాడు"

"సరే! మహామాత్ర! నీవు అక్రూరుని ఇంటికి వెళ్ళి, బృందావనం తరువాత పోవచ్చునని చెప్పు."

"అట్లాగే! మహారాజా!"

హారిత శివశర్మ

# ప్రయాణంలో ప్రణయం

*

'ఆనందకృష్ణ'

మధ్యాహ్నం రెండుగంటలకి రావలసిన రైలు 'నాకేం' అన్నట్టుగా రెండు గంటలు లేటుగా నాలుగు గంటలకి చేరింది రాజమండ్రీ స్టేషనికి. రైలు ఆగడం తరువాయి మూర్తి, శాస్త్రి మూర్తి బర్త్ వి కంపార్ట్ మెంటులోకి ఎక్కి పెట్టె, బెడ్డింగూ లోపల పెట్టించారు. రైలు కదిలేవరకూ ప్లాటుఫారం మీద కబుర్లు చెప్పుకుంటూ రైలుకదిలాక రైలెక్కారిద్దరూ. అంతవరకూ కంపార్ట్ మెంట్ లో ఎవరున్నారో కూడా సరిగా చూడలేదు. ఆకంపార్ట్ మెంట్ లో మూర్తితో ప్రయాణం చేసేవారు ఒక పెద్దమనిషి, మరొక అమ్మాయి. తక్కిన బర్తులు అన్నీ ఖాళీ.

రైలు గోదావరి స్టేషను సమీపిస్తోందన గానే, "అరేయ్! మూర్తి ఈమాటైనా అదృష్టం నీవైపు ఉంటుందనుకుంటా" అంటూ ఏదో కంగారు కంగారుగా మాట్లాడుతున్నాడు.

"ఈ రైలు చూస్తేనే తెలుస్తోంది, మన అదృష్టం. రెండుగంటలు లేటు! సికింద్రాబాద్ లో కాన్ఫరెన్స్ మిస్ అయితే ఇంకపూర్తి అవుతుంది" అన్నాడు మూర్తి నవ్వుతూ.

రైలు గోదావరిస్టేషనులో ఆగడం కదలడం జరిగింది. చివరిమాటుగా "బెస్ట్ఆఫ్ లక్" అంటూ స్నేహితుడుకి వీడ్కోలు చెప్పి పోయాడు శాస్త్రి.

మూర్తి పడ్డాడనే చెప్పాలి. ఇరవై రెండు, ఇరవైమూడు సంవత్సరాలు దాటదు అతని వయస్సు. ఎవరినైనా ఇట్టే ఆకర్షించగల అందమైన విగ్రహం, మొహంచూస్తేనే చెప్పవచ్చు ఏదో పెద్ద కుటుంబంలో వారేనని.

శాస్త్రి వెళ్ళిపోగానే మూర్తి తనబర్త్ మీద పక్క వేశాడు. ఏవో పుస్తకాలు తీసిచూస్తూ కూచున్నాడు.







గోదావరి బ్రిడ్జి మీద మందంగా నడుస్తోంది రైలు. మూర్తి మధ్యమధ్యలో పుస్తకం చదవడం మానేసి గోదావరి వైపూ, గోదావరిలో పోతున్న పడవలవైపూ చూస్తున్నాడు. అనుకోకుండా ఎదుటిసీట్లో కూర్చున్న అమ్మాయి వైపు చూశాడు మూర్తి. అంతవరకూ అతనివైపే చూస్తున్న ఆ అందమైన అమ్మాయి తక్కున తనకళ్ళు తిప్పేసింది సిగ్గుతో.

"ఎంతదాకా వెడుతున్నావు నాయనా!" పెద్ద తరహాగా ప్రశ్నించాడు అంతవరకూ పేపరుచూస్తున్న పెద్దమనిషి పేపరు మడిచేస్తూ. ఆయన వయస్సు ఏభైసంవత్సరాలుండొచ్చు. బట్టలూ వాలకం చూస్తే పెద్ద ఉద్యోగస్తుడు లాగానే కనిపించాడు మూర్తికి.

"బొంబాయ్ పోతున్నానండీ" అని వినయంగా జవాబిచ్చి "మీరెంతవరకూ వెడుతున్నారండీ?" అని ఎదురు ప్రశ్న వేశాడు, మూర్తి.

"మేమూ బొంబాయే."

"సికింద్రాబాద్‌నుంచి మీరు [illegible] ట్రెయిన్‌లో రిజర్వ్ చేయించారా?" మూర్తే అడిగాడు.

"పొద్దున్నే రైలులోనే రిజర్వ్ చేయించాము. కాని ఈ రైలు వాలకం చూస్తే సికింద్రాబాద్‌లో కనెక్షన్ దొరుకుతుందని నాకు నమ్మకంలేదు". రైలు వేగంగానే పోతోంది. మధ్య మధ్యలో మాటలు సాగుతున్నాయి.

"ఎవరి అబ్బాయివి?" మళ్ళీ ఆయనే అడిగాడు.

సమాధానం చెప్పాడు మూర్తి, తను పబ్లిక్ ప్రాసిక్యూటర్ పరంధామరావుగారి ప్రథమ పుత్రుడనని.

"ఏం చేస్తున్నావ్?"

అయినా ఎందుకండీ ఈ ప్రశ్న అన్నట్టుగా ఆయనవైపు చూసింది ఆ అమ్మాయి.

"[illegible] అన్నట్టు కాలేజీ లెక్చరర్ అండీ" జవాబిచ్చాడు మూర్తి నవ్వుతూ.

"బొంబాయి ఏదైనా ఇంటర్వ్యూ కోసమా?"

"అవునండీ" అంటూ ఆ ఉద్యోగం ఏకంపెనీలోనో, దానికి కావలసిన క్వాలిఫికేషన్స్ ఏమిటో, తన క్వాలిఫికేషన్స్ ఏమిటో అన్నీ ఏకరువుపెట్టేడు మూర్తి. ఆ ముసలాయన అవన్నీ ఎలాగా అడుగకమానడని.

"అయితే ఇంకేం? కావలసిన క్వాలిఫికేషన్స్ అన్నీ ఉన్నాయ్ నీకే వస్తుందనుకుంటా."

మూర్తి నవ్వుతూ "క్వాలిఫికేషన్స్‌ని బట్టి ఉద్యోగం వచ్చేటట్టయితే నేను యింతవరకు వెళ్ళిన ఇంటర్వ్యూల్లో ఏదో ఒకటి రావలసిందే" అంటూ.

"ఒక ఇంటర్వ్యూకి నేనూ నామిత్రుడు వెళ్ళాం. అతనిది ఎమ్. ఏ. లో జస్ట్ సెకండ్ క్లాసు. నాది యూనివర్శిటీ ఫస్ట్, నాకే వస్తుందనుకున్నా ఆ ఉద్యోగం. కాని ఆ ఉద్యోగం అతనికే ఇచ్చారు. అలా జరగడానికి కారణం ఆ కంపెనీ డైరెక్టర్లలో ఒకాయనకి ఆ మిత్రుడు అల్లుడు అయ్యే వరకూ తెలీలేదు."

ఇలా ఒకటేమిటి? తనకు జరిగిన అన్యాయాలన్నీ ఏకరువుపెట్టేడు.

"ఇంతకీ నీకు వివాహం అయ్యిందా?"

లేదని అడ్డంగా తలూపాడు మూర్తి.



# ప్రయాణంలో ప్రణయం

"పోనీ నువ్వుకూడా అలా ఒక డైరక్టరు గారిని ఎందుకు మామగారు చేసుకోకూడదు?" నవ్వుతూ ప్రశ్నించాడు ఆయన.

"అటువంటి ఉద్దేశ్యం ఉంటే ఎప్పుడో చేసుకునేవాడిని. కాని ఉద్యోగంకోసం నేను దొంగదార్లు పట్టదలుచుకోలేదు. మా నాన్నగారికి కూడా ఇష్టంలేదు అలా చెయ్యడం" అన్నాడు తన నిశ్చయం తన మాటల్లో తెలిసేలా.

మూర్తి మాటలు వినగానే సంతోషంతో ఆయన నవ్వేశాడు.

అంతవరకూ వాళ్ళ సంభాషణ వింటూన్న ఆ అమ్మాయి కూడా నవ్వేసింది.

"మా అమ్మాయి రాధ, బియ్యే ప్యాసయ్యింది, బొంబాయి యూనివర్శిటీనుంచి ఈ సంవత్సరమే" అంటూ మూర్తికి పరిచయం చేశాడు.

రైలు మెల్లిగా ఏలూరు చేరింది. భోజనానికి ఆర్డరిస్తున్నాడు మూర్తి. "మీరు కూడా ఆర్డరిమ్మంటారా?" ఆయన్ని అడిగాడు మూర్తి.

"అక్కర్లేదు. క్యారియర్ ఉంది. నువ్వు కూడా మాతో తిందువుగానిలే నాయనా" అన్నాడు ఆపేక్షగా.

"అబ్బే ఎందుకులెండి! క్యారియర్ తెప్పించుకుంటాను" అన్నాడు మూర్తి, మీరు తెచ్చుకున్న క్యారియర్లో నాకు కూడా ఎక్కడ పెడతారు అన్నట్టుగా.

"మీకు కూడా సరిపోతుందిలెండి. మాతో పాటే తిందురుగాని" అంది ఆ అమ్మాయి.

ఆయనమాట కాదనగలిగాడు కాని ఎందుకో ఆ అమ్మాయిమాటని తోసెయ్యలేక పోయాడు మూర్తి.

ముసలాయన భోజనం చేసిన కాస్సేపటికి నిద్రపోయాడు. రాత్రంతా ఏదో పుస్తకం చదువుతూనే ఉన్నాడు మూర్తి.

"ఏమిటండీ! ఏదో పరీక్షకు చదివినట్టు చదువుతున్నారు. ఈ ఇంటర్వ్యూకి?" ప్రశ్నించింది సిటీ అమ్మాయి కొంటె నవ్వుగా.

"అబ్బే ఇది ఇంటర్వ్యూకోసం కాదండీ! పెరల్ బక్ నావెల్. అయినా ఈ ఇంటర్వ్యూల కోసం శ్రమ పడడం దండగండీ! తీరా ఏ డైరక్టరు చుట్టమో వస్తాడు. ఉద్యోగం తన్నుకు పోతాడు" అన్నాడు మూర్తి.

"పోనీ మీరూ ఎవరినైనా..."

"పూర్తి చెయ్యండి! ఏ డైరక్టరునో మామగారు చేసుకోమనీ. అంతేగా? మీరిచ్చే సలహా .....చూడండీ అలా ఉద్యోగం సంపాదిస్తే లోకువ అయిపోతామండీ. అంతెందుకు? మా కజిన్ ఒకతను ఒక పెద్ద ఆఫీసరుగారికి అల్లుడయి ఉద్యోగం సంపాదించాడు. ఇప్పుడేదో పెద్ద ఉద్యోగమే చేస్తున్నాడు. ఉత్తి బియ్యే ప్యాసయ్యాడండీ! ఇప్పటికీ అంటూనే వుంటారు వాడి స్నేహితులు, మామగారి ధర్మమా అని మంచి ఉద్యోగమే సంపాదించాడు అని."

"లోకంతోపాటు మనంకూడా మారిపోవాలండీ. అందరూ అలా చేస్తున్నప్పుడు మీరు కూడా అలా చెయ్యడంలో తప్పేముంది?"

దీపపు కిరణాలు ఆమె మొహంమీద పడుతున్నాయి. తెల్లనైన ఆమె మొహం తళతళా మెరుస్తోంది. ఆమెవైపే రెప్ప వాల్చకుండా చూడాలనిపిస్తోంది మూర్తి మనస్సు. అలా చూస్తున్నవాడల్లా ఆమె ప్రశ్నకి నవ్వేసి "అబ్బే ఉద్యోగం లేకపోతే పోనీలెండి. నేను మాత్రం అలా చెయ్యలేను" అన్నాడు మూర్తి.

* * *

రైలు పొద్దున్న తొమ్మిదిన్నరకి చేరింది సికింద్రాబాద్. కనెక్షన్ మిస్ అయ్యారు. వెయిటింగ్ రూమ్స్‌కి దారితీసారు ముగ్గురూ. స్నాన భోజనాలయ్యాక మూర్తి రిజర్వేషన్స్ చేయించాడు సాయంత్రం రైలులోనే. వాళ్ళ అదృష్టం, ముగ్గురికీ ఒకటే కంపార్ట్‌మెంట్‌లో బర్తులు దొరికాయి. రిజర్వేషన్స్ సంగతి ఆయనకి చెప్పి "మీరిక్కడే ఉంటారాండీ. లేకపోతే ఎక్కడికైనా పోతారా?" అడిగాడు.

"నువ్వు బయటికి పోతావా?"

"అవునండీ. ఎప్పటికప్పుడే సాలర్ జంగ్ మ్యూజియం చూద్దామనుకోడం కాని ఇంతవరకూ చూడటానికి కుదరలేదు. సాయంత్రం లోపుగా చూసి వచ్చెయ్యొచ్చు."

"పోనీ మనంకూడా పోదాం నాన్నా. మనమూ చూడలేదు. సాయంత్రం వరకూ ఇక్కడ ఏంచేస్తాం?" అంది రాధ.

"నేను రాలేనమ్మా. బద్ధకంగా ఉంది. నీకు అంతగా చూడాలని ఉంటే ఆయనతో వెళ్ళమ్మా" అని రాధతో అని "చూడు నాయనా నీతోటి రాధనికూడా తీసుకు పోకూడదూ?"

"దానికేముందండి. అలాగే రమ్మనండి" అన్నాడు మూర్తి.

మరో అయిదు నిమిషాల్లో మూర్తీ, రాధా స్టేషను బయటికి వచ్చారు. బస్సులో ఒకే సీటులో కూర్చున్నారు. ఆ అమ్మాయికి ఎక్కడ తగులుతానో ఆ అమ్మాయి ఏమనుకుంటుందో అని చాలా జాగ్రత్తగా కూర్చున్నాడు మూర్తి.

"మీకు ఈ ఊరు బాగా తెలుసు ననుకుంటా?" ప్రశ్నించింది రాధ.

"అవునండీ. ఈ ఊరు చాలాసార్లు వచ్చాను" జవాబిచ్చాడు మూర్తి.

బస్సులోనించి ఏవో బిల్డింగ్స్ చూపించి అదేమిటి? ఇదేమిటి? అని అడుగుతోంది రాధ. మూర్తి వాటను గురించి తనకు తెలిసినంత వరకూ చెబుతున్నాడు. సాలార్ జంగ్ మ్యూజియం చేరారు. పర్సు తీసింది రాధ.

"మనం తిరిగి స్టేషన్ చేరేవరకూ అలా చెయ్యకండి" అన్నాడు మూర్తి, పర్సు తీసినందుకు రాధను వారిస్తూ.

"అబ్బే! అదేమిటండీ అనవసరమయిన ఖర్చు మీకెందుకూ?" అంది రాధ.

"చూడండీ! మీకంటే నేను పెద్దవాడిని. పైగా ఉద్యోగస్థుడిని కూడా. మీరు మళ్ళీ అలాచేస్తే నాకు కష్టంగా ఉంటుందండీ" అన్నాడు మూర్తి.

"సరేలెండి" అంటూ అయిష్టంగానే పర్సు మూసేసింది రాధ.

సాలార్ జంగ్ మ్యూజియం దాదాపుగా పూర్తిగా చూసేసారు. మూర్తి ఆ మ్యూజియంని గురించి తనకు తెలిసినదంతా చెబుతున్నాడు. కొన్నికొన్ని విగ్రహాలూ, చిత్రాలూ చూసినప్పుడు ఒకరివైపు ఒకరు చూసుకుంటున్నారు అనుకోకుండా.

ఆఖరిగదుల్లో ఒకగదిలో ఒక పాలరాతి విగ్రహందగ్గర అలా చూస్తూ నిలుచుండి పోయింది రాధ. అలా చూస్తూ "చూడండీ! ఆ పాలరాయిలో అంత అందమైన మొహం పైగా పరదాకూడా చెక్కాడండీ! కాని అంత అందమైనమొహాలు రియల్ లైఫ్‌లో కనిపించవేమో!?" అంది రాధ.

"ఎందుకు ఉండరండీ? ఉంటారు. కాని అరుదు" అన్నాడు మూర్తి ఆమె మొహంవైపు చూస్తూ.

అలా ఎందుకు అన్నాడో అర్థంచేసుకోలేనంత చిన్నపిల్ల కాదు రాధ. "మీరు మరీ చెబుతారండీ!" అంటూ నవ్వేసింది రాధ కూడా.

సాలార్ జంగ్ మ్యూజియంచూసి సాయంత్రానికి స్టేషన్‌కి చేరారు.

"ఎలాఉందమ్మా?" అని అడిగాడు రాధ తండ్రి.

"చాలా బావుందినాన్నా. పైగా మూర్తి గారికి ఆ మ్యూజియంని గురించి చాలా తెలుసు, ఎక్కడ చదివారోకాని" అంది మూర్తిని అభినందిస్తూ.

* * *

రైలు వేగంగానే పోతోంది. ఆ పెద్దమనిషి మళ్ళీ మూర్తిని ప్రశ్నించాడు. "బొంబాయిలో ఎవరైనా తెలిసినవాళ్ళున్నారా?"

"లేరండీ" జవాబిచ్చాడు మూర్తి.

"అయితే ఎక్కడ మకాం చేస్తావు?"

"ఏదైనా హోటల్లో దిగుదామనుకొంటున్నానండీ" జవాబిచ్చాడు మూర్తి.

"హోటల్లో ఎందుకు రెండురోజులకోసం? మా యింట్లో దిగుదువుగానిలే" అన్నాడు ఆయన.

"అక్కర్లే ఎందుకు? విడి హోటల్లో దిగుతానులెండి" అన్నాడు ఎంతో సిగ్గుతో మూర్తి.

"చూడండీ! ఇందాక నేను వయస్సులో నే- నేను మీకంటె పెద్దవాడిని మర్యాదా చెయ్యమన్నారు. ఇప్పుడు మా నాన్నగారు మీకంటె పెద్దవారుకదూ? ఆయన చెప్పినట్లు మాయింట్లోనే దిగుదురుగానిలెండి" అంది రాధ.

లోపల వాళ్ళఇంట్లో దిగుదామనిఉన్నా "అక్కర్లే ఎందుకులెండి? అన్నాడు మొహం అలాపెట్టి మూర్తి.

* * *

మర్నాడు మధ్యాహ్నం బొంబాయి చేరారు. ఎంతవద్దన్నా మూర్తి సామాను కూడా వాళ్ళకార్లో పెట్టించారు. వాళ్ళతో పాటు పార్సీకాలనీలోఉన్న వాళ్లింటికి పోక తప్పిందికాదు మూర్తికి. వాళ్ళఇంట్లో ఒక గది ఇచ్చారు మూర్తికి.

ఆఊరు పోయినతర్వాత మూర్తికి తెలిసిన మరోవిషయం ఏమిటంటే రాధ తల్లిలేనిపిల్ల అనీ, ఆమెను తండ్రి చాలా గారాబంగా చూసుకుంటాడనీ.

బొంబాయిలో నివసించే పిల్ల కాబట్టి చాలా చనువుగా మాట్లాడుతోంది రాధ. అప్పుడప్పుడు మూర్తే డెలికేట్‌గా ఫీల్ అయ్యేవాడు.

సాయంత్రం ఏదో ఫ్రూట్‌జ్యూస్ తీసుకు వచ్చింది రాధ. మూర్తి డ్రెస్ చేసుకుంటున్నాడు. "ఎక్కడైనాపోతారా?" ప్రశ్నించింది రాధ.

హేంగింగ్ గార్డెన్స్‌వైపు పోదామనుకుంటున్నానని జవాబిచ్చాడు మూర్తి. అనుకోకుండా తనుకూడా వస్తానంటూ రెడీ అయింది రాధ. రాధ తండ్రి ఏదో పనుందంటూ కారుమీద బయటకుపోయాడు.

* * *

మూర్తీ, రాధా హేంగింగ్ గార్డెన్స్ చూసి ఎదురుగుండా ఉన్న కమలా నెహ్రూ పార్కులో కూర్చున్నారు సముద్రంవైపు చూస్తూ. అక్కడ వాతావరణం చాలా నిశ్శబ్దంగాఉంది. మూర్తీ, రాధాకూడా మాట్లాడకుండా కూర్చున్నారు.

ఇంతలో వెనకనుంచి ఎవరోఒకఅమ్మాయి హిందీలో రాధను పలకరించింది. హిందీలోనే జవాబుచెప్పింది రాధ. మూర్తికి పరిచయంచేసింది ఆమెడికల్ కాలేజీ స్టూడెంట్ భారతిని. అప్పటినుంచీ అంగ్లంలోనే జరిగింది సంభాషణ. కొంతసేపు తర్వాత "మా కాలేజీవాళ్ళు ఎల్లుండి లోనవాలా పిక్నిక్ పోతున్నాం. నువ్వు ఊళ్లో లేవనుకున్నాను. నువ్వుకూడా వచ్చావు" అంటూ సంతోషం వ్యక్తపరిచింది భారతి.

మళ్ళీ రాధ హిందీలో ఏదో చెప్పింది. వెంటనే భారతి మూర్తినికూడా పిక్నిక్‌కి రమ్మని ఆహ్వానించింది. మూర్తి తన ఇంటర్‌వ్యూ పొద్దున్నే అయిపోతుందని ఆ సాయంత్రమే వచ్చిపోదామనుకుంటున్నానని జవాబిచ్చాడు. భారతి అంతగా బలవంతపెట్టలేదు. ముగ్గురూ వెళ్ళిపోవడానికి లేచారు.

"నేను ఆయన్ను తీసుకువస్తాలే. ఆయనకు కూడా ఒక గెస్ట్ టికెట్ తీసుకో" అంది రాధ భారతితో ఎంతో ధీమాగా.

* * *

మర్నాడు పొద్దున్న తనకున్న సూట్లలో మంచిసూట్ వేసుకొని ట్రిమ్‌గా తయారయి ఇంటర్‌వ్యూకి పోతున్నాడు మూర్తి. రాధ "బెస్టు ఆఫ్ లక్" చెప్పింది. రాధతండ్రి మూర్తిని ఆ కంపెనీదగ్గర దించి ఆఫీసుకు పోయాడు.

సాయంత్రం ఇంటికి రాగానే "ఎలా ఉంది నాయనా ఇంటర్‌వ్యూ" అని అడిగారు రాధ తండ్రి.

"అది ఇంటర్‌వ్యూ ఏమిటండీ? నీ పేరేమిటి? ఎక్కడినుంచి వచ్చావ్? రేపు యీ ఊళ్లో ఉంటావా? ఈ ఫారాన్ని నీకు ఉత్తరం వ్రాయాలంటే ఏ అడ్రస్‌కి వ్రాయాలి?... ఇవేనండీ వాళ్లడిగిన ప్రశ్నలు. ఎడ్రస్ మీ కేరాఫ్ ఇచ్చాను. బహుశా రేపు పొద్దునటికి వస్తుంది రిగ్రెట్స్. నేను రేపుపొద్దున రైలులో పోదామనుకుంటున్నానండీ" అన్నాడు కొంచెం నిరుత్సాహంగా మూర్తి.

"రేపు పోస్టు చూసుకుని ఎల్లుండి రైలులో పోదువుగానిలే" అన్నాడు రాధతండ్రి.

"ఎందుకండీ! మీకు అనవసరంగా శ్రమ" అన్నాడు మూర్తి.

"శ్రమ ఏమిటోయ్? ఏదో మనవైపువాడివి. ఈమాత్రందానికి ఏమీ ఫరవాలేదులే."

ఇంతలో రాధ "నాన్నా రేపు మెడికల్ కాలేజీవాళ్ళు లోనవాలా పిక్నిక్ పోతున్నారు. భారతి మమ్మల్ని పిలిచింది. పోతాం నాన్నా" అంది రాధ.

"నీ యిష్టం."

ఏమీ అనలేకపోయాడు మూర్తి.

* * *

ఎలక్ట్రిక్ ట్రయిన్ వాయువేగ మనోవేగాలతో పోతోంది. అసలే బొంబాయి విద్యార్థులూ, విద్యార్థినులునూ, అందులోనూ మెడికల్ కాలేజీవాళ్ళు. ఇంక వాళ్ళ అల్లరేమిటి! డ్యూయట్‌లు పాడేవాళ్లు కొంతమంది, పేకాడేవాళ్ళు కొంతమంది. అసలు ఆడ మగ అన్న భేదం లేకుండా అల్లరి చేస్తున్నారు. మూర్తి వాళ్ళవైపు వింతగా చూస్తున్నాడు. ఇంతటిలో ఏం అయింది? అన్నట్టుగా చూసింది రాధ మూర్తివైపు.

భారతి రాధని, మూర్తినీ మరికొంతమంది విద్యార్థులకి పరిచయం చేసింది. మెల్లగా మూర్తీ, రాధా వాళ్ళతో పేకాటకి దిగేరు. రైలు రెండుగంటల్లోనే లోనవాలా చేరింది.

స్టేషన్‌నుంచి వాళ్ళు మకాంచేసే బంగ్లా దూరమవడంవల్ల స్టేషనులో రైలుదిగగానే అక్కడ సైకిలుషాపులో ఉన్న సైకిళ్ళన్నీ అద్దెకు తీసుకున్నారు. సరే. అక్కడితో ఆగితే బాగుండును. ఒక్కొక్క విద్యార్థి తన మిత్రురాలిని, అక్కడ మెడికల్ కాలేజీ అలవాటుచొప్పున, సైకిలుమీద కూర్చోబెట్టి ప్రయాణం అయ్యారు. అలా కూర్చోడానికి ఇష్టంలేనివాళ్లు కొంతమంది విద్యార్థినులు లేడీస్ సైకిల్స్ తీసుకున్నారు. మూర్తి అటువంటి ఘట్టాలు సినిమాల్లో అప్పుడప్పుడుచూసి ఇది సంభవమేనా? అనుకుంటూ ఉండేవాడు. ఇప్పుడు తన కళ్ళతో తనుచూసి ఆశ్చర్యంగా ఇంకా అలాగే చూస్తూ నుంచొన్నాడు మూర్తి. రాధకూడా అక్కడే నుంచొనివుంది.

ఇంతలో భారతి అక్కడికివచ్చి "మీరింకా ఇక్కడే వున్నారా? ఓ! అన్నట్టు

(61-వ పేజీచూడండి)

## ఒత్తుగా వచ్చిన ఎంత సొగసైన కేశములు

### —వారు నిశ్చయముగా



# టాటావారి
# హెయిర్ ఆయిల్స్‌ను
## ఉపయోగిస్తూ ఉండాలి

టాటావారి పెర్‌ఫ్యూమ్డ్ కోకొనట్ హెయిర్ ఆయిల్— శుద్ధిచేయబడిన మరియు పూల పరిమళముగల కల్తీలేని కొబ్బరి నూనె

టాటావారి కేస్టర్ హెయిర్ ఆయిల్— విశేష గుణములూ మరియు మంచి సువాసనగల ఆముదపు నూనె

మీ కేశముల పోషణకు మరియు సొగసుదనమునకు టాటావారి హెయిర్ ఆయిల్స్‌ను ఉపయోగించండి!

టాటా తయారీలు





పురాణం సూర్యప్రకాశరావు

(గతవారం తరువాయి)

లక్ష్మణరావు పేపరు మధ్యపేజీలలో ఒక వార్తను చూసి అదిరిపడి "ఇది విన్నావా మల్లిబాబూ?" అన్నాడు.

మల్లిబాబు "ఏమిటది?" అన్నాడు ఆత్రుతగా.

జానకమ్మ అప్పుడే గదిలోకి ప్రవేశించి రాధ వారకూర్చొని 'ఏమిట్రా విశేషాలు' అంది

పిల్లలు వరండాలో కొయ్యగుర్రాలమీద ఊగుతున్నారు. వీధిదీపం వెలుతురు వాళ్ళమీద పడుతూంది.

లక్ష్మణరావు "ఒక గర్భవతి అయిన యువతి రైలు కిందపడి ఆత్మహత్య చేసుకుందిట. ఆమె ఎవరితోనో అక్రమ సంబంధం ఉండి గర్భవతి అయి ఈ రహస్యం బయట పడగానే ఈ పనిచేసి ఊరుకుందిట. ఆ యువతి మన బాబూరావు పుణ్యం కట్టుకున్న పిల్ల కాదు కదా?" అన్నాడు.

"ఈ ఊరేనా?"

"ఆఁ ఈ ఊరే"

"అయితే ఇక సందేహం ఎందుకు?"

లక్ష్మణరావు నిట్టూర్చి 'అగ్నిలో ఒక సమిధ వదిలెయ్యి అదేమిటి రాధా తల వంచుకుని కూర్చున్నావు.' భార్యవైపు తిరిగి 'ఆ కథంతా నీకు తెలుసుగా' అన్నాడు.

జానకమ్మ మల్లిబాబును చూపిస్తూ "ఎదురుగా కనిపిస్తుంటే తెలుసా అంటారేమిటండీ" అంది.

మల్లిబాబు "అవును జానకమ్మగారూ. ఈ గాయానికి, ఆ గాథకీ చుట్టరికం వచ్చింది" అన్నాడు బాధగానే

రాధ తలఎత్తి మల్లిబాబువైపు ఒకమారు చూసి బావ అందిచ్చిన పేపరు తీసుకుని చదవసాగింది.

జానకమ్మ ఇలాంటి వార్తలు అనేకం విన్నది పేపర్లలో చదివింది. వారూ వీరూ చెప్పుకుంటూంటే విన్నది. కాని ఎన్నడూ అనుభవించని ఒక వింతైన ఆర్ద్రతతో ఆమె హృదయం నిండిపోయింది. మల్లిబాబు నుదుటిమీద కట్టుకడుతుంటే కళ్ళు ఎరుపు ఆమె చూసింది. ఏ ఆకర్షణ ఏ కోరికలు ఇలా జీవితాలను బలిగొంటున్నాయో అని ఆలోచిస్తే ఆమెకు 'మనోనిగ్రహం' అనే ఒకమాట చప్పున తట్టింది. దాని అవసరం గురించి ఒక కోణంలోనుంచి ఆమె ఇదివరకే ఆలోచించడం నేర్చుకుంది. ముఖ్యంగా పిల్లల పెంపకం విషయంలో నేమి కుటుంబాన్ని కొన్ని పద్ధతుల్లో సాగించటానికయితేనేమి ఆమె ఈ ఓర్పు, నిగ్రహం చాలావరకూ ప్రదర్శించింది. ఆమె కొత్తగా కాపరానికి వచ్చిన రోజుల్లో తన ఇంటి పద్ధతులను ఈ ఇంటి పద్ధతులను అలవాటు పడటానికి చాలా శ్రమపడింది. నేర్పుగానే సమర్థించుకుంది. ఈ మనోనిగ్రహం లోపిస్తే ఇలాంటి అవకతవకలే జరుగుతూంటాయి అని ఆమె అనుకుంది. ఇలా ఆమె ఆలోచించుకుంటూ పోగా పోగా ఈ మనోనిబ్బరం అనే మాటకూ 'దేముడు' అనే మాటకూ ఏదో సంబంధం ఉందేమో అనిపించింది. దేముడు ఉండనీ లేకపోనీ. కాని ఆ నమ్మకం చాలా గాఢమయిన మందు. ఆ నమ్మకం ఒక గాజుపాత్ర వంటిది. అందులో ఏ రంగు నీరుపోస్తే ఆ రంగులో కనిపిస్తుంది. ఆ విశేషం గ్లాసుకు సంబంధించినది కాదు. అలాగే కొన్ని దురాచారాలు ఈ నమ్మకం ఆధారం చేసుకుని సంఘంలో బలపడి ఉండవచ్చు. ఆ తప్పు కొంతమంది స్వార్థపరులదనే అనుకోవాలి ఆ నమ్మకాన్ని అడ్డు పెట్టుకుని మంచి పనులు ఎందుకు చెయ్యకూడదు? ప్రజలలో ఐకమత్యాన్ని, ఆత్మబలాన్ని ఈ నమ్మకం సాధించిందని చరిత్రలో రుజువులు లేవా? 'ఒక కడుపున పుట్టిన అన్నదమ్ముల కంటె ఒక మతంలో వారు పరస్పర విశ్వాసంలో సహకారంతో జీవించటం మనం తెలుసుకున్నాం' అన్న వివేకానందుని వచనాలు ఆమెకు గుర్తుకు వస్తూంటాయి

"అయితే మనిషికి అదుపు అవసరం అంటావు" అంటాడు లక్ష్మణరావు

"ఆ విషయం నేనేకాదు. అందరూ గుర్తించిన విషయమేగా. ఈ రాజ్యాంగాలు, ఈ కారాగారాలు, కోర్టులు, పోలీసులు, సైనికులు – ఇవన్నీ మనిషికి అదుపు అవసరం అని సూచించటంలేదా?" అని ఆమె ఎదురు ప్రశ్న వేస్తుంది

"అవును. ప్రభుత్వం ఉందిగా. ఆ అదుపు చాలదూ?" అంటాడు లక్ష్మణరావు.

"చాలదేమో అని అనుకుంటాను. ఒక మనిషిమీద ఒక మనిషిగాని, మరొక బలమైన శాసనంగాని, ఒక ప్రభుత్వముగాని చెలాయించే అధికారముకంటె అతనిమీద అతను చలాయించుకునే అధికారం చాలా బలమయిందని నా అభిప్రాయం. ఒక పోలీసుని కన్నుగప్పి దాటుకోవచ్చు. ఒక శాసనాన్ని ధిక్కరించవచ్చు. ఒక ప్రభుత్వాన్ని డబ్బుతో పదిమంది ఉన్నవాళ్లు మార్చగలరు. కాని నిర్గుణుడైన అమేయ శక్తిసంపద కలిగిన ఒక భగవంతుడి భావంనుంచి మనుషు తప్పుకోగలగటం ఆ నమ్మకం ఉంటే, కష్టమేమో అనుకుంటాను. అందుకని ఆ గాజుపాత్ర భద్రంగానే ఉంచుకుందాం. మనకు నచ్చిన రంగు నీరు మనం పోసుకుందాం" అంటుంది ఆమె

'అవును ఈ విషయం ఆలోచించవలసిందే' అంటాడు లక్ష్మణరావు.

పత్రికాపఠనం ముగిసింది. పత్రికలో ఎన్ని ముఖ్యమయిన వార్తలు ఉన్నా వారి దృష్టి ప్రత్యేకంగా ఆకర్షించిన వార్త ఇదొక్కటే. వారి ఆలోచనలన్నీ ఆ విషయంమీదనే లగ్నమయి పనిచేస్తున్నాయి.

రామచంద్రం బద్ధకంగా ఆవులించి లోపలికి వస్తూ 'ఆకలేస్తోంది' అనటంతో రాధ లేచి అతనికి భోజనం పెట్టటానికి వెళ్లిపోయింది. పిల్లలు ఆటలుమాని తల్లి చుట్టూ మూగటంతో వాళ్ళను వెంటబెట్టుకుని జానకమ్మ వంటగదిలోకి వెళ్లింది. లక్ష్మణరావు పేపరులోని ఇతర విషయాలు చదువుతూ కూర్చున్నాడు

మల్లిబాబు టెంపరేచరు చూసుకుని అసంతృప్తిగా ఏదో గొణుక్కున్నాడు.

జానకమ్మ పిల్లలకు అన్నాలు పెట్టి ఇవ

# జీవనగంగ

తలికి వచ్చి 'అన్నానికి రండి' అని పిలిచింది. లక్ష్మణరావు చేపరుమూసి మంచంమీద పడేసి 'పదినిమిషాల్లో వస్తానోయ్' అని చెప్పి వెళ్ళాడు.

కిటికీలోంచి నీలి ఆకాశంలో ఒకటే ఒక నక్షత్రం ఒంటెత్తుగా మెరుస్తూంది. వీధిలోంచి సైకిలుబెల్లు వినిపించింది.

"మధ్యాహ్నం ప్రశాంతమైనవేళ ప్రతిరోజూ యూత్ ఆర్గన్ వాయించుకుంటూ పోయే కుర్రవాడు ఇప్పుడు ఆ లాంతరు స్తంభంవార నిలబడి పాడకూడదూ? బాబూరావు-అంత నీతిలేనిమనిషి-ఆనాడు కారోని ఎంత బాగా వాయించాడు! ఇద్దరు కుర్రవాళ్లు లేచి ఎంత హుషారుగా గంతులు వేశారు!..." అన్నీ ఒంటరిగా ఉన్న మల్లిబాబు తలలో తిరగసాగాయి. ఆ దృశ్యాలన్నీ అదృశ్యం అయి రెండురైలుపట్టాలు, ఇంజను చక్రాలు వచ్చి నెత్తురు... పచ్చికుండ భళ్లు మన్నట్టుగా చిన్న చప్పుడి... రెండు చేతులూ ముఖానికి అడ్డంపెట్టుకుని అతను మంచంమీదఒరిగి ఒకపక్కకు పడుకున్నాడు.

రామచంద్రం భోజనం అయిందికాబోలు త్రేన్చుకుంటూ భుజంమీద తువ్వాలుతో చేతులు తుడుచుకుంటూ వరండాలో పచార్లు చేస్తున్నాడు.

గడియారం గంటలు కొడుతూంది. చల్లగాలి లేతిలేతి తెరలుతెరలుగా వీస్తూంది. మల్లిబాబు దుప్పటీ తీసి కప్పుకున్నాడు. కొద్దిసేపు పోయింతర్వాత అతనికి మందు సీసాలో పోస్తున్న చప్పుడయింది.

"తమ్ముడూ నువ్వు నిద్ర నటిస్తే లాభం లేదు. మందు తాగాల్సిందే" అంటూ లక్ష్మణరావు మందుసీసాతో మంచంవార వచ్చి నిల బడ్డాడు. ఆ వెనకనే సన్నగా రాధ నవ్వు వినిపించింది.

మల్లిబాబు ఒత్తిగిలి "నేను నిద్ర ఎప్పుడు నటించాను చెప్పండి" అని లక్ష్మణరావు చేతిలో మందు తీసుకుని తాగేసి బాధగా గొంతు రాసుకుంటూ కూర్చున్నాడు.

"అయినా తమ్ముడూ ఒకమాటడుగుతాను చెప్పు. నలుగురూ మెసిలే వీధివెంటరాకుండా ఊరిబయట నీకేంపని? అటు పోతేగాని అది షికారుకాదా? మనిషిని ఖూనీచెయ్యటానికి కూడా అక్కడ అనుకూలమైన సౌకర్యాలన్నీ ఉన్నాయి. మీరు పెద్ద పనున్నట్టుగా అటే వచ్చారు" అన్నాడు లక్ష్మణరావు.

"పోనీలే బావా. ఏదో జరిగిపోయిందిగా. ఆయన్ను ఇంకెన్నాళ్లు దెప్పుతావు?" అంది రాధ ఓదార్చినట్టూ, వాలి పెట్టినట్టూ.

మల్లిబాబు మంచంమీద లేచి కూర్చుని "అనండి. అనండి. ఏం చేస్తాను" అన్నాడు అసహాయంగా తల వంకిస్తూను.

రాధ నవ్వింది. లక్ష్మణరావు రాధను వారిస్తున్నట్లుగా "నవ్వకు. ఉడుకుమోత్తనం వస్తుంది" అన్నాడు.

మల్లిబాబు తలమీదకంతా ముసుగు కప్పుకుని పడుకున్నాడు—'ఇక మీకుసమాధానం చెప్పదలుచుకోలేదు' అన్నట్టుగా.

అరరాత్రి మెలకువవచ్చి చూస్తే లక్ష్మణరావుకి మల్లిబాబు గదిలో దీపం వెలుగుతూండటం కనిపించి లేచి 'ఏం చేస్తున్నావోయ్' అంటూ లోపలికి వచ్చాడు.

మంచంమీద కూర్చుని పుస్తకం చదువుకుంటున్నాడు మల్లిబాబు.

మల్లిబాబు ముఖం ఎత్తి 'నిద్ర రావటం లేదండీ" అన్నాడు.

"అందుకని పుస్తకం చదువుతావా? పనికి రాదని డాక్టరు చెప్పలేదూ? తల నొప్పి వస్తుంది" అని అతనిఅభిప్రాయంతో నిమిత్తం లేకుండానే పుస్తకాన్ని తీసి టేబులు మీద పడేసి దీపం ఆర్పి 'ఇక పడుకో' అని వెళ్ళిపోయాడు.

మల్లిబాబు బలవంతాన కళ్లు మూసుకుని 'ఏమిటీ అనుబంధం' అనుకున్నాడు.

## 30

భళ్లున తెల్లవారింది!

పక్కింటాయన సంగీతసాధన అప్పుడే పూర్తయింది. వీధిలో కూరలవాళ్ళూ, పాలవాళ్ళూ కేకలువేసుకుంటూ పోతున్నారు.

పనిమనిషి గుమ్మం ముందు ముగ్గులు వేస్తూంది.

రాధ, జానకమ్మ చెరోగిన్నె పట్టుకుని పాలు పోయించుకుంటున్నారు. లక్ష్మణరావు కూరలు బేరంచేస్తున్నాడు.

రామచంద్రం అద్దం ముందు నిలబడి అందంగా తల దువ్వుకుంటున్నాడు.

పక్కింటావిడ పనిమనిషితో తగూలాడుతోంది.

తెల్లపువ్వులు, ఎర్రపువ్వులు, చిన్న పువ్వులు, పెద్దపువ్వులు అందంగా, ముద్దుగా అప్పుడే లేచిన పిల్లల్ని పిలుస్తున్నాయి.

మల్లిబాబు అప్పుడే లేచి మంచంమీద కూర్చున్నాడు.

ఒకబండి టక్కుటక్కుమని చప్పుడుచేసుకుంటూపోతూంది.



పిల్లలు ముఖాలుకడుక్కుని పెరుగుమనిషి ముందు చేతులుచాచి నిలుచున్నారు. లక్ష్మణరావు పంచకట్టు అందంగా కట్టుకుని చేతులున్న బనియను వేసుకుని లోపలికి వస్తూ "ఇంకా లేవలేదుటోయ్" అన్నాడు.

"లేచి చాలాసేపయింది లక్ష్మణరావుగారూ. నాకు ఫ్లూటు వాయించడం రాదే" అని బాధపడుతున్నాను ఈ ఉదయం ఎంత మనోహరంగా ఉంది!" అన్నాడు మల్లిబాబు. ఆకాశంలో తేలి తేలి పరుగులు తీస్తున్న తెల్లటి మేఘపంక్తివైపు చూస్తూను.

"మనవాళ్లు తెల్లగా తెల్లవారిం తర్వాత గాని మంచం దిగి లేవరు. తెల్లవారు ఝామునే లేసే ఎంత బాగుంటుందని అప్పుడు స్నానంచేసి ఏదైనా చదువుకుంటూ కూర్చుంటే ఎంత హాయిగా ఉంటుందని! రానురాను మన జీవితాలలో రసికత చచ్చిపోతోంది తమ్ముడూ తెల్లగా తెల్లవారి లేచిం తర్వాత ఏముంటాయి. కారుహారన్లూ, ఫ్యాక్టరీల సైరన్లూ, ఇవేగా. ఒక గొల్లవానికేక, ఒక కూరమనిషి అరుపు దూరంగా వినిపిస్తుంటే ఆ ప్రశాంతమైన వేళ ఎంత ఆనందంగా ఉంటుంది! లాలిత్యం ఎవరికి కావాలి తమ్ముడూ? జీవితం మరటుకాతి పోతూంది" అన్నాడు లక్ష్మణరావు కిటికీ గజాలు పట్టుకుని మొక్కలవైపు చూస్తూను.

మల్లిబాబు మెల్లిగా మంచం దిగి ముందు వరండాలోకి నడిచాడు. పనిమనిషి నీళ్లు తెచ్చి ఇచ్చింది. ముఖం కడుక్కుని లోపలికి వస్తూ లక్ష్మణరావు అక్కడే నిలబడి ఉండటం గమనించి "మొత్తానికి మీరు అన్నిటిలోను ఉన్నారు" అన్నాడు.

"నేను చెప్పేమాటలు విని ఒకాయన అన్నాడు" మీ అభిప్రాయం ప్రకారం జీవితం గడపాలంటే నాకేదో భయంగా ఉంది. అన్ని కట్టుడులుంటే ఎలాగండీ" అని ఆయనే కాదు చాలామంది అలాగే అనుకుంటారు. కాని అంత గాభరా పడవలసిన అవసరమేమిటో నాకు బోధపట్టంలేదు. అలవాటయితే ఈ పద్ధతులన్నీ వాటంతటవే జరిగిపోతూంటాయి. భోజనం చెయ్యటం, నిద్రపోవటం—ఇంతే కాదు జీవితం. చాలా ముఖ్యమయిన విలువలున్నాయి. మనం వాటిని పరిశీలించం."

"అంతే అసలు వచ్చిన చిక్కు అది కదండీ ఒక విధమైన క్రమశిక్షణ లేకుండా పోతూంది"

"తెల్లవారుఝామున లేవటం నేను కష్టం అనుకోను. చాలా సుఖంగా ఫీలవుతాను. సరిగ్గా అయిదూ అయేసరికి వాటంతటవే మెలుకువ వచ్చేస్తుంది. అన్నీ అలాగే జరిగిపోతూంటాయి."

గులాబిచెట్టు చిగురు తొడిగింది. చిన్న చిన్న రెమ్మలు వేసింది.

డాక్టరుగారు వచ్చారు. కట్టుకట్టారు. మల్లిబాబు కొన్ని కోరికలు కోరటం నవ్వుతూనే ఆయన ఖచ్చితంగా వాటిని తిరస్కరించటం జరిగింది.

"మరి వెన్నొచ్చి పోతోందండీ" అన్నాడు మల్లిబాబు ప్రాధేయపూర్వకంగా.

"అయినా వీల్లేదు" అని ఆయన ఖరాకండిగా తేల్చేసారు.

డాక్టరుతోపాటు అందరూ నవ్వుతున్నారు. మల్లిబాబు కోపంగా ముఖం పెట్టుకుని అలాగే చూస్తున్నాడు.

పదిగంటలయింది. ఇటు రాధ, అటు జానకమ్మ వంటపనుల్లో నిండా నిమగ్నులయి ఉన్నారు. లక్ష్మణరావు మల్లిబాబుముందు కుర్చీ వేసుకుని ఆఫీసు కాగితాలు రాసుకుంటున్నాడు. అంతకుముందే పిల్లలు బడికి వెళ్లిపోయారు.

మల్లిబాబుకి బొత్తిగా కాలం గడవటం

# జీవనగంగ

లేదు. సాయంత్రంపూట నలుగురూ కూర్చుంటే ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పుకుంటూ గడుపుతున్నాడు. పరీక్షలు దగ్గర పడుతున్నాయనే బెంగ కొంత.

ఒక చిత్తు కాగితం తెచ్చుకుని కిటికీ వార కూర్చుని పెరిగిన గోళ్ళని కత్తిరించుకుంటూ కూచున్నాడు.

లక్ష్మణరావు కాగితాల్లోంచి తలెత్తి "ఎవరో పిలుస్తున్నట్టున్నారుకే?" అన్నాడు.

మల్లిబాబు ఆలోచనలోంచి తెప్పరిల్లి గేటు తెరుచుకుని లోపలికి ప్రవేశిస్తున్న ఒక స్థూలకాయుడ్ని "ఎవరికోసమండీ?" అని ప్రశ్నించాడు.

లక్ష్మణరావు కాగితాలు పక్కనపెట్టి వరండాలోకి వెళ్ళి "రండి, రండి" అన్నాడు సగౌరవంగా.

మల్లిబాబు ఎవరో పెద్దమనిషి కాబోలు అని ఎదటవున్న గోళ్ళ కాగితాన్ని త్వరత్వరగా తీసి బయటికి వచ్చాడు.

ఆ వచ్చినాయన వెనకాల ఇంకో నలుగురు లోపలికి వచ్చారు. కొంతమంది వీధిలోనే నిల్చున్నారు. లక్ష్మణరావు చాపలు పరిచాడు. అంతా ఆసీనులయారు. గేటు తలుపు తీసేవుంది. లక్ష్మణరావు వాళ్ళముందు కూచుంటూ "ఎందుకోసం వచ్చారు?" అని వినయం కనిపాడు.

"నేను యీ వార్డుకి కౌన్సిలర్‌గా నిలబడబోతున్నాను. స్వతంత్ర అభ్యర్థిని. నాకు ఓటువేసి గెలిపించాలి మీరు" అని మూడు ముక్కల్లో తేల్చేశా డాయన.

పక్కనున్నాయన అందుకున్నాడు: "వీరిగురించి మీరు వినేవుంటారు. అనేక ఉద్యమాలలో ముఖ్యంగా ఆంధ్ర రాష్ట్రోద్యమంలో వీరు ఎంతటి కృషిచేశారో పత్రికలలో చూసేవుంటారు. మనపేట ఎంత అధ్వాన్నంగావుండాలో అంతఅధ్వాన్నంగా ఉంది. ప్రస్తుత పురపాలకసంఘం ఈ పేటని పూర్తిగా మరిచిపోయారు. మనకి చాలా అసౌకర్యాలు ఉన్నాయి. విద్యుద్దీపాలు ముఖ్యవీధుల్లో తప్పించి చాలాచోట్ల లేవు. మురుగుపారుదల సౌకర్యాలు లేవు. సరయిన రోడ్లు లేవు! రాష్ట్రరాజకీయాలలో పాల్గొని అపారమయిన ఉత్సాహంతో ఈయన పని చేస్తున్నారు. కాని ప్రజల కోరికపైన ఆ దృష్టి ఇటు మళ్ళించుకుని ఈ పేటలోని ప్రజలక్షేమంకోసం వినియోగించాలని ఆయన నిశ్చయించుకున్నాడు. ఆయన శక్తిసామర్థ్యాలను మనం సక్రమంగా వినియోగించుకుంటే అదృష్టవంతులం."

రాధ ఓమారు బయటికి వచ్చి యీ ఉపన్యాసాన్ని విని లోపలికి వెళ్ళిపోయింది.

కొంతమంది చేతుల్లో ఓటర్ల లిస్టులు కాబోలు వానిపోతున్నాయి.

# జీవనగంగ

"మంచిది. అదే ఆశయంతో మీరు పని చేస్తారనే నమ్మకం నాకు కుదురుతే నేను నా ఓటు మీకే వేస్తాను" అన్నాడు లక్ష్మణరావు.

నిలబడబోయే కౌన్సిలర్ గారికే కాకుండా అక్కడవున్న ఆయన పరివారానికి కూడా యీ సమాధానం అసంతృప్తినే కాకుండా కొంత కోపాన్ని కూడా కలిగించింది కాబోలు. ఆయన వెనకాలవున్న నలుగురూ చరచరా బయటికి వెళ్ళి రోడ్డుమీద నిలబడ్డారు.

స్థానిక నాయకుడు కోపపడంవల్ల ఆయన కొద్ది ఆలస్యంగా లేచి "అయితే మీరు నన్ను పరీక్ష చెయ్యదలిచారన్నమాట" అన్నాడు.

"మీకేమైనా అనుకోండి. ఓటరుగా నాకు కొంత బాధ్యత ఉన్నదిగా. ఆవిషయం మీరు గమనించాలి" అన్నాడు లక్ష్మణరావు.

"సరేలెండి" అని ఆయన గేటు తెరుచుకుని పోబోతుంటే లక్ష్మణరావు పిలిచి "ఒక్కమాట ఆ గేటు వేసి మరీ వెళ్ళండి" అన్నాడు.

ఆయనముఖం మాడిపోయిన మంగలం అడుగులా అయిపోయింది. గేటు గడియవేసి ఆయన గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

గుమ్మంలో నిలబడి చూస్తూ ఉన్న మల్లిబాబుని "నేనేమయినా అవమానకరంగా ప్రవర్తించానా మల్లిబాబూ?" అన్నాడు.

"ఎందుకలా అనుకుంటున్నారు?"

"ఒక్క చిన్న విషయం దగ్గర వీళ్ళు నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తారే? పెద్ద పెద్ద విషయాలు ఎలా సాధించగలుగుతారు? దొడ్డినిండా పూలమొక్కలున్నాయి. పాదులున్నాయి. మనం ఎంతో ప్రాణంగా వాటిని పెంచుతున్నామని హృదయం ఉంటే ఎవరికయినా తెలుస్తుంది. ఇన్ని ఉద్యమాలలో పొదిలిన మనిషి మూసివున్న గేటుని తెరిచినవాడు తిరిగి ఆ గేటుని మూయ్యాలని తెలియదూ? ఆపాటి చిన్న చిన్న అలవాట్లు లేకపోతే ఎలా? ఆయనకే కాదు. మనదేశంలో చాలామందికి ఈ విషయాలు తెలియవు. పాశ్చాత్యుల సాంప్రదాయాలు కొన్ని నాకు ముచ్చట గొలుపుతాయి. అందుకే గాంధీ వారి నించి నేను చాలా నేర్చుకున్నాను" అన్నాడు. తలుపు తెరిచి ఉన్నా సరే చిన్న చప్పుడు చేసి లోపలివారి అనుమతి వచ్చిం తర్వాతనే లోపలికి ప్రవేశిస్తారు. వారిలో గొప్ప క్రమశిక్షణ ఉంది. కొన్ని సంవత్సరాలకు పూర్వం మన జాతిలోనూ ఆ క్రమశిక్షణ ఉండేది" అన్నాడు లక్ష్మణరావు.

భోజనాలయి నలుగురు కాసేపు వరండాలో కూర్చున్నారు. పళ్ళరసం పుచ్చుకుని మల్లిబాబు [illegible]
[illegible]
[illegible]
[illegible]

పాటలా ధ్వనించిందేమో అక్కడున్న వారంతా క్షణం ఆశ్చర్యాంబుధిలో మునిగిపోయారు. ఆఖరికి జానకమ్మ కూడా తమతోపాటు ప్రదర్శించిన ఈ ఆశ్చర్యానికి మల్లిబాబు "అయితే మీక్కూడా ఈ విషయం తెలియకుండానే దాచారా?" అన్నాడు.

"నేనూ ఇప్పుడే వింటున్నాను" అందామె.

"అచ్చంగా సెక్రటరీ స్టేటుమెంటులాగానే ఉంది" అంది రాధ.

"బాగా చెప్పారు. అది సరే. వివరాలు చెప్పారు కాదు" అన్నాడు మల్లిబాబు.

స్థలం కొనడం అయిపోయింది. ఊరికి కొద్ది దగ్గర్లోనే కొన్నా. కొద్ది రోజుల్లో పని కూడా ప్రారంభం అవుతుంది" అన్నాడు లక్ష్మణరావు.

నలుగురి అభినందనల్ని స్వీకరిస్తూ "ఈ నిర్వాకమంతా నా ఒక్కడిదే కాదు. ఈ ఇల్లాలి సహకారమే లేకపోతే నేను ఒక్కణ్ణి అనుకున్నది అనుకున్నట్టుగా చెయ్యలేకపోయేవాడిని" అన్న లక్ష్మణరావు మాటలకి—

"అందుకే కాబోలు అంత రహస్యంగా ఉంచారు" అని చెప్పింది జానకమ్మ.

గడియారం పన్నెండు గంటలు కొట్టింది. మల్లిబాబు "ఒక్క నిముషం ఆగండి." అన్నాడు. అతని దృష్టి ఎక్కడో ఉంది.

దూరంగా అతను అలవాటుగా వినే 'మౌతు ఆర్గన్' వినిపించింది. శ్రావ్యమయిన ఆ పాటకి తన్మయుడవుతూ "ఆ పాట వినండి" అన్నాడు.

ప్రశాంతమైన ఆ మధ్యాహ్నపు వేళ ఆ పాట వినటానికి చాలా హాయిగావుంది. ఆ పాట రానురాను దగ్గరయి హెచ్చుస్థాయిలో వినిపించి క్రమక్రమంగా దూరం అయి అస్పష్టమయిపోయింది.

"ఈ కుర్రాడు ఏదో ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాడు. అతను ప్రతిరోజూ ఇదేవేళ ఇటునించి పోతుంటాడు. ఇలా పాడుకుంటూ పోతాడు. ఒకనాడు రూముకి తీసుకెళ్ళి పాడమన్నాను, అంతబాగా రక్తికట్టలేదు. నేను అదే అడుగుతే 'కాదు సార్, నేను రోజూ ఇప్పుడే బాగా పాడాను' అన్నాడతను. దేనికయినా సమయాసమయాలుంటాయి కాబోలు. ఈ వేళ యీ ప్రశాంతతలో ఆ పాట మనల్ని ముగ్ధుల్ని చేస్తోంది" అన్నాడు మల్లిబాబు.

"ఋతుకాల భావానుగుణమైన నటుకంటి రాగాలాపనే భారతీయ గానకళా వైశిష్ట్యం" అన్న బ్రూక్‌బాండ్ టీ వాళ్ళ ఎడ్వర్టయిజ్‌మెంట్లు నువ్వు చూడలేదటోయ్" అన్నాడు లక్ష్మణరావు.

"ఆ ఘడియలు చాలా రసవత్తరంగా గడిచాయి" అంది రాధ ఆ అనుభూతి నించి అప్పుడే తెలివి బయటపడుతూను.

"మా కుటుంబంలో ఒక్కరూ సంగీతం నేర్చుకోలేదు" అన్నాడు మల్లిబాబు.

"అది అసంతృప్తికరమైన విషయమే." అన్నాడు లక్ష్మణరావు. (ఇంకా ఉంది)



ఆ ప్రదేశానికి ఉత్తరాన గ్రామం పొలిమేరలవరకు ఏపుగా ఎదిగిన మామిడితోపులు. పశ్చిమానికేసి మైలు దూరంలో కనికలగట్టు. వెండి నీరు పులుముకున్నట్లు నిగనిగలాడుతూ తీగ మెరుపుల్ని మెరిపిస్తూంటుంది. కనుచూపు మేరలో తూర్పుభాగాన వాగేటికోన. అది లెక్కలేనన్ని సెలయేళ్ళతో నిండుకొని ఉంది. ఎగువవైపు పర్వత సానువుల్లోంచి ప్రవహించే సెలయేటి జలప్రవాహాలన్నీ కలిసి పెద్దేటిలో కలిసిపోతాయి. అది మా గ్రామాన్ని ఒరసికొని గంభీరంగా పల్లెపడుచులా పరుగిడుతూంటుంది.

తూర్పుదిక్కున ప్రవహించే వాగేటికోనకు ఇరువైపులా మునకలగట్టు, ఎలతర్ల గుట్ట అనే రెండు గుట్టలు చిన్న కొండల్లా నిల్చొని ఉన్నాయి. ఆ రెండు కొండల నడుమ వాగేటికోన కడ్డంగా రిజర్వాయర్ నిర్మిస్తే కొన్ని పదుల గ్రామాలు, మైదానాల్లో బీళ్ళుగా వారిఉన్న బంజరు భూములు సస్యశ్యామలాలవుతవి. బంగారు పంటలు పండుతవి.

## 2

పాడుపడిపోయిన ఆ ధూశాలి ఇండ్లను చూశాను. అందులో కొండుగాడు ఎంకి నివసించిన గృహాల్ని ప్రత్యేకంగా తిలకించినాను. వాటి శోకవిశిష్టత ఆపాదించి భూపతి రాజా నాకు చూపించినాడు.

"మా బావుగా మరి! ఇక కాలు కదిలించు. పొద్దెక్కిందంటే ఎండలో నడవటం కష్టమౌతుంది" అన్నాడు భూపతి రాజా.

కొండుగాడి నివాస స్థలాన్ని నాలుగువైపులా వెదకుతూన్న నా కళ్లు భూపతిరాజామాటలు వింటూనే పైకి తేలిపోయాయి. అప్పటికే ఉదయార్కుడు ఆకాశమధ్యాన పందెం వేసుకు పరుగిడుతున్నాడు. గట్టిగా నిట్టూర్పు బరువు గుండెతో అతని వెనకాలే సాగిపోతున్నాను. ఇక నాలోని సంశయాలను అదుపుకోలేకపోయాను. "కొండుగాడు ఎంకి నివాసం చేస్తూండిన శిథిల గృహాలను చూపించినారు వారిని గురించిన కథేదైనా చెప్పుదురు

# బలిపీఠం

...న్నారా! ఐతే ఇక ఆలస్యం ఎందుకు?" అని అడిగేందుకు తొందరపడుతున్నావు. కాని, నీవు అడగక్కర్లేదు. నేనే చెబుతున్నాగా అన్నట్లు ప్రారంభించాడు భూపతిరాజు.

"ఆ గూడెంలోని యానాదులందరూ కొండలకు కోనలకు పోయి, ప్రకృతి సంపదల్ని తెచ్చి మన పల్లెలోను, పరిసర ప్రాంతాల్లోను అమ్ముకుని జీవించేవారు. కొండుగాడు తేనె తీయటంలో నేర్పరి. వాడికి అదే వృత్తి. వాడి కదో విశిష్టతను తెచ్చింది. కొండుగాడి దెబ్బంటే చిత్తూరుకోన అబ్బా అనాలి! తేనెకు ఆ కోన పేరుమోసింది. ఆ పరిసరాలకే ఎక్కువగా పోయేవాడు కొండుగాడు.

చిత్తూరుకోనకు పోవాలంటే చాలా మార్గాలున్నాయి. ఆ మార్గాలన్నీ కొండుగాడికి పిండికొట్టిన రాయి. అన్ని కోనలకు చిత్తూరుకోన కేంద్రంలాంటిది. దారంటూ తెలిసినవారికి ఏ మార్గంపట్టి వెళ్ళినా అక్కడకు చేరుకోవచ్చు. కొండుగాడు మాత్రం అరణ్యప్రాంతాలన్నీ చుట్టివచ్చేవాడు. గుండాలకోనకు వెళ్ళి అక్కడనుంచి అడ్డదారిపట్టి దుప్పట్లగుంత కొచ్చేవాడు. ఆ పర్వతసానువుల్లోంచి ప్రయాణంచేసి అమ్మోరిగుండం చేరి తర్వాత చిత్తూరుకోనకు నడక సాగించేవాడు.

చిత్తూరుకోన చిత్తూరు అడవుల్లో పుట్టి మన గ్రామానికి రెండామడల దూరంలో ఉన్న దామకొండవరపు ప్రాకి అందులో లీనమయిపోతుంది. అప్పటికి పోవాలంటే చాలా కష్టసాధ్యంతో కూడుకున్న పని. ఏ కొద్దిమందో తప్ప తతిమ్మా జనం ఆ ప్రదేశాన్ని చూచే ఉండరు.

నాకు తుపాకిగురంతో కొండుగాడికి రాతిగురికూడా అంతే. వాడు ఫలానచోటని రాయి విసిరాడంటే తప్పిపోకుండా తగిలిందన్నమాటే. కావాలంటే తిరుగు లేకుండా కళ్ళుమూసుకొని శబ్దాన్నిపట్టి కొట్టగలడు. ఒక పర్యాయం ఏం జరిగిందో తెలుసా? వాడు కాలిబాటను పోతూంటే ఎదురుగా చిరుతపులి తగిలింది. వాడికి పదిబారల దూరంలో అది కూర్చొని నోరుతెరచి వాడివైపే తదేక దీక్షతో చూస్తూంది. కాని, కొండుగాడికి భయమనేదిలేదు. మరి కొద్ది సేపట్లో అది వాడిమీదకు దుమికేది. అంతలోనే కొండుగాడు కత్తిరాయి తీసికొని దాని నోట్లోకి దూసుకుపోయేట్లు కొట్టినాడు. అది గిలగిలతిరిగి రక్తం కార్చుకుంటూ పరుగు లంకించుకుంది. వాడి సాహస కార్యాలన్నీ చుట్టుపట్ల పల్లెయులు కథలల్లి చెప్పుకునేవారు. నేటికీ వాణ్ణిగురించి చెప్పుకుంటూనే ఉన్నారు.

కొండుగాడి సాహస కృత్యాలను ఎంకి కూడా విని మురిసిపోయేది. అలాంటి మొనగాడు తన భర్త కావడంకన్నా అదృష్టం మరేముంటుంది అనుకునేది. ప్రతిదినము గంగమ్మ గుడికిపోయి కొండుగాణ్ణి తనవాణ్ణిగా చేయమని సాష్టాంగపడేది.

కొండుగాడు అజానుబాహువు. పత్తుగా మెలితిరిగిన మీసకట్టు. దారవేసి నేత్రాలు. ముఖం గంభీరంగా ఉన్నా జాలి ఉట్టిపడుతూంటుంది. వంకరలుతిరిగిన బలమైన కండరాలు. విడల్పాటి ఛాతీ. చేతిలో ఎప్పుడూ గుండుతేలిన మనిషెత్తు వెదురుకర్ర ఉంటుంది.

కొండుగాడి చిన్నప్పుడే అమ్మను, నాన్నను కలరావ్యాధి పొట్టబెట్టుకుంది. వాడంత దరిద్రుడు లేడంది లోకం. లేకుంటే చిన్నప్పుట తల్లిదండ్రులెందుకు చస్తారు? అని తలపోసుకున్నారు. కొండుగాడు ఎన్నో కష్టాలు పడినాడు. ప్రవాహసాదృశ్యమైన జీవితంతోపాటు పెరిగి పెద్దవాడయినాడు. తన కర్తవ్యం ఏమిటో తెలియదు. ఎన్నో ప్రతిబంధకాలలోంచి ఒంటరిగాడైన యువకుడుగా బైటపడినాడు. వాడు జీవితంలో పునః ప్రవేశించినటయింది.

అందచందాలతో అవయవసౌష్టవంతో ఇరువది ఐదు సంవత్సరాల యువకుడైన కొండుగాడు చక్కదనంతో వనదేవతలా వున్న ఎంకి తనపాలిటి ప్రణయసుందరి అనుకొనేవాడు. తప్పితే వాడికి ఎటువంటి ఆత్మబంధువులులేరు. అంతవరకు స్నేహితులంటూ ఉన్నా ఎడారిలో నివసిస్తూన్న ఒంటరికపోతంలా రోజులు నెట్టివేసినాడు.

కొండుగాడు, ఎంకి – ఇద్దరిదీ ఒకే ఈడు, ఒకే జోడు కూడా. ఇద్దరూ ఒకే గూడెంలో పెరిగారు. ఇంటిప్రక్క ఇల్లు, కలిసిమెలిసి తిరిగేవారు. ఆట్లాడుకుంటూ పోట్లాడుకుంటూ ఒకరి కనుసన్నల్లో ఒకరు మెలిగేవారు. తియ్యటి కబుర్లు, కథలు చెప్పుకుంటూ పరిసరాల్లోని కొండలు, కోనలు పికార్లు కొట్టేవారు. ఒకరికొకరు దయ, జాలి కనపర్చుకునేవారు. ఇద్దరిలో ఎవరు కష్టపడుతున్నా దుఃఖపడుతున్నా మెత్తని మనస్సుతో లాలిస్తూ ఓదార్చుకునేవారు.

కాలం వారిని ప్రేమతో బంధించింది. వారి అందం, వారి స్వభావం, గుణాలు, దోషాలు అన్నీ కలిపికున్నారు. ఒకరి జీవితంలో మరొకరి జీవితం మిళితమై ఏకం కావాలని మనసుల్లో మమతలను పెంచుకున్నారు. వారిలో ఒకవిధమైన ఉద్వేగం, మరొకరకమైన కోర్కె నిండిపోయింది. వారి మానసిక శారీరక తత్వాలు పెనవేసుకున్నాయి. ఈ బలీయమైన ప్రకృతి శక్తి వారి వివాహానికి దారి తీసింది. వారు వివాహం చేసుకోవాలనుకున్నారు.

ఒకాయన: "మీరు మా ఊరి కొచ్చినప్పుడు తప్పనిసరిగా మా ఊరి పిచ్చాస్పత్రిని చూస్తారు కదూ! చాలా తమాషాగా ఉంటుంది!"

ఇంకో ఆయన: "అయితే అక్కడ మిమ్మల్ని ఏ నంబర్ రూమ్‌లో కలుసుకోవచ్చు?"

—టి. కృష్ణస్వామిగౌడ్,
(హైదరాబాద్) - 6.

## 3

ఎంకి కొండుగాణ్ణి వివాహమాడతానని సూచనగా తండ్రితో అంది. కోతికి కల్లు త్రావించినట్లయింది ఆమాట. "ఛ! బంగారట్లాంటోడు బావ. మా మేనత్త కొడుకు రామిగాడుండగా, కొండుగాడెందుకే దరిద్రపు ముఖం. మేనరికం కాదంటావా? నా ఊపిరుంటే కొండుగాడికి కట్టబెడతానా? వాడి పూసెత్తావంటే యాపు తగులద్ది. జాగర్త!" అంటూ తిట్టిపోసినాడు ఎంకిని.

రామిగాడు ఎంకి మేనత్త కుమారుడు. ఆ ఊర్లో పేరుమోసిన కేడీ. రామిగాడి దుష్ట స్వభావం చూచి ఊరంతా అసహ్యించుకుంది. వాడంత దుర్మార్గుడు లేడని లోకం కోడై కూసింది. ఎంకిని ఏదోవిధంగా తన దాన్ని చేసికోవాలని ఉబలాట పడినాడు రామిగాడు. అందుకే ఎంకితండ్రికి అవసరం కొద్దీ డబ్బులుకూడా అందించేవాడు. నిషా తగ్గకుండా సారాయి తాపించేవాడు. ఎంకిని రామిగాడికే ఇచ్చి కార్యం జరిపిస్తానని తండ్రి మాటివ్వడం జరిగింది.

ఎంకి ఒంటరిగా కనిపిస్తే కన్నుగీటేవాడు రామిగాడు. తనను పెండ్లి చేసుకోమని ప్రతిమలాడేవాడు. కాని ఎంకి వాడిమాటలు పట్టించుకునేది కాదు. రామిగాడి చేష్టలు ఎంకికి అసహ్యం పుట్టించేవి. ఒకరోజు ఏకాంతంగా ఇంటిలో ఉన్న ఎంకిని బలవంతంగా పట్టుకోబోయినాడు రామిగాడు. వాడి బలమైన చేతుల్లోంచి తప్పించుకునేందుకు ప్రయత్నించింది. ఊపిరాడక గట్టిగా కేకపెట్టింది. అంతలోనే కొండుగాడు పరుగుపరుగున అక్కడ చేరినాడు. ఆ దృశ్యాన్ని చూచిన కొండుగాడు నిర్విణ్ణుడయినాడు. ఆ రోగపోతు అప్పటికీ కూడా ఎంకిని వదలేదు. కొండుగాడిలో కోపం శిఖరాగ్రాన్నందుకుంది. ఆ యువక హృదయం నిప్పులంగా

# బలిపీఠం

సంధ్యాకాంతితో ముచ్చట్లు చెప్పుకుంటూ ఎత్తయిన కొండశిఖరం వెనక్కు త్వరగా నడుస్తున్నాడు. ఆ సంజవెలుగు పసిడి ఛాయల కాంతులలో మేఘాలు బంగారు తివాచీలలాగా నాగేటకొండను చుట్టుతూన్నట్టు తెరలు తెరలుగా ప్రేలాడుతున్నాయి. ఆ ప్రకృతి సోయగము, అందులోని ఆనందములో మునిగిపోయి ఎక్కడో సుదూర అనంగస్వర్గంలో విహరిస్తున్నాను.

అంతలోనే భూపతిరాజు గొంతు విచ్చుకుంది. మాటలు ఒకటొక్కటిగా వెలువడుతున్నాయి. నివ్వెరపోయి అతనివైపు చూచినాను. అతను పునరాలోచించుకుంటూ కథను తెలియజేయడం ఆరంభించినాడు. "ప్రస్తుతం మన ముంటూన్న స్థలంలోనే వారిద్దరూ కలిసికునేవారు," అంటూ ధ్యానంగా నాసిస్తూ నాప్రక్క చూచినాడు. లిప్తపాటు ఆగిన నా గుండె తిరిగి విచ్చిగా కొట్టుకోసాగింది.

"ఆ దినం సాయంకాలం కొండుగాడూ ఎంకీ ఇచ్చటనే కలుసుకున్నారు. తమ హృదయాలు విప్పి మాట్లాడుకున్నారు. తమలోని మధురభావాల్ని వ్యక్తం చేసుకున్నారు. దివ్యానుభూతుల్ని ఊహించుకున్నారు. భావిజీవిత ప్రగతికి బాటలు వేసుకోవాలనుకున్నారు. ఆనాటి సంభాషణకు ఒక ప్రాముఖ్యత ఉంది.

"ఈలా రావటం మంచికాదు!" అంది ఎంకి.

"ఏం ఇష్టంలేదా?" అన్నాడు కొండుగాడు.

"ఎంతమాట!" అంటూ కొండుగాడి నోరు మూసింది.

"ఐతే ఎందుకు రాలేవు?" కొండుగాడి ప్రశ్న.

"నిన్నంటే అడిగే దిక్కులేరు బావా! అందులో మొగాడివి. మా నాన్న నన్ను రామిగాడికిస్తానని డబ్బులు గుంజుకొన్నాడు. నే నిట్టా రావటం తెలిస్తేనా? అమ్మో! ఇంకేముంది! బలికనిస్తాడా?" నిర్వేదంలో పంచాయితీ చెప్పుకుంది

"మరి నిన్ను చూడకుండా ఎట్టుండనే?" ఆ మాట కొండుగాడన్నప్పుడు ఎంకి హృదయం పులకరించింది. ఆనందంతో నృత్యం చేసింది.

"బాగానే ఉంటారు మొగాళ్ళు! అట్టనే చెప్పి పురికొల్పుతారు" ఎంకి దెప్పిపొడిచింది.

"నిజం ఎంకీ! నీకోసం ఏమైనా చేస్తా. గంగమ్మ సాచ్చి!"

"ఐతే ఇద్దరం పెండ్లి చేసుకుంటే పోతుంది బావా!"

"మీనాన్న ఒప్పుకుంటాడంటావా?" తన సందేహాన్ని వెలిబుచ్చినాడు.

"ఇప్పటికోసే ఏం చేస్తారులే! అంతా ఐపోతే గమ్మునుంటాడు."

"ఐతే ఇక ఆలస్యమెందుకే! ఈ రాత్రికే మనము చిత్తూరుకోన చేరుకుందాం! ఏమంటావ్?"

"ఏమంటాను! సై యంటాను! మనతో పాటు మా తమ్ముడైన సుబ్బిగాడు కూడ వస్తాడు. వాడికి నన్ను నీ చేతుల్లో ఉంచా లనుంది!"

అట్లానే పోయిగా, మధురాతిమధురంగా, ఒకరి కళ్ళల్లో ఒకరు వెలుగులు చూచుకుంటూ కాలాన్నిగూడా గుర్తించకుండా ఆనందలహరుల్లో మునిగిపోయినారు.

## 5

అప్పటికింకా తెల్లవారిందికాదు. అంతవరకు ఎంకి నాన్న తప్పత్రాగి ఏ చెట్టుక్రిందనో పడున్నాడు. త్రాగిన మత్తు కొంచెం తొలికోడి కూసేవేళకుగాని తగ్గిందికాదు. ఇంటికొచ్చి తలుపు తోశాడు. ఇంట్లో దీపం నిశ్చలంగా వెలుగుతూంది. ఎంకిమాత్రం కనిపించలేదు. కొండుగాడి ఇల్లు కూడా కండ్లల్లో దీపాలు పెట్టుకొని గాలించినాడు. ఫలితం శూన్యం. ఎంకి గుడిసెమీద వచ్చేసి కొండుగాడితో పారిపోయిందంటూ కేక లేసినాడు. ఊరు ఊరంతా ఊరేగి అక్కడ చేరింది. రామిగాడు అట్టహాసంచేస్తూ మీసాలు మెలిపెడుతూ వచ్చినాడు. కొండుగాడు చేసినపని అప్పటికిగాని వాడికి తెలిసి వచ్చిందికాదు. "పిరికిపంద, పారిపోయినాడు. వాడిపని పట్టకపోతానా! నా కన్యాయం చేసినోడు బతగ్గలడా! వాడి డొక్కచీల్చి పేగులుతీస్తా చూడండి! సుబ్బిగాడు కూడ వాడితోనే పోయినట్టున్నాడు. వాడి తల బద్దలుకొట్టకపోతే నాపేరు రామిగాడు కాదు!" అంటూ వాడి కోటికొచ్చినట్లు వాగటం ప్రారంభించినాడు. తల ఊగిస్తూ తన హుందాతనాన్ని ప్రదర్శిస్తున్నాడు.

తాము నిర్ణయించుకున్న ప్రకారం కొండుగాడూ ఎంకీ చిత్తూరుకోన చేరుకున్నారు. వారికి తోడుగా ఎంకి తమ్ముడు సుబ్బిగాడు కూడా ఉన్నాడు. దొరికిన చోటల్లా అడవిగడ్డలు, పండ్లు తింటూ ఆనందంగా పాటలు పాడుకుంటూ ఆ ప్రాంతం చేరుకున్నారు. పసిపిల్లలంత అమాయకంగా బాగు తయారయినారు.

తల పైకెత్తి తిలకిస్తే చూపుకందినంత ఎత్తుంటుందా పేటు. మబ్బుల్ని చీల్చుకొని ప్రాకిపోయినట్లు కన్పిస్తూంది. మనం ఆ పేటుమీద కెక్కి పరికిస్తే మరో అంతస్తుకట్టినట్లు అంతరిక్షాన్నందుకున్నట్లుంటుంది. మధ్యన పెద్ద పెద్ద లోతులు తీసికున్న గోతులా ఉంటాయి. అవన్నీ తేనె పెరలతోనిండి తేనెటీగలు ముసురుకొని పైకప్పు వేసినట్టున్నట్టి రాతిగుండ్లలా గుంటాయి. వాటిని చూచిన ఎంకిహృదయం ఉరకలువేసింది. తేనె తీద్దామా అన్నట్లు ఎంకివైపు చూచినాడు కొండుగాడు. ఇంతకంటేనా అన్నట్లు ఎంకిచూపులు ఉత్సాహంతో చిందులు త్రొక్కినాయి. తేనెకి తేలించే వయసన్నట్లు సుబ్బిడితో కూడా ఇద్దరూ పేటుపైకి అధిరోహించారు.

వెదురుకట్టెలు కొట్టి ఒకచోట కుప్ప వేసుకున్నారు. వెదురుకర్రలకు ఇరువైపులా గనుపులుండేట్లు మల్చుకున్నారు. చేపినార సేకరించుకున్నారు. రెండువెదుళ్ళకు మధ్య గనుపులకు చేపినారతో గట్టిగా బిగించి కట్టుకున్నారు. మధ్యలో ఎక్కడైనా వూటుకుపోతుంటుందేమో నని నాన్యంతా జాగ్రత్తగా పరిశీలించినారు. అదంతా చక్కగానే ఉన్నట్లు సంతృప్తిపడినారు. మరోక చేపిత్రాటిని పెనవేసినారు. ఆ రెంటిని ఒక చెట్టుకు బిగించినారు. కొండుగాడు తేనె తీసే పరికరాల్ని నడుముకుబిగించుకున్నాడు. కొండదేవతలకు నమస్కరించినాడు. ఎంకిని అక్కడనే చేర్చుకొని భయపడవద్దని వీపు తట్టినాడు.

వెదురు కర్రలతో తయారుచేసిన త్రాటిని పట్టుకొని, గనుపులమధ్య కాలునపేర్చి మెల్లగా మెట్లు దిగుతూన్నట్లు పేటుక్రిందకు పోతున్నాడు. చేపినారత్రాటిని ఆపుగా పట్టుకున్నాడు. అప్పటికే చాలదూరం దిగజారినాడు. కొండగాలి విసురుతూంది. ఆ గాలికి చెట్లన్నీ ఊగి అరణ్యమంతా కదిలిపోతూంది. కొండుగాడు ఊయల ఊగినట్టు ఒకవైపునుండి మరోకవైపుకు ఊగిపోతున్నాడు. గాలి వాడిని విసిరివేస్తూంది. అక్కడక్కడా కత్తిలాంటి బండలు వడుసుదేరి ముందుకొచ్చి ఉన్నాయి. చాకచక్యంతో వాటిని తప్పించుకుంటూ క్రిందకు పోతున్నాడు. ఎంకిమనసు కల్లోలంగా ఉంది.

తేనె తియ్యటం మాటలతో పనిగాదు. కత్తిమీద సాములాంటిది. ఎంకిగుండెలు దడదడలాడి పోతున్నాయి. తన బావ ఏమౌతాడో ఏమో అనే భయం వరసరాన పరిభ్రమిస్తూంది. సుబ్బడైనా తన ప్రక్కనుంటే అదో ధైర్యంగానైనా ఉండేది. వాడు ఆ చెట్లనీడల్లో పడుండి సుషుప్తిలో మునిగిపోయినాడు.

హఠాత్తుగా, అనుకోనివిధంగా నీలాకాశం ముసురుకున్న కారుమబ్బులు సంఘరించుకొని పడినపిడుగులా రామిగాడు అక్కడ ప్రత్యక్షమయినాడు. అంతవరకు వాడెక్కడ పొదలమాటున పొంచిఉన్నాడో! కొండుగాడిమీద పగతీర్చుకోవాలని, ఎంకిని తనదాన్ని చేసుకోవాలని, వాడు వీరిని వెంబ

(46-వ పేజీచూడండి)




**27-7-60 బుధవారం మొదలు**

**2-8-60 మంగళవారం వరకు.**

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ప్రస్తుతం పట్టుదల, సాహసము తగ్గించుకోవలసిన సమయం. కొన్ని సందర్భాలలో వెనుకాడవలసినట్లు కనుపించినా ఎదటి వారికి చులకన కాకుండా జాగ్రత్త పడగలుగుతారు. ఆదాయం మామూలుగానే ఉంటుంది. వ్యవహారరంగంలో పాటివారి యొక్క ఆదరణ, సహాయము బాగా లభిస్తవి. ఇంతకుముందుకన్నా దేహసౌఖ్యం బాగుంటుంది. ఇతరులకు వదలిన పనులు ఈ సమయంలో అసంపూర్తిగా నిలచిపోయే అవకాశాలున్నవి. కలహప్రసంగాలువస్తవి. కుటుంబంలో సాధారణంగా అశాంతి ఆరంభమవుతుంది. దూరప్రయాణాలు ఉంటవి. అధికారులతో సంప్రదింపులకు అనుకూలమైనకాలం. 1,2 లలో వస్తువు పోగొట్టుకోవటం, సంచారము, విసుగుదల.

* * *

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా. రోహిణి, మృగశిర 1, 2 పా.)

చివరకు ఫలితం మాట ఎలా ఉన్నా కార్యరంగంలో దిగటానికి ఉత్సాహము, అందుకు తగిన అవకాశాలు లభిస్తవి. మంచి మనుష్యులతో మైత్రిలభిస్తుంది. వృత్తి ఉద్యోగాలలో అభివృద్ధి కనుపిస్తుంది. అధికమైన వేడివల్ల మీ ఆరోగ్యం చెడుతుంది. స్వంతపనులకన్నా ఇతరుల కార్యభారం అధికం కావటంవల్ల అశాంతి కనుపిస్తుంది. పిల్లల ఆరోగ్యంకూడా సంతృప్తికరంగా తోచదు. అంతస్తును కాపాడుకొనే నిమిత్తం అనవసరంగా ధనవ్యయం చేయవలసివస్తుంది. యంత్రాలు నడపటం అగ్ని సంబంధమైన పనులు ఈ విషయాలలో జాగ్రత్తగా ఉండటం అవసరం. వారాంతంలో మిత్రవిరోధం వస్తుంది. 28, 29 లలో సంఘంలో గౌరవం కార్యసిద్ధి, లాభవార్తలు.

* * *

## మిథునం :

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ప్రత్యక్షంగా మీకు ఎవ్వరూ అపకారం చేయజాలరు. కాని మీతో స్నేహం నటిస్తు ఇతరులద్వారా మీకు నష్టం కలిగేటట్లు చేయగల మనుష్యులు ఉంటారు. ఏ పనిలో ప్రవేశించినా సాధకబాధకాలు నిదానంగా యోచించిచేయటం అవసరం. రాజకీయాలలో నిరుత్సాహకంగా ఉంటుంది. శుభ, పుణ్య కార్యాలు సుఖంగా జరిగే అవకాశాలులేవు. ఈ సమయంలో ముందుజరుగవలసిన పనులు నిదానంగాను, ఆలస్యంగా జరుగవలసిన పనులు త్వరగాను అనుకూలిస్తూఉంటవి. ఆదాయం పెరిగినా ఖర్చులను భరించటం శ్రమకరంగా తోస్తుంది. బంధువులవద్దనుంచి అసంతృప్తికరమైన వార్తలు తెలుస్తవి. అకస్మాత్తుగా మోసపోయే అవకాశాలున్నవి. 30, 31 లలో వ్యవహారవిజయం. వృత్తి అభివృద్ధి.

> వృషభంలో అంగారకుడు, మిథునంలో బుధుడు. కర్కాటకంలో సూర్య శుక్రులు, సింహంలో రాహువు, ధనుస్సులో గురు శనులు, కుంభంలో కేతువు. కన్య, తులా, వృశ్చిక సింహాలలో చంద్రుడు.

* * *

## కర్కాటకం

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ఈ వారం ఆరంభంలో కొద్దిగా ఆందోళనకలిగినా పట్టుదలతో ముందుకు పోగలుగుతారు. ధన సంబంధమైనకలహాలువస్తవి. మాట చెప్పినప్రకారం నడచుకుని అంతస్తును కాపాడుకోగలుగుతారు. ప్రారంభించిన పని సంపూర్ణంగా నెరవేరేవరకూ క్రొత్త ఆలోచనలు పెట్టుకోవద్దు. కుటుంబంలో కలతలు రాగల సూచనలున్నవి. ఓర్పువహించటం అవసరం. రావలసినవార్తలు ఆలస్యంగా వచ్చి ఆందోళనను కలిగిస్తవి. పుణ్యకార్యాలు అనుకూలిస్తవి. వారం రెండవభాగంలో అకస్మాత్తుగా ధనలాభం ఉంటుంది. విద్యావంతులు, ఉన్నతస్థితియందున్న వారితో పరిచయంలభిస్తుంది. విలువగల వస్తువులు కొంటారు. 31, 1 తేదీలలో వినోద కాలక్షేపం. ఇతరుల నిమిత్తం ఖర్చులు.

* * *

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

మీరు ఎంత జాగ్రత్తగా వ్యవహరించినా పోటీవారిని మెప్పించటంకష్టం. ఎప్పుడూ ఏదో ఒకపనిలో మునిగిఉండవలసివస్తుంది. దేవుని దయవల్ల మీ ప్రయత్నాలు అనుకూలిస్తవి. శుభకార్యప్రయత్నాలు ఒక నిర్ణయానికివస్తవి. అధికారులవల్ల జరుగవలసిన పనులు సులభంగా నెరవేరుతవి. మిమ్ములను గురించి సంఘంలో అపవాదులు ప్రచారం కాగల అవకాశాలున్నవి. అయినా అందువల్ల ప్రత్యక్షమైన అపకారం జరుగదు. ప్రయాణాలు అనుకున్న ప్రకారం జరుగవు. మీరు సాధించలేమని మానుకున్న పనులు సులభంగా నెరవేరుతవి. వారాంతంలో పొరపాటుచేసి సరిదిద్దుకోగలుగుతారు. 27,28లలో విపరీతమైనఖర్చు, ఇష్టంలేనిపనులు చేయుట.

* * *

## కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

విరోధులు ప్రత్యక్షంగా మిమ్ములను ఎదుర్కొంటున్నా నిరుత్సాహం తోచదు. వృత్తి ఉద్యోగాలలో మీ ధర్మాన్ని సక్రమంగా నెరవేర్చుకుని పైవారి ఆదరాభిమానాలు పొందగలుగుతారు. వ్యవహార విషయాలలో సంపూర్ణ సిద్ధి కలుగదు. కాని అదృష్టం అనేది సూచనప్రాయంగా తెలుస్తుంది. పాటివారికి ఉపకారం చేయగలుగుతారు. కుటుంబంలో సుఖసంతోషాలు లభిస్తవి. బంధుమిత్రులలో మీయందు మంచి అభిప్రాయం కలిగి కష్టసుఖాలలో అండగా నిలబడగలుగుతారు. శాస్త్ర విషయాలలో ప్రోత్సాహకరంగా ఉన్నా మానసికమైన భయం మిమ్ములను వెనుకకు లాగుతూ ఉండవచ్చు. సుబ్రహ్మణ్య స్తోత్రపారాయణం చేయండి. 28, 29 లలో ధనప్రాప్తి, ప్రయాణాలు, బంధుదర్శనం.

* * *

## ఈవారము ధరలు:

బంగారు ధర 28, 29 లలో మందీ, 1, 2, లలో తేజీ, వెండిధర 31 పైగా పెరుగుదల వస్తుంది.

పసుపుధర పెరిగి తగ్గుతుంది. వేరుశెనగ పప్పు ధర ఎక్కువగా తగ్గుతుంది. నూనెల ధరలు గత వారం మాదిరిగానే ఉంటవి. నూవుల ధర వారం చివరలో పెరుగుతుంది. అయితే మళ్లీ తగ్గే సూచనలున్నవి.

ధాన్యం ధర తాత్కాలికంగా మందీలో నిలుస్తుంది, గోధుములు, శెనగలు వీటికి గిరాకీ వస్తుంది.

మిర్చి ధర ప్రస్తుతంకన్నా రాబోవు కాలంలో పెరిగేసూచన లున్నవి.

**తుల:**

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ఈ సమయంలో మీ ప్రయత్నాలు ఫలించేటట్లు కనుపిస్తున్నా ఆలస్యం అవుతూ ఉంటుంది. తలవని తలంపుగా లభించే అవకాశాలు మాత్రం ఉపయోగించగలవు. దైవచింతన, ఆధ్యాత్మిక విషయాలలో ఆసక్తి పెరుగుతుంది. తోటివారికి న్యాయం చెప్పబోయిన సందర్భంలో నిష్ఠురాలు వస్తవి. ఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండండి. తరచు శుభకార్యాలలో పాల్గొంటారు. అధికారులతో కలహ ప్రసంగాలు రాకుండా చూచుకోవండి. వృత్తికి సంబంధించిన కార్యకలాపాలు చురుకుగా సాగుతవి. శ్రమకు తగిన ఫలితం ఉంటుంది. ముందు ఎప్పుడో జరుగతగు పనులను గురించి ఆలోచనలు చేస్తారు. పిల్లలమూలంగా ఆనందం లభిస్తుంది. 30, 31 లలో గౌరవం, ధర్మకార్యాలు, ధనలాభం.

* * *

**వృశ్చికం:**

(విశాఖ 4 వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఇంతకుముందు మీతో స్వతంత్రంగా మెలిగే మనుష్యులు కూడా కలహాలకు దిగుతారు. న్యాయసమ్మతమని మీ మనస్సుకు తోచినా ఇతరుల వ్యవహారాలలో జోక్యం కలిగించుకోవద్దు. స్వశక్తివల్ల సంఘంలో పేరుప్రతిష్ఠలు సంపాదించుకోగలుగుతారు. వృత్తి ఉద్యోగాలలో ఆడంబరంతోపాటు ఆదాయం కూడా పెరుగుతుంది. కుటుంబంలో ప్రశాంతత లభిస్తుంది. అకస్మాత్తుగా ఉత్తరదిక్కునుంచి శుభవార్తలు తెలుస్తవి. మీ అంతరంగిక విషయాలలో బయటివారు జోక్యం కలిగించుకుని మిమ్ము లను బాధించవచ్చు. జాగ్రత్తగా ఉండండి. వారం రెండవభాగంలో కార్యసిద్ధి. వ్యవహారాలలో అనుకూలత ఉంటవి. 27, 28 లలో బంధుమిత్రుల రాక, స్వల్పవిషయాలలో ఆందోళన, విలువగల వస్తువులు కొంటారు.

* * *

**ధనుస్సు:**

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ పా 1)

ప్రస్తుతం ఇతరుల పోటీ తొలగిపోయి మీ ఆలోచనలు ముందుకు సాగుతవి. ఇతరులవద్దనుంచి రావలసిన ధనం సకాలంలో లభిస్తుంది. కొన్ని సమయాలలో దండుగ ఖర్చులు చేయవలసివచ్చినా మరొక రూపంలో ఫలితం పొందగలుగుతారు. మీవల్ల సహాయం పొందినవారే మీయందు తప్పులు వెతకటానికి ఆరంభిస్తారు. వస్త్రాలు ఆభరణాలు మొదలయినవి కొంటారు. వారం మొదటిభాగంలో కుటుంబంలోనివారికి అనారోగ్యం చేస్తుంది. అన్నివిషయాలలోను మంచి సలహా చెప్పి ఉత్సాహంతో మిమ్ములను ముందుకు తీసుకొనిపోగల స్నేహితులు లభిస్తారు. ఇతరుల బాధ్యతలు పైన పెట్టుకుంటే సమర్థించటం కష్టం. 29, 30 లో శత్రుజయం, ఆడంబరం పెరుగుతుంది. ప్రయాణ సూచనలు.

* * *

**మకరం:**

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

కొన్ని రకాల మనుష్యులతో దూరంగా ఉండామని ప్రయత్నిస్తారు. కాని సాధ్యం కాదు. వృత్తిలో అభివృద్ధి కనుపించగల అవకాశా లున్నవి. ఆదాయం మాత్రం మీరు అనుకున్నంతగా పెరగదు. మీ సహాయంకోసం ఎదురుచూస్తూ, మిమ్ములను నిర్లక్ష్యంగా మాట్లాడే మనుష్యులు ఉంటారు. దూరమందున్నవారివద్దనుంచి ఏ విధంగాను సహాయం ఎదురుచూడతగిన సమయం కాదు. శుభవార్తలు తెలుస్తవి. క్రమక్రమంగా పోటీ తగ్గిపోయి మనశ్శాంతి లభిస్తుంది. ప్రయాణాలు సాగగలవు. స్వల్పవిషయాలలో ఇతరులవల్ల మోసపోతారు. వ్యవహార విషయాలలో మీ బుద్ధి చురుకుగా పనిచేయగలుగుతుంది. ధనసంబంధమైన చిక్కులు తీరిపోతవి. 28, 29 లలో గొప్పవారి స్నేహం, సందేహ వార్తలు.

* * *

**కుంభం:**

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ఎంత యోచించినా సందేహాలు మిమ్ములను వదలిపెట్టవు. విరామం లేకుండా ఏదో ఒకపని చేస్తూఉంటారు. సంతృప్తిమాత్రం ఉండదు. అన్ని హంగులు ఉండీ కూడా సుఖం పొందలేకపోతారు. ఆదాయం పెరుగుతుంది. రాజకీయరంగంలో తొందరపడకుండా ఉండటం అవసరం. సుఖ గౌరవం పొందగలుగుతారు. ఎంత నమ్మకస్తులయినా వారి మాటలను నమ్మి మీ బాధ్యతలను విడువవద్దు. కోర్టు కచేరీలలో సాధ్యమైనంతవరకు రాజీమార్గం అనుసరించటం మంచిది. కుటుంబంలో సుఖసంతోషాలు లభిస్తవి. మీ మాటకు అవతలివారి ఆదరణ లభిస్తుంది. వృత్తి వ్యాపారాలలో మీ పేరు ప్రతిష్ఠలు పెరుగుతవి. తలవని తలంపుగా ప్రయాణాలు చేయవలసివస్తుంది. 30, 31 లలో ధనప్రాప్తి, బంధుదర్శనం, శ్రమ.

* * *

**మీనం**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

ఏ సమయంలో ఏది అవసరమో అది మాత్రం లభించదు. ప్రతి పనిలోను చికాకు, తొందరపాటు అధికమవుతవి. కొంతవరకు మీరు జాగ్రత్తగా ఉండటంవల్ల కలహాలు రాకుండా తప్పించుకోగలుగుతారు. సంఘంలో అనేకమంది మిమ్ములను అనుసరిస్తారు. ఈ సమయంలో డబ్బు విశేషంగా ఖర్చు చేయవలసివస్తుంది. మీ కష్ట సుఖాలలో సాటివారియొక్క ఆదరాభిమానాలు సహాయము లభిస్తవి. వారం రెండవభాగంలో వృత్తిలో అభివృద్ధికరమైన సూచనలు కనుపిస్తవి. పిల్లల ఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండటం అవసరం. మీ పనులలో ఇంతకుముందు కనిపిస్తున్న ప్రతిబంధకాలు తొలగిపోతవి. మీ పలుకుబడిని వినియోగించి తోటివారికి సహాయం చేయగలుగుతారు. 1, 2 లలో లాభకరమైన పనులు, విద్యావంతులతో మైత్రి, అకస్మాత్తుగా దేహబాధలు.

—దైవజ్ఞ పోతూరి శ్రీరామమూర్తి





# వనితాలోకం

## 'మూఢనమ్మకాలకు మూలవిరాటులు'

# అనే అపప్రథ అతివలకు తొలగాలి

[illegible] ప్రబలిపోయిన మూఢ విశ్వాసాలని తలచుకుంటే నాకు అసహ్యం వేస్తుంది. ఆచారం, సాంప్రదాయం అంటూ అనుటలలో వున్న దురాచారాలని చూస్తే దుర్భరంగా వుంటుంది.

మా పిన్నికి వివాహం అయి యిరవై ఏళ్లు కావస్తోంది. సంతానంకోసం ఆమె చేయని నోము లేదు. ఎన్నో తీర్థయాత్రలు చేసింది. ఎందరో దేవుళ్లకు మొక్కుకుంది. అయినా భగవంతుడు ఆమెని కరుణించలేదు. పిన్ని పిచ్చిగాని దేముడికి మొక్కుకున్నంత మాత్రాన పిల్లలు కలగడమంటూ జరిగితే యీ సంసారబంధాలూ, దాంపత్య సంబంధాలూ ఎందుకు? ఆమెకి యింతవరకూ ఆ గుడ్డినమ్మకం పోనే లేదు. సాధువులనీ, జ్యోతిష్కులనీ యింకా తిప్పుతూనే వుంది. ఈవిధంగా సంతానంకోసమని ఎంతమంది అమాయకులు మూర్ఖత్వంలో మ్రగ్గుతున్నారో! ఎక్కడో ఒకచోట ఇలా చేసినవారికి పిల్లలు కలగానే అది దైవం యిచ్చిందే అనుకోవడం పరిపాటయింది.

డబ్బు కలవాళ్ల సంగతి యిది. మరి ఆర్థికంగా హీనస్థితిలో వున్నవారి సంగతో! 'కాలం మారింది', 'రోజులు మారాయి' మున్నగు మాటలు సినిమా టైటిల్సులో చూస్తున్నామే కాని ఆ మార్పు మన మనుషులలో మచ్చుకు ఎక్కడా గోచరించదు. పరిస్థితులను అర్థంచేసుకుని వాటికనుగుణ్యంగా నడుచుకోలేక వ్రతాలనీ, దానధర్మాలని తమ భర్తలకి యిబ్బంది కలిగిస్తూ సంసారంలో అశాంతి కలిగిస్తున్నామని వీళ్ళు ఎప్పుడు తెలుసుకుంటారో ఏమో!

మా దూరపు బంధువుల్లో అక్క వరస కావలసిన ఒకావిడుంది. ఆమె తల్లితండ్రులు [illegible]కోసం లెక్కలేనన్ని సంబంధాలు వెతికి చివరికి ముక్కూ మొగమెరుగని ఓ దూరదేశస్థుడికి కట్టబెట్టారు. తీరా చూస్తే అతను తన పొట్టకే తను పోషించుకోలేనివాడు. మా అక్కయ్యమాత్రం పుట్టింటి అలవాటు విడువకుండా ఎప్పుడూ ఏవో పూజలూ, పునస్కారాలూ సలుపుతూనే వుంటుంది. ఏ కొద్ది డబ్బుచేసినా ఏడుకొండలవాడికో, యాదగిరి నరసింహస్వామికో మొక్కులు చెల్లిస్తుంటుంది. తినడానికి తిండి లేకపోయినా యీ దురాచారాలమూలాన ఎన్ని అనర్థాలు జరుగుతున్నా మా అక్క గ్రహించదు. ఆమె భర్త ఎన్నిమార్లు నచ్చచెప్పినా దారికి రాలేదు.

**నూగూరు వాణి**

రానురాను ఆమె అంటే అసహ్యంవేసి చీటికీమాటికీ బాధపడడం నేర్చుకున్నాడు. ఇంతయినా ఆ యిల్లాలు తమ పచ్చని కాపురంలో చిచ్చు పెట్టడానికయినా ఒప్పుకుంది గాని తన ధోరణిమాత్రం మార్చుకోలేదు. నరకం అనగానే నాకు యీ కాపురాలే గుర్తుకు వస్తాయి.

పూజలూ, పునస్కారాలూ మున్నగు ఆచారాలు కూడదని నేననటం లేదు. పరిస్థితులను ఎరిగి మెలగినప్పుడే ఏ ఆచారమయినా రాణిస్తుంది. ఆచారాలు మనకోసం పుట్టాయి కాని, మనం వాటికోసం పుట్టలేదుగా! డబ్బున్నవారు ఎన్నయినా చేసుకొంటారు. మిగిలినవారి సంగతే ఎటొచ్చీ దుర్భరంగా వుంటుంది. ఈ సంప్రదాయాల పేరిట ఎన్ని పేద కాపురాలు చితికిపోతున్నాయి! కొంప కుదువబెట్టయినా వేలకువేలు అప్పు తెచ్చి పెళ్లిళ్లు జరుపుతారు కాని వున్నదాంట్లో గడుపుదామని భావించరు. మన దేశంలో దరిద్రం ప్రబలిపోవడానికి ముప్పాతిక భాగం మన పెద్దలు తెచ్చిపెట్టిన యీ దురలవాట్లే కారణం అంటే అతిశయోక్తి ఏమాత్రం కాదు.

ఆధ్యాత్మికత క్షణికమైన సుఖదుఃఖాలకి మనని దూరంచేసి సుఖశాంతులని ప్రసాదించవచ్చు. కాని అది మన నిత్యజీవితంలో ఆటంకంగా ఏర్పడకుండా, తోటివారికి కంటకంగా కాకుండా చూసుకోవలసిన బాధ్యత మనమీద వుంది.

నిజానికి యీ పూజలూ, పునస్కారాలూ చేసేవారందరూ పట్టి స్వార్థపరులే అనిపిస్తుంది. సంతానంకోసమనో, కేసులలో గెలుపుకోరకూ, యింకా ఏవేవో కోరికలు మనసులో పెట్టుకుని వడ్డికాసులవాడికి మొక్కుకుంటారు. ఆంజనేయస్వామికి సంతర్పణలు చేస్తారు. వీరందరూ నిజంగా భక్తిపరులేనా? "ప్రతి శనివారం ఒక కానీ అయినా వెంకటేశ్వర్లకి ముడుపు చెల్లించకపోతే ఆరోజు తప్పకుండా యింట్లో తేళ్లు బయలేరతాయి" అంటుంది అమ్మ. చివరికి దేవుడికి కూడా డబ్బుమీద యింత మోజు వున్నదంటే నవ్వు వస్తుంది. "ఈ కట్టుబాట్లూ, ఆచారాలూ లేకపోతే భగవద్భక్తి అనేది మనుషులలో పూజ్యం అవుతుంది" అంటారు పెద్దలు. అది మనిషికి తనమీద విశ్వాసం లేనియెడల అనవలసినమాట. తనమీద తనకే విశ్వాసం లేనివాడు మనిషి కాడు. నిజానికి మనిషిని మించిన దేవుడు లేడు. తనలో వున్న ఆదివ్యశక్తిని గ్రహించనంతవరకూ ఎన్ని ప్రార్థనలు చేసినా, ఎన్ని తీర్థయాత్రలు సలిపినా ప్రయోజనం లేదు. తీర్థయాత్రల ఆదర్శం దూరప్రాంతాలలో నివసించేవారి మధ్య సన్నిహితత్వం కలగచేయడం, అక్కడి ఆచారవ్యవహారాలు బాగా ఆకళింపై లోకజ్ఞానం అలవడ్డం. అంతే కాని గుడ్డినమ్మకాలతో మొక్కులు చెల్లించడానికి వెళ్లడం కాదు.













18-5-60 వ తేదీ వారపత్రికలో చంద్ర గారు తమవ్యాసంలో కొన్ని విలువైన మాటలు చెప్పారు. పునరుక్తి అయినా అవసరంకొద్దీ వాటిని యిక్కడ ఉదహరిస్తున్నాను—"ఆదిమానవుడు చీమ చిటుక్కుమన్నా భయపడేవాడు. ఏదివిన్నా భయమే. ఏది కన్నా భయమే. ఆ భయమే భగవంతుడు. గ్రహాలుకూడా ఎవరికో భయపడి తిరుగుతున్నాయనుకున్నాడు. గ్రహణం మూలంగా అది మరుగైతే ఏమిమూడుతుందో అని మరింత భయపడి ప్రార్థనలు, దానాలు చేసేవాడు కాని దానాలు చేస్తే గ్రహాలు ప్రసన్నమౌతాయా ? అయితే సూర్యగ్రహం ఎండాకాలంలో ఎందుకు కాలుస్తుంది ? చలికాలంలో ఎందుకు వేడి తగ్గిస్తుంది ?"

ఎవరో చనిపోయిన సమయానికి తోక చుక్క రాలితే, తోక చుక్క రాలినప్పుడల్లా ఎవరో చనిపోతూనే వుంటారన్నారు కాని మానవుడి మరణానికి, తోక చుక్కకీ సామ్యంవున్నట్లు ఎవరూ ఋజువుపరచలేరు. ఎవరో ఎప్పుడో అన్న మాటలు కాకతాళీయంగా నిజం అయినంత మాత్రాన జ్యోతిష్యం నిజమని ప్రచారం లేవదీశారు. తప్పుపనులు చేసి మనిషి ఎక్కడ కలుషిత మవుతాడో అనిభయపడి స్వర్గనరకాలని కల్పించారు. ఈ విధంగా మానవుని మనోదౌర్బల్యమే యిన్ని మూఢవిశ్వాసాలకి దారి తీసింది.

ఒకసారి మా మామ్మతో కలిసి రైల్లో దూరప్రయాణం చేయవలసి వచ్చింది ఆమెకి మడీ, ఆచారమూ అంటే తగని పిచ్చి. ఇతరులిచ్చే పచ్చి మంచినీళ్ళు కూడా ఆమె పుచ్చుకోదు. గురదృష్టవశాత్తూ ఆరోజు ఆమె వెంట ఏమీ తెచ్చుకోవడానికి వీలులేకపోయింది. తెల్లవారుఝామున రైలు ఎక్కినామె పాయంత్రంవరకూ ఎంత మొత్తుకున్నా కాఫీకూడా పుచ్చుకోలేదు. చివరికి ఆమె రైల్లో సొమ్మసిలి పడిపోయింది, కూడా. మా అన్నయ్య వుండబట్టి యిద్దరమూ ఎలాగో పట్టుకుని జట్కాలో పరుండబెట్టాము. లేకపోతే నేను ఎన్నికష్టాల నెదుర్కోవలసివచ్చేదో! ఇలా వుంటుంది యీ ఆచారపరాయణుల సంగతి.

నేనింతగా ఎందుకు చెబుతున్నానంటే కాలంతోపాటు మనిషికూడా మారడం అలవర్చుకోవాలని. మానవుడు చంద్రమండలంలో అడుగుపెట్టబోతున్న యీతరుణంలో తనచుట్టూ వున్న సమాజాన్ని గుర్తించకుండా అజ్ఞానాంధకారంలో మునిగికొట్టుమిట్టాడే పరిస్థితులు తొలగిపోవాలి. జగత్తంతా భగవంతుడిసృష్టి అనుకుంటే రోజులుకూడా ఆయన యిచ్చినవేకదా! మరి వాటిలో కొన్ని శుభప్రదమైనవిగానూ మరికొన్ని అశుభంగానూ ఎందుకు పరిగణిస్తారు. దుర్ముహూర్తాలూ, శుభగడియలూ ఎందుకు? వాటి పిచ్చిగానీ ప్రతిదీ శుభసమయంచూసి చేసినా లోకం యింకా ఎందుకు బాగుపడడంలేదు! వాళ్ళజీవితాలు ఎందుకు సుఖమయంకావడంలేదు? ఇలా పరిగణించేవారందరూ దేవుడిమీద విశ్వాసంకలవాళ్ళేనా? నిజంగా ఆయనమీద భక్తేవుంటే ఎందుకు యిందరుదేవుళ్లు? దేవుడనేవాడు ఒక్కడే అన్న విషయం

త్రుల ప్రేమకు కృతజ్ఞతాచిహ్నంగా వారి యిష్టానుసారం ప్రవర్తించవచ్చు! అవకాశం ఉంటే-తామూ, తల్లిదండ్రులూ పరస్పరం అర్థంచేసుకోగలవాళ్లైతే- చెప్పి ఒప్పించవచ్చు. లేదా, గాఢానురాగాన్ని పురస్కరించుకొని, మారాంచేసి, మంచినీళ్ళు ముట్టనని, భీష్మకట్టి, శాంతంగా సాధించవచ్చు కార్యాన్ని!

కర్టెన్సుకు - టేబిల్ క్లాత్సుకు - మిడిల్ డిజైను.

గొట్టిపాటి లీలావతి (అనంతపురం)

మనం ఉన్న ఊళ్లోగాక, మరొక ఊళ్ళో ఉన్నారనుకోండి-వధువో, వరుడో, ఆ పరిస్థితుల్లో, 'పెళ్లి చూపుల' కని వెళ్ళిన ఆకొద్ది సమయం, వధూవరుల పరస్పర సమశీల పరిశీలనకు తావిస్తుందా? శీలపరిశీలనకు, ఒక గంట-అరదినం-పూర్తిరోజు చాలుతుందా? ఏ ధోరణిలో వాళ్లు సంభాషించుకోవచ్చు?

'పెళ్ళిచూపుల' కని వచ్చి ఉన్నవాళ్ళు ఇష్టానిష్టాలు మాటలద్వారా పరిశీలనార్థమని ప్రకటించడంలో-ముఖ్యంగా వధువు-చక్కదనం ఉందంటారా?

'లేకుంటా ఏం?'—అంటారా! సరే, సంతోషం!!

శీలపరిశీలనకు చాలావ్యవధి కావాలనుకుంటాను!

కాలేజి లైబ్రరీల్లో, లేబొరేటరీల్లో, వెయిటింగ్ రూముల్లో, ఇంకా-కాంటీన్స్‌లో, ఇళ్ళదగ్గర-పుస్తకాలిచ్చి పుచ్చుకోవడాల్లో మరి బస్సుల్లో, పార్కుల్లో, సముద్ర తీరాల్లో; డ్రామాలు, సినిమాలు, ఉపన్యాసాలు వగైరాల్లో యువతీ యువకులు కలిసి మాట్లాడుకోడానికి అవకాశాలున్నాయి!

కావ్యాల్లో, కథల్లో, సినిమాల్లో, ప్రేయసీప్రియులు కలుసుకోవడం; ఆడుకోవడం, పాడుకోవడం; వేడుకోవడం, విడుకోవడం—వగైరా చూసి, ముచ్చటపడి, అవి మంచిపద్ధతులని ఊహించుకోవడం సొగసుగానే ఉంటుంది! మరి, అవి కార్యరూపం ధరించే దగ్గిరేవచ్చిన చిక్కంతా!!

అన్ని అవకాశాలూ కల్పించుకున్నప్పుడైనా, యువతీయువకులు పరస్పర సమశీల పరిశీలన చేసి, ఒకనిర్ణయానికి రావడం సాధ్యమేనా?

పరస్పరాకర్షణ ఉన్నచోట పరిశుద్ధ మనస్కులై పరిశీలన జరపడం చాలా అతీతమైన దనడం నింద్యంకాదు.

ప్రథమ సందర్శన సమయంలో జరిగిన తేజస్సంయోగఫలితంగా మోహమో, విముఖత్వమో జనిస్తుంది. దాని ప్రభావం బలంగా కొంతకాలం పనిచేస్తూనే ఉంటుంది. ఇది, యథార్థపరిశీలనకు కొంచెం ప్రతిబంధకం! ప్రీతిఉన్నప్పుడు తప్పులైనా ఒప్పులుగా కన్పిస్తాయి; మోజుతీరి, జీవితంలో తృప్తిలేనప్పుడు అన్నీ తప్పులుగా తోస్తాయి. మోసపోయామే అనుకుంటాం; ఇదంతా దృష్టిభేదం. సమయప్రభావం!

ఒకర్నొకరు అర్థంచేసుకోవడం, అర్థమైనంత మట్టుకు సరిపెట్టుకు పోతూండడం, ఉభయుల్లో ఉన్నప్పుడు స్నేహం గాఢంగా పెనవేసుకుని ఉంటుంది! మరి యీ గుణం ఎదుటి వ్యక్తిలో ఉందా?— అంటే, చెప్పడం అంత తేలికకాదు, మనస్తత్వజ్ఞులకైనా. ఇందుకు మామూలు పెళ్ళిచూపులు, సమశీలపరిశీలనలు చాలవు! 

# వనితా వాణి



## ఆడపిల్లలు....

రత్నా మహీధర్ గారి "ఆడపిల్లలు అడ్డంకులు" వ్యాసం ఇప్పుడే చదివేను. వ్యాసంలోని ప్రతి వాక్యం యదార్థాన్ని నిరూపిస్తున్నాయి. ముఖ్యంగా ఆంధ్రలోని ఇంచుమించు అందరి ఇళ్లల్లోని అవివాహిత యువతులకు వారు సూచించిన అడ్డంకులు అనుక్షణం ఎదురవుతూనన్నది ముమ్మాటికీ నిజం. నాగరికతను అలవరచుకొన్నామని భావిస్తూనే పాత భావాలను పూర్తిగా తిలోదకాలివ్వలేనివారు మనలో కొల్లలు. ఈ పాత క్రొత్తల కలయికతో కూడిన హద్దులు, నియమనిబంధనలు మరింత బాధాకరంగా పరిణమిస్తున్నాయి. మనసులో మాట మరొకరికి వ్యక్తం చేయలేక నియమాలనే అడ్డంకులలో నలిగే ఆడపిల్లలకు వారి వ్యాసం కొంత ఉపశమనం. వారికి నా ధన్యవాదములు.

లక్ష్మీచందర్ (కలకత్తా)

* * *

## "మగవారు మారాలి!"

ఈ చెప్పే సలహాలు సరళ గారు కాస్త మగవాళ్ళకు చెబితే బాగుండునేమో. పెళ్ళిచూపులలో ఆడది ఏకాంతానికి అంగీకరిస్తే అంతటితో ఆమె జీవితం పాడే. ఎందుకంటే ఆ సంబంధం కుదరకపోతే మరొకటీ, తప్పితే మరొకటీ – ఎంతమందితో ఏకాంతం? ఎన్ని సార్లు? ఇన్నిసార్లూ అయింతర్వాత ఇక ఆమెగతి ఏమిటట? ఇంతమందికి నచ్చనిది మనకా? అంటారు మగరాయుళ్లు.

అయినా పిల్ల ఏకాంతాని కంగీకరించగానే పిల్లవాడి మనస్సులో "ఈమె జంకు గొంకు లేకుండా అంగీకరించింది కనుక " అంటూ అనుమాన పిశాచం గజ్జెకడుతుంది.

మగవారు మారాలి. మగువలు వారంతట వారే అంగీకరిస్తారు.

వి. సరళ (విశాఖ)

## "నేను మోసపోయాను"

6-7-60 పత్రికలో 'సరళ సలహా' మీద ఎం. విజయలక్ష్మి (పెనుగొండ) చేసిన వ్యాఖ్య చాలా చక్కగా వుంది. అది నిజమే కూడా విశదంగా వ్యక్తిగతంగా మాట్లాడి (వరుడితో) నష్టపోయినవారిలో నేనొకరిని. కేవలం సాంఘిక, రాజకీయ విషయాలపై చర్చ జరిపినందుకే, అతనెందుకంత అపార్థము చేసుకున్నాడో నాకర్థం కావడంలేదు. కాబట్టి ఆ సలహా అనాచరణీయమనే నా భావన కూడా!

"సోదరి" (ఏలూరు)

కోకొల్లలుగా వస్తున్న విమర్శలకు సరళ సమాధానం వచ్చే వారం చూడండి.

* * *

## స్త్రీలు - పురుషులు

ఈ వారం 22-6-60 పత్రికలో సోదరి ఎ. నాగలక్ష్మిగారు వ్రాసిన స్త్రీలు - పురుషులు అనే వ్యాసం నా కెంతో బాగున్నది. వైవాహిక విషయంలో నేడు సంఘంలో జరుగుతున్న పరిస్థితులు అతి వాస్తవికంగా, పాఠకుల హృదయాలకు ఆనందాన్ని కలుగచేసేటట్లు వ్రాశారు. నేటి పరిస్థితులలో ఆడపిల్లలకు డిగ్రీ కోర్సులు చెప్పించినా కూడ చాల కష్టంగా ఉంటోందని వ్రాశారు. ఆమె వ్రాసిన ఈ విషయంలో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను ఆడపిల్లలకు స్కూలు ఫైనలు ప్యాసైన పిమ్మట, ఏ లలితకళలో చేర్పించిన చాల బాగుంటుందని ఆమె వ్రాశారు. మొత్తము మీద నాగలక్ష్మిగారు వ్రాసిన విషయాలన్నీ, మాకు బాగా నచ్చాయి యిక ముందుకూడ ఇట వ్యాసాలే ప్రచురిస్తారని తలుస్తాను. నాగలక్ష్మిగారికి నా అభినందనలు. సరళసలహా సరళంగా చాల బాగుంటోంది.

డి. లలిత. (ఏలూరు)

* * *

## మాట సొగసు

సోదరి కైరభట్ల లీలా సీతారామ్‌గారు మాటసొగసు గూర్చి చాలా వివరంగా వ్రాశారు. ఈ వ్యాసం చదవడమువలన కొందరు మహిళలు మాట్లాడుట యెట్లో తెలుసుకుంటారని ఆశిస్తున్నాను. రచయిత్రికి వనితాలోకం ద్వారా నా అభినందనములు.

క్రిష్ణ (ఛత్రపురము)

* * *

## వనితావాణి

వనితాలోకంలో కేవలం ముద్రితమైన ఉపన్యాసాలు చూసి ఊరుకోవడమే ఇన్నాళ్ళూ జరుగుతోంది. 'వనితావాణి' ప్రవేశంతో పఠితల అభిప్రాయాలు వెలువరించేటందుకు అవకాశం కలిగింది. ఇది వరకు పిల్లలబడి యిప్పుడు అసెంబ్లీ అయింది. అందుకు నా అభినందనలు.

శైలజ (పార్వతీపురం)

* * *

## ఒక్కసారి గతం

వనితాలోకంలో ఒక్కసారి మళ్లీ విమర్శనాత్మక వ్యాసాలపరంపర ప్రచురణ చాలా అవసరం. కాలదోషంపట్టిన (పట్టని) ప్రవచనాలులాటివి ప్రచురించి చర్చించాలి. 'అనూరాధాదేవి'లాటి బ్యాటరీలైటులో చీకటి దొంగలగుట్టు పట్టుకోవాలి. మరింత చైతన్యం వనితాలోకంలో రావాలి. ఒక్కసారి గతంలోకి వెళ్లి రావాలి.

ఆర్. శ్రీదేవి (నల్లకుంట, హైదరాబాదు.)

* * *

## సర్దుకు పోవడం

కే. కృష్ణకుమారిగారు వ్రాసిన 'సర్దుకుపోవడం' చాలా చక్కగా, వాస్తవిక దృక్పథంతో వ్రాశారు.

తెలుగు యిల్లాలు చిరకాలంగా సహనానికి పేరు పడ్డది ఇది పురుషుల విషయంలో ఆమె వైఖరికి వచ్చిన పేరు. అయితే సమజాతివారైన సాటి మహిళలతో కూడా స్త్రీ సర్దుకుపోవడం అవసరం.

సర్దుకుపోవడం ఓటమికాదు. అంతిమ విజయం. ఇదే రహస్యం!

— పద్మినీప్రియదర్శిని (తెనాలి)



# బలిపీఠం

(87-వ పేజీ తరువాయి)

కించినట్లున్నాడు. రామిగాడి చేతిలోని కత్తి వదులుబడి తళతళ మెరిసిపోతూంది. అప్రయత్నంగా రామిగాడినిచూచి ఎంకి నిర్ఘాంతపోయింది. పూర్వస్మృతులు మెలికలు తిప్పుకుంటూన్న ఎంకి శిలాప్రతిమలా నిశ్చలంగా నిలబడిపోయింది. అనుకోని అవాంతరం కత్తికెక్కినట్టుమాత్రం తెలిసికోగలిగింది. ఆమెలో ఆలోచనలు ఆగిపోయాయి.

రామిగాడు తన చేతిలోని కత్తిలో చెట్టుకుబిగించియున్న జంట్రాళ్ళను తెగగోసినాడు. ఎంకి తన రెండుచేతులలో ఆ రెండుతాళ్ళను గటిగాపట్టుకొని వెర్రిగా అరిచింది. ఎంకి ముందుకు లాక్కుపోతూంది. రామిగాడు ఎంకి నడుము గటిగా పట్టుకున్నాడు. కొండుగాడు ఏదో ఉపద్రవంజరిగిందని తెలిసికొని ఎంకిని హెచ్చరిస్తూ పైకి ఎగబ్రాకుతున్నాడు.

ఎంకి రామిగాణ్ణి అసహ్యించుకొని నానా రకాలుగా తిడుతూంది. ఇకనైనా వదిలిపెడితే తన బావను కాపాడుకుంటానని బ్రతిమలాడుకుంది. కాని రామిగాడికి ఇంత కన్నా మంచి అవకాశం దొరకదు. ఎంకి ఎన్నో తియ్యటిమాటలు చెబుతూ ఒంగపోతున్నాడు. రామిగాడిమాటలు ఆమె వినిపించుకుందికాదు. అంతలోనే సుబ్బిగాడు పరుగుపరుగున అచ్చటికొచ్చినాడు. ప్రక్కనున్న బలమైన కగురుకర్రతీసికొని శక్తినంతా వినియోగించి రామిగాడి తలకు సరిగా విసిరాడు. ఆ దెబ్బతో రామిగాడు నేలకొరిగినాడు. పొలికేక పెటిన ఎంకి తన చేతిలోని త్రాళ్ళను విడిచిపెట్టింది. కొండుగాడు ఏ బండరాతిమీద పడిపోయాడో, ఏ గుండుమీద కూలిపోయాడో, ఎవరికి తెలుసు?

ఆ దుస్సంఘటనతో ఎంకి తలంతా పిండి కొట్టినట్లయింది. ఆమె గుండెల్లో వేయి సూదులు ఒక్కపర్యాయం గ్రుచ్చుకున్నట్లయినాయి. ఆమెలో ఆవేశం పొంగింది. ఆమె హృదయం దహించుకుపోతూంది. తన భవిష్యత్ జీవితం కుప్పకూలిపోయింది. నిరాశ, నిస్పృహలకలయికతో ఆమె మనసు కల్లోలమయింది. తన జీవితపు పట్టుగొమ్మ విరిగి నేలకొరిగింది. ఆమెచూపులు తీక్షణంగా రామిగాడివైపు చూచినాయి. వాడు పైకి లేచే పరిస్థితిని పూర్తిగా కోల్పోయినట్లున్నాడు. నేలంతా చుట్టుకొని అతికష్టం మీద ప్రాకుతున్నాడు. వాడి ముక్కుల్లోంచి రక్తపు బిందువులు పడిసి పడుతున్నాయి.

రామిగాణ్ణి చూచిన ఎంకికండ్లు ఎర్రతంపు పులుముకున్నాయి. పండ్లు అప్రయత్నంగా పటపటలాడినాయి. ఆమెలో ఏదో ఉద్వేగం ఉప్పొంగింది. కసితో బుసలు కొట్టింది. ఎంకి పైటకొంగు నడుముకు బిగించుకుంది. తన ఆశలన్నీ నేలమట్టంచేసిన రామిగాణ్ణి బ్రతకనివ్వకూడదనుకుంది. ప్రక్కకు చూచింది. పెద్దగుండు. మోయలేని బరువుఅయినా అమాంతంగా దాన్ని లంకించుకొని పైకెత్తింది. కోపంలో అంత బరువైన గుండు తేలికగా పైకెత్తింది. రామిగాడు ఇక తన చావుసిద్ధమనుకున్నాడు. తనజీవితం ఆ క్షణానికి ఆఖరనుకున్నాడు. రెండు చేతులు కష్టసాధ్యంతో పైకెత్తి ఎంకికి నమస్కరించినాడు. తన తప్పు క్షమించమన్నట్లు, జాలిగా, దీనంగా ఎంకివైపు చూచినాడు. కళ్ళనిండుకు కన్నీరు కార్చినాడు. కాని వాడిచూపులు ఎంకి కరిగించేవి కాదు. ఆ సమయాన ఆమెకంత ఓర్పు లేదు. సర్వస్వము తనబావే అనుకున్న కొండుగాణ్ణి బలిగొన్న ఈ దుర్మార్గుడు క్షమార్హుడు కాదనుకుంది. పగసాధించే పన్నాగంలా తన మనసును కట్టుదిట్టం చేసుకుంది. కండ్లు గట్టిగా మూసుకుంది. జరుగబోయే బీభత్సం ఇక చూడలేననుకుంది. తనచేతిలోని గుండు రామిగాడి నెత్తికి సరిగా వదిలిపెట్టింది. రామిగాడితల బ్రద్దలైపోయింది. వాడి ఉచ్ఛ్వాసనిశ్వాసాలు అనంతవాయువులో కలిసిపోయాయి.

## 6

"ఇక మనం మెల్లగా నడక సాగిద్దాం. రేపు సాయంసంధ్యకుగాని మన గమ్యస్థానం చేరుకోలేం" అంటూ తుపాకి భుజంమీద వేసుకొని ముందుకు కదిలాడు భూపతిరాజు. అతన్ని అనుసరిస్తూ సాగిపోతున్నాను. నేను విన్న కథను ఆలోచనల్లో మెలికలు తిప్పుకుంటూ, అందులో సహజత్వం ఎంతమాత్రముందో తర్కించుకుంటూ నడుస్తున్నాను. ఏటి వడ్డునే చెట్ల నీడల్లో ప్రయాణం చేస్తూ మరుసటిరోజు సాయంకాలానికి అనుకున్న ప్రాంతం చేరుకున్నాము.

మేము ఆ ఎత్తయిన పేటుమీద కూర్చున్నాం. అక్కడున్న మర్రిచెట్టు ఎన్ని సంవత్సరాల నాటిదో! దాని వ్రేళ్లు దూలాలంతగా బలిసిపోయి అక్కడక్కడా భూమిని పగలదీసికొని పైకి కనుపిస్తున్నాయి. దాని ఊడలు జానపద కథల్లో చిత్రించిన రాక్షసుల తలవెంట్రుకల్లా ఊగిపోతున్నాయి. ఆ పేటుకు పైభాగాన మరొక పేటు, చూచేందుకు మబ్బుల్ని తాకుతూన్నట్లుకన్పిస్తూంది. ఆ ప్రాంతమంతా చెట్ల నీడలతో నిండి ఉంది. మేమూ చెట్టుక్రింద ఒక విశాలమైన చదునైన బండమీద కూర్చున్నాము. మాకు రెండు వేపులా చెట్ల ఆకులు, రకరకాల తీగ











# బలిపీఠం

లతో అల్లిబిల్లిగా దట్టంగా అల్లుకుపోయి ఉన్నాయి. మేమున్న చోటుకు పైనుంచి ఒకవైపు గలగల దూకే చిన్న జలపాతం. మరొకవైపు జలజల పారే సెలయేటి ప్రవాహం. అక్కడక్కడా ఏర్పడ్డ చిన్న గుంటలు ఆ ప్రవాహపు నీటిని నింపుకొని తేటపడి ఉన్నాయి. ప్రవాహపు గతి తీవ్రంగా ఉన్నచోట ఆ సెలయేరు మెలికలు తిరిగి వింత గానాన్ని విన్పిస్తూ పరుగులు తీస్తూంటుంది. జలపాతపు నీరు దుమికే చాలులో నిగనిగ మనే మెరుపు ప్రతిఫలిస్తూంటుంది. సెలయేటి ప్రవాహపు గతి ననుసరించి చూసే కనుచూపు మేరలో వింతకాంతులు పైకి లేచి లేడిపిల్లల్లా గంతులేస్తూంటవి. ఆ యేరు అరణ్యప్రాంతంలో కొన్ని చిన్న గుట్టల్ని ప్రదక్షిణం చేసికొని వచ్చుటి సొన్లను సొన్లు కాని కనుమరుగై పారిపోతుంది. తను ప్రవహిస్తున్న ఆ పురాతన అరణ్యపు హృదయంలోని కథలను అది గుసగుసలద్వారా మనకు విన్పిస్తూంటుంది. ఆ ప్రకృతి రామణీయకతను తిలకిస్తూ ఇద్దరం నిశ్శబ్దంగా కూర్చున్నాం.

అంతలోనే "బావా బావా బావా!" అనే ప్రశాంతమయిన ధ్వని వినిపించింది "ఏమిటా శబ్దం? ఎందుకలా విన్పిస్తూంది?" భూపతిరాజును ప్రశ్నించాను.

"ఆ శబ్దమా! ఎంకి తన బావకోసం తిరుగుతూ అరుస్తూంది!" అసలు విషయం తెలియజేసినాడు. ఆశ్చర్యంగా కళ్ళప్పగించి అతని కళ్ళల్లోకి చూచినాను అతడు ధ్యానంగా హాని సూదీనంగా పరిసరాలను చూస్తూ అన్నాడు: "ఎంకి ఈ అడవి ప్రాంతమంతా కలయ తిరిగింది. ఆ కోనకు క్రిందిప్రాంతమంతా వెదకింది. చిన్న చిన్న పొదలను అవుచేసికొని అగాధమైన లోతు లోయల్లోకి నడిచింది. అక్కడున్న పొగలన్నీ గాలించింది. కనీసం కొండుగాడి అస్థిపంజర మయినా కనుపిస్తుందనే ఆశతో, బావను పలుకరిస్తూ, కూరమూల లన్నీ కలయ తిరిగింది. ఉన్నట్లుండి ఆమె పాదాలకు ఏదో గట్టిగా తగిలింది. ఎంకికి దెబ్బతిన్నట్లయింది. తలవంచి దృష్టి సారించింది. అది కపాలం. ఆకారం ఎవరయిందీ అట్టే స్పష్టంగా కనుపించకపోయినా అది కొండుగాడి పుర్రెనని పోల్చుకోగలిగింది. దాన్ని మనసారా తన హృదయానికి హత్తుకుంది అరణ్యమంతా ప్రతిధ్వనించేట్లు బిట్టున విలపించింది. సెలయేటి శబ్దం ఆమె కష్టంలో పాలుపంచుకున్నట్లు ఆ విద్యుత శ్రుతికల్పింది.

ఎంకి శరీరం స్వాధీనం తప్పింది. పాదాలు గతితప్పి పడుతున్నాయి. నేత్రాలు ఘోరంగా తెరచుకొని ఇరువురు దారుల్ని చూస్తున్నాయి. ఎంకి వడకలో ఆ ముగ్గురు కన్నీటి

చుక్కలు తన ఆర్తను ప్రదర్శిస్తున్నాయి. కడగు మనం కూర్చున్న బండ మీదనే ఉంచుకొని దానివైపే చూస్తూ పూర్వస్మృతులు నెమరువేసుకుంటూ ఉండేది.

కొద్దిరోజులకు ఎంకి నాన్న, తమ్ముడు, సుబ్బడు ఆమెను కలుసుకున్నారు. ఇంటికి రమ్మని ప్రతిమలాడారు. సుబ్బడు ఎంకి కాళ్లు పట్టుకొని బంగపోయినాడు. కాని ఎంకి వారి మాటలు వినిపించుకోలేదు. కడకు ప్రేమతో తెచ్చిన అన్నం కూడా ముట్టలేదు. దాన్నంతా పిచ్చిదానిలా విరజిమ్మేసింది. రాత్రిగా మాట్లాడేది. "బావా. బావా." అంటూ కేకలేసేది. కొండుగాడి శిథిల కపాలాన్ని హృదయానికి హత్తుకొని ఘోరున వాపోయేది. ఎంకి వైఖరికి వారు విసుపోయారు. ఆమెను ఇంటికి తీసుకెళ్ళేందుకు తమ శక్తినంతా వినియోగించారు. ఆమెను ఒప్పించలేక విఫలులయినారు. ఎంకిని ఒంటరిగా వదలి తిరోగమించినారు.

ఎంకి కొద్దిరోజులకే నీరసించిపోయింది. ఆమె శారీరకంగా కూడా చిక్కి శల్యమయింది. పైగా కొండజ్వరం ఆమెను ఆవహించి పీడించసారంభించింది. ఆనాటి కానాటికి ఆమె గొంతు నిరంతరం ఏడ్పుటంతో జీరపోయింది. మెల్లగా హీనస్వరంతో "బావా బావా" అంటూ కలవరించేది. శ్రాంతిలేని ఆమె కంఠం చిగురుటాకులా వణికేది.

ఆనాటి రాత్రి ఎంత కాలమయి ఉంటుందో చెప్పలేము. ఆకాశంలో తాండవం చేసుకున్న మేఘపుంజాల పరుగులు. విపరీతంగా హోరుమని వీచే ఈదరగాలి. అడవంతా నిశ్శబ్దం తాండవం చేస్తూంది. మేఘాల సంఘర్షణలో ఉద్భవించిన తళుకు—తళుకు మెరుపులు, భీకర ఉరుములు, కుండపోతలాంటి వర్షపుధారలు, సెలయేళ్లు ఆకాశగాన్ని మించి పయనిస్తున్నాయి. జలపాతం గంతులువేసి దుముకుతూంది. ఆప్రాంతమంతా [illegible] [illegible] ఒక భయంకర పరిస్థితి. [illegible] పిడుగు [illegible] [illegible]. ఆ బండమీద మృత్యువుతో పోరుసల్పుతూన్న ఎంకి. అమాంతంగా బరువైన కొమ్మ ఆమెమీదనే పడింది. ఆ అందాలపాలవెల్లి, ముగ్ధాలకల్పవల్లి, రూపానకనకవల్లి, అమాయకురాలైన ఆ పల్లెపడుచు ప్రకృతి ప్రాణం పారిపోయింది.

'బావా. బావా' అనే అస్పష్టధ్వని ఈనాటికీ విన్పిస్తూ జలపాతం వింతస్వనంతో మిళితమై ఆ సెలయేటిలో సాగిపోతూంటుంది"



# హనుమంతుడి మందహాసుడి

పింగళి దుర్గ

శంకర్

పధ్నాలుగేళ్ళు అరణ్యవాసం చేసి రాములవారు సీతాలక్ష్మణ సమేతంగా అయోధ్య చేరుకున్నారు. ఆయన రాకకై ఎదురు చూస్తున్న తమ్ముళ్ళు, మంత్రులు ప్రజలు–కలిసి రామచంద్రుడికి హృదయ పూర్వక స్వాగతం పలికేరు.

ఆడది కాబట్టి–కొడుకు మీద వాత్సల్యం కొద్దీ–కైకేయి వెలితిపడి రాములవారి అరణ్యవాసం భరత పట్టాభిషేకం కోరిందిగాని నిజానికి భరతుడుమాత్రము ఈ పధ్నాలుగు సంవత్సరాలు సింహాసనం తాకలేదు. కనీసం రాజధానిలోనైనా లేడు. రామచంద్రుడి పాదుకలు ఉంచి తనుమట్టుకు తాతగారి ఊరు నందిగ్రామంలో వుండిపోయాడు

అందువలన రాజ్యంలో ఇష్టా రాజ్యం భగతుం' పట్టం అన్న మాట సామెత అయిపోయింది.

రామచంద్రుని రాకతో భరతుని ఆనందమునకు అంతులేదు. మంచి ముహూర్తము చూశారు. మహాఋషులు వేదపఠనంతో రామచంద్రుడిని సింహాసనం అధిష్ఠింప జేశారు

ఆంజనేయులవారికి ఈ ఉత్సవం అంతా నేత్రపర్వంగా వున్నది. ఆ రామచంద్రుడు సింహాసనం ఎక్కినా మంత్రులతో సంప్రదించినా, తమ్ముళ్లను చేరబిలచినా–హనుమంతుడు ఆయనవంకే అర్థనిమీలిత నేత్రుడై భక్తిపారవశ్యాన చూస్తూ కూర్చున్నాడు.




ఆయనకు రాముడు తప్ప ఇంకో మనిషి కాని వస్తువు కాని కనబడుట లేదు.

ఇంతలో ఒక చిత్రం జరిగింది. తమ్ముళ్ళెవరో ఆవులించారని రాములవారు చిటిక వేశారు.

అలా ఎందుకు వేశారో హనుమంతుడికి అర్థము కాలేదు. తనూ ఒకసారి చిటిక వేసి చూసుకున్నాడు. మోత చాలా బాగానే ఉంది. గాని అందులో ప్రత్యేకత ఏమీ కనపడలేదు. మాటి

గా రాములవారు చిటిక ఎందుకు వేశారా యని యోచన చేశాడు. అనుమానం తీర్చుకుంటేగాని నిద్ర పట్టదు ఎవరికయినా. అందులో హనుమంతుని సంగతి వేరే చెప్పాలా.

రామచంద్రుడు కొంచెం ఏకాంతంగా ఉన్నప్పుడు చేతులు కట్టుకుని అతిభక్తితో ఆయన ఎదుటకు వెళ్ళి నిలబడ్డాడు. రాములవారు తన భక్తుని వంక ఏమిటి అన్నట్లు చూశారు

స్వామీ నా దొక్క మనవి అన్నాడు సవినయంగా రాములవారు సన్నగా నవ్వి ఏమిటి ఆంజనేయా అని అడిగారు. ఇందాక మీరు సభలో మీ సోదరులు ఆవులించినప్పుడు చిటిక వేశారు అందులో ఏదో ప్రత్యేకత లేనిదే మీరు ఆ పని చేయరు. ఆ విషయము నాకు కూడ తెలుసుకోవాలని కుతూహలముగా యున్నది స్వామీ అన్నాడు

రాములవారు పకా పకా నవ్వి ఆరిని ఇదా నీ అనుమానం. ఎవరయినా ఆవులించినప్పుడు ప్రక్కన ఉన్నవారు చిటిక వేయకపోతే ఆవులించినవారికి ఆయుక్షీణం అని పెద్దలంటారు, సరా అన్నారు.

ఆ మాటలు హనుమంతుని మనస్సులో నాటుకుపోయాయి.

పదునాలుగు సంవత్సరాలు అరణ్యవాసం అందులోనూ అతి కష్టమయిన వియోగము అనుభవించారు సీతారాములు. అందువల్ల కౌసల్యా, సుమిత్ర, కైకేయి ఇంకా అంతఃపుర పరిచారికలు కలసి శ్రీరామచంద్రుని శయనమందిరాన్ని చక్కగా అలంకరించి సీతమ్మను రకరకాల పూలతో బంగారు జలతారు చీనువారాల సొమ్ముతో ఆమెను అలంకరించారు.

పూర్ణచంద్రుడు చక్కని వెన్నెలతో ప్రకాశించుచుండగా సీతమ్మను సిగ్గుతో శయన మందిరము చేరింది. ఆమె రాకను శ్రీరామచంద్రుడు గమనించి పెల్లుబికే గాఢ అనురాగంతో "సీతా!" అంటూ దగ్గరకు తీసుకోబోయాడు.

కాని ఆమె మాత్రము ఆయన ప్రయత్నాన్ని వారిస్తూ "ష్!" అని ఒక మూలవైపుకి చేయి చూపించింది.

రాములవారు అటు చూచి ఆశ్చర్యపోయారు.

ఆంజనేయుడు ఒకమూల కూర్చుని రామనామం జపిస్తున్నాడు.

నాయనా ఆంజనేయా నామస్మరణలో పడి ఇంకా ఈ గదిలోనే ఉండిపోయావు! అన్నారు రాములవారు-నువ్వు వెళ్లాలిసుమా అన్న అర్థం ధ్వనింపజేస్తూ.

కాని ఆయన చెదరలేదు. పైగా అవును స్వామీ ఉండిపోయాను, అన్నాడు.

రామునికి కొంచెం విసుగు వేసింది. ఉదయం కాగానే మళ్ళీ నా సాన్నిధ్యంలో వుందువుగాని ఇప్పటికి వెళ్ళు ఆంజనేయా అన్నాడు.

వల్లకాదు స్వామీ నేనీ గది దాటి క్షణం కూడ బయటికి వెళ్ళను అని ఏ మాత్రము జంకకుండా చెప్పేశాడు రాములవారికి కొంచెం కోపము వచ్చింది.

అయినా ఆపుకుని ఈ గదిలో ఇద్దరు తప్ప మూడవ మనిషి వుండకూడదు ఆంజనేయా అన్నారు. ఇప్పటికయినా గ్రహిస్తాడని.

## గాలిబుడగలు

అలపర్తి వెంకట సుబ్బారావు

గాలిబుడగలు యెక్కి నేనూ
నీలిమబ్బుల ఊగుపోతా
ఉబుసుపోకకు ఒక్కసారా
ఊరుచుట్టూ తిరిగి చూస్తా!!

చిక్కగా చీకట్లు ముసరగ
చుక్కలక్కల యిండ్ల కెడతా
మంచి చెడ్డా మాటలాడీ
సంచిలోపలి తాయమిస్తా!!

చందమామతో జతగ కూర్చుని
విందుభోజన మారగిస్తా!
అలుపు లేకా పరుగులో 'కుం
జేలు'తో నే పందెమేస్తా!

మాలుపడితే అవ్వదగ్గర
కాలువా ఒక టడిగి తెస్తా!
వెన్నెలించుక లాగు జేబులో
వేసుకొని మనవూరు వస్తా!!

ఆ మాటకు ఆంజనేయుడు కొంచెమైన పతుక్కోకుండా అయితే మరీ మంచిది స్వామీ సీతమ్మ తల్లిని బయటకు వెళ్ళమనండి. మన మిద్దరము హాయిగా ఈగదిలో వుందాము అన్నాడు.

రామచంద్రుడికి ఇక కోపము ఆగలేదు.

వెంటనే సీతమ్మ గ్రహించి రామచంద్రుని కోపమును శాంతింపజేసి, హనుమంతునితో కారణమేమిటి నాయనా" అని అడిగింది.

రామచంద్రుని రక్షించటం నా కర్తవ్యం తల్లి అన్నాడాయన.

ఆమె చిన్నగా నవ్వి ఇపుడు ఆయనకొచ్చిన ప్రమాదం ఏమున్నది"

అదికాదు తల్లి ఆవలించినపుడు

# హనుమంతుడి హడావుడి

చిటిక వేయకపోతే ఆయుర్దాయం తగ్గిపోతుంది కదా. రామచంద్రుడు రాత్రివేళ అవులించి, ఆ వేళకి నేను లేకపోతే ఏమిటి నాకు దిక్కు?

ఆయన అమాయకమయిన నందేహానికి రాములవారికి కోపమంతా పోయి చాల జాలివేసింది. ఫరవా లేదు. ఆంజనేయా నేనావలించను లే! అన్నారాయన.

మన్నించండి ప్రభూ ఆవలించటం ఎవరికయినా సహజం కనుక నా యందు దయవుంచి నన్ను వెళ్ళమనకండి అన్నాడు.

రాములవారికి ఏ విధముగా చెప్పాలో తోచక కాసేపు యోచన చేసి సరే ఆంజనేయా నాకు చాల దాహం వేస్తోంది. దాహం తీరుటకు గంగానది నీరు కావాలయ్యా అన్నారు. కొంచెంసేపయినా ఈ పీడ వదులుతుందని.

కాని ఆయన మాత్రము సామాన్యుడా అల్లాగె స్వామీ చెంబు యీయండి అన్నాడు.

రాములవారు సంతోషంగా చెంబు ఇచ్చారు. హనుమంతుడు అనుగుదూరం కూడ కదలక చెంబును తోకచివ్వర ముడివేసి తోకను బ్రహ్మాండంగా గంగానది వరకు పెంచి చెంబునిండా నీరు తెచ్చాడు.

రాముడు, సీత ఈదృశ్యాన్ని చూస్తు కొయ్యబారి పోయినారు. రామచంద్రుడికి నిస్పృహతో కూడిన కోపం కలిగింది. ఆంజనేయా నీ మొండితనము నా కర్థము కావటం లేదు. అయితే ఒక్కమాట నీవు. ఆవులించమన్నప్పుడే ఆవులిస్తాను సరేనా అన్నారు.

"ఏమిటీ!" అన్నాడు.

నువ్వు బయట కూర్చుని ఎప్పుడు చిటికవేస్తే నేను అప్పుడే ఆవులిస్తాను తెలిసిందా.

అప్పటికి ఆంజనేయునికి సంతృప్తి కలిగింది. ఇద్దరికీ నమస్కరించి గది బయటికి వెళ్ళి మళ్ళీ దూరము వెళ్ళితే చిటిక వినపడదని ఎవ్వరికి కనపడకుండా చిన్నరూపముతో తలుపు వెనక జపం చేసుకుంటూ కూర్చున్నాడు.

సీతా రాములు ప్రియసంభాషణలో ఈ విషయమే పూర్తిగామరచి ఆనందంగా వున్నారు.

బయట కూర్చున్న హనుమంతుడు ఎలా వుంటుందో చూదామని ఒకసారి చిటిక వేశాడు.

లోపల రామచంద్రుడు ఆవలించాడు. కాని ఆంజనేయునికి ఆ చిటిక శబ్దము చిత్రముగా అందంగా వినపడింది. ఎడమచేతితో ఎట్లా వుండునో చూద్దామని వేశాడు. ఇంకా బాగుంది.

యువకుడు - నిన్ను ఎంతగానో ప్రేమిస్తున్నాను. నన్ను పెళ్ళి చేసుకోవూ?

యువతి - నీ జీతం ఎంత?

యువకుడు - ఎనభై ఆరు రూపాయలు.

యువతి - మరి, అది నా చిరుతిండికేనా సరిపోదే!

యువకుడు - అయితే నీ పళ్ళు ఊడిపోయేవరకూ వేచి ఉంటాలే!

—మండల గోవర్ధనరావు (విశాఖపట్టణం)

మళ్ళీ కుడిచేత్తో వేశాడు. ఇది మరీ బాగున్నది. మళ్ళా వేశాడు. మళ్ళీ మళ్ళీ ఆ మళ్ళీకి అంతే లేదు. నోటితో రామనామం చేతులతో చిటికెల నామంతో హనుమంతుడు వొళ్ళు తెలియని తన్మయత్వంలో వున్నాడు. లోపల రాములవారి అవస్థ వర్ణనాతీతం. ఆనందముగా గడపవలసినరాత్రి ఈ చిటికలేమిటి ఈ ఆవలింతలేమిటి అని లోపల బాధ పడుతూ నోరు తెరుచుకుని కూర్చున్నాడు. సీతమ్మకు ఇది ఏమియు అంతుపట్టలేదు. మొదట ఆవులింతలు శరీర బడలికవల్లనేమో అనుకుంది. కాని అలాగె నోరు తెరచుకుని కూర్చోవటంతో ఖంగారుపడి ఏమండీ అదేమిటండీ అని పిలుస్తే-మాట్లాడడే.

చూపువున్నది గాని నోరు మూయక పోవటంతో అంతటి మహా తల్లీ ఖంగారు పడిపోయింది.

కంటనీరు పెట్టుకుని తలుపులు తీసుకుని వారా "వీరా" అని దాసీలను పిలిచింది.

క్షణాలమీద అంతఃపురం వారంతా గదిలో పోగయిపోయారు.

రాములవారు మట్టుకు ఏం చేస్తారు. జరిగేదంతా చూస్తున్నాడు. ఆయనకూ మనస్సులో చాల బాధగానె ఉన్నది. ఆయన ఆడితప్పే రకం కాదు.

ఒకమాట ఒకబాణం ఒకపత్ని నియమం కలవాడు నోటితో చెప్పలేక చేతితో ఫరవాలేదు. ఆగండి అని సంజ్ఞ చేశాడు.

కాని ఆడవాళ్ళంతా ఒకటే గోల. సీతమ్మతల్లి సరేసరి గోలెత్తిపోతోంది. ఇక ప్రజలందరు రాములవారికి విచిత్రమయిన రోగంవచ్చింది. ఆయన ఇంకా బ్రతికే వరకూ నమ్మ

కము లేదని చెప్పకుంటున్నారు ఇక ఆలోచించిన లాభం లేదని హుటాహుటీన వాల్మీకి మహర్షి దగ్గరకు పోయి విషయము తెలియపర్చారు. వాల్మీకి ఈ విషయము వినగానే చాల ఆశ్చర్యపోయాడు.

రామచంద్రుని గురించిన కథ ఇంకా ముందు చాలవున్నదే! వైదేహిని అడవులకు పంపాలి ఇంకా లవ, కుశులు పుట్టాలి తండ్రి, కొడుకులకు యుద్ధం జరగాలి ఇంత కథ ముందు వుంటే రాములవారికి అంతమేమిటని.

ఖబురు తెచ్చిన వారిని నేను త్వరలో వస్తున్నాను. మీరు వెళ్ళండి అని చెప్పి మహర్షి వెంటనే దివ్య దృష్టితో చూసి విషయాన్ని తెలుసుకుని తనలో తానే నవ్వుకుని ఆలస్యం చేసి రాములవారికింకెక్కువ బాధ ఎక్కువౌతుందని వెంటనే బయలుదేరినాడు. వాల్మీకి నేరుగా వచ్చి గదిబయట ఎవ్వరికీ కనబడని సూక్ష్మరూపములో మూలకూర్చున్న హనుమంతుని దగ్గరకు వచ్చాడు



చిత్రకారుడు:—శ్రీ య. వ ప్రసన్నరావు (అనకాపల్లి)

హనుమంతుడు రామనామానికి చిటికెలతో తాళం వేస్తూ వొళ్ళు తెలియని తన్మయత్వంలో వున్నాడు.

వాల్మీకి ఆయన భుజం తట్టి "ఆంజనేయా నిన్ను రాముడు పిలుస్తున్నాడయ్యా" అన్నాడు.

వెంటనే ఆయన చిటికెలు మాని నా రామచంద్రుడు ఎక్కడ వున్నాడు ప్రభూ అంటూ దభాలున లేచి నిలబడ్డాడు.

లోపల రాములవారు "అమ్మయ్య" అంటూ మామూలు స్థితికి వచ్చి "జానకీ ఇందాక హనుమంతుడికి నేనిచ్చిన మాట విని కూడ ఇంత హడావుడి చేసేశావేం" అనడిగారు నవ్వుతూ సీతమ్మను.

ఆవిడకూడ ఆ విషయం మరిచి పోయినందుకు చాల సిగ్గుపడ్డది.

వచ్చిన వారందరికీ జరిగినదంతా సవిస్తరంగా వివరించి చెప్పి అందరి చేత నవ్వింపచేశారు. ఆంజనేయా నీవలన రామచంద్రమూర్తి ఎంత బాధపడ్డాడో చూశావా నాయనా అన్నారు వాల్మీకి.

హనుమంతుడు కూడ సిగ్గుపడి పోయి "క్షమించండి ప్రభూ నా మూఢభక్తితో మిమ్మల్ని కష్టపెట్టాను." అంటూ రాముని కాళ్ల మీద పడబోయాడు వాత్సల్యంతో ఆ మున్ని దగ్గరకు తీసుకున్నాడు శ్రీరాముడు. ★

---

ఒకరోజున నలుగురు స్నేహితులు కాఫీహోటలుకు వెళ్ళి ఫలహారము చేస్తున్నారు అందులో ఒకడు నేనిది చేయగలను, అది చేయగలను అని కోతలు కోస్తున్నాడు. ఆఖరికి విసుగెత్తి మిగిలిన వాళ్ళలో ఒకడు "బాబూ, నమ్మలేకుండా చంపక నువ్వు ఏం చెయ్యలేవో అది కాస్త చెపుదూ?" అన్నాడు.

"ఈ ఫలహారానికి బిల్లు ఇవ్వలేను" అన్నాడు కోతలరాయుడు.

—జి. ఎల్. ప్రసాద్ (హైదరాబాదు)

# తీర్పు

నాగుబోయిన ఆంజనేయులు

ఒక న్యాయాధికారి ఎదుట యిద్దరు వ్యక్తులు నిలబడివున్నారు వారిలో ఒకరు రైతు రెండవవాడు దర్జీ ఆ న్యాయాధికారి పేరు "శాంకో పాంజ" అతడు ఆ నగరానికి గవర్నరు కూడాను దర్జీ మీద తాను ఫిర్యాదు చేస్తున్నట్లు రైతు న్యాయాధీశునికి నివేదించాడు

"ఏమిటి నీ ఫిర్యాదు" అని న్యాయాధికారి ప్రశ్నించాడు.

"ఆ నిలబడ్డ వ్యక్తి దర్జీ కొన్ని రోజుల క్రితం నాకొక టోపీని తయారు చేసి యిమ్మని యితణ్ణి కోరాను అందుకు కావలసిన క్రొత్తగుడ్డను కూడా అతనికిచ్చాను కాని యిప్పుడితడు దాన్ని పనికిరాకుండా పాడు చేశాడు" అని తన ఫిర్యాదు వ్యక్తం చేశాడు రైతు.

"ఏమిటి? ఇది నిజమేనా?" నీవు రైతువద్దనుండి క్రొత్తగుడ్డను తీసికొన్నావా?" దర్జీని ప్రశ్నించాడు న్యాయాధికారి.

"ఔను ప్రభూ! నిజం. రైతు, నాకు టోపీ కుట్టమని క్రొత్తగుడ్డ యిచ్చిన మాట వాస్తవమే! కొన్నిరోజుల క్రిందట అతడు నాషాపుకువచ్చాడు ఒక క్రొత్తగుడ్డ తెచ్చాడు. దానితో తనకొక టోపీ కుట్టమని కోరాడు. సరేనన్నాను. దాన్ని నాకిచ్చాడు. కొన్నిగజాల దూరంపోయి మళ్ళీ తిరిగివచ్చాడు. రెండు టోపీలు కుట్టమన్నాడు. వెళ్ళాడు. తిరిగివచ్చాడు. మూడుటోపీలు కావాలన్నాడు."

"ఇదంతా నిజమేనా?" అన్నాడు న్యాయాధిపతి.

"చిత్తం. అక్షరాలా నిజం. అతడంతటితో ఆగలేదు. కాసేపటి తర్వాత మళ్ళీ తిరిగి దయచేశాడు నాలుగు టోపీలు కావాలని చెప్పాడు. ఎట్లాగైతేనేం చివరికి ఐదుమాత్రం చాలునని కోరాడు. అతని కోరిక ప్రకారం అతడిచ్చిన గుడ్డతో ఐదు టోపీలు తయారుచేశాను" అని చెప్పి విషయాన్ని వ్యక్తంచేశాడు దర్జీ

"ఐతే టోపీలేవ"ని ప్రశ్నించాడు జడ్జీ.

దర్జీ తన కుడిచేతిని పైకెత్తాడు.

"ఇవిగో ప్రభూ! నా ఐదువేళ్ళకి వాటిని తగిలించాను రైతుయిచ్చిన గుడ్డనుంచి నేను కాస్తయినా దొంగిలించలేదని ప్రమాణంచేసి చెబుతున్నాను" అని చెప్పాడు దర్జీ.

అతని కుడిచేతి వ్రేళ్లకి తగిలించిన బుల్లిటోపీలను జూచి సభికులంతా గలగలా నవ్వారు.

నవ్వులు సద్దుమణిగినాక రైతు అందుకున్నాడు. "చూడండి ప్రభూ! నా గుడ్డ నిరుపయోగం చేశాడు. అతడు ఐదింటిని తయారుచేయడానికి అంగీకరించినప్పుడు, ఐదింటికీ గుడ్డ సరిపోతుందని నేననుకున్నాను ఇప్పుడుచూస్తే యివన్నీ బొమ్మ టోపీలు. మనుషులకు పనికివచ్చేవి కావు. నా గుడ్డను నాకు తిరిగి యిప్పించండి ప్రభూ. కాకుంటే దాని ఖరీదైనా దయచేయించండి"

"ఆగుడ్డనుంచి ఐదు టోపీలు కావాలని నీవుకోరినమాట నిజమేనా" రైతునడిగాడు న్యాయాధికారి.

"చిత్తం ప్రభూ!"

"దర్జీ గుడ్డనేమైనా దొంగిలించినాడని నీవు అనుమానిస్తున్నావా?"

"లేదు ప్రభూ!"

"ఐతే నాతీర్పు వినండి. రైతు ఆశబోతు గనుక తనగుడ్డను వదులుకొని పోవాలి. తెలివి తక్కువతనాన్ని ప్రదర్శిస్తూ, దర్జీ, రైతు తలకు కాకుండా వ్రేళ్ళకు టోపీలు తయారుచేశాడు. గనుక అతడు తనకు రావలసిన కుట్టుకూలి లేకుండా పోవాలి."

తీర్పువిని, న్యాయాధిపతి సముచిత నిర్ణయానికి ప్రజలు ఆశ్చర్యపోయారు. ★

## బంగారు పాప

కోపల్లె శివరావు

శ్రీలతో రాజిల్లు
సీమరా నీ యిల్లు
సూర్యుడుండగ లెమ్ము
సరిదిద్దుకొమ్ము

భరతుడేలిన భూమి
భావి పౌరుడవు
నిలుపుమా నీ దేశ
నీతి గౌరవము!

స్వతంత్ర్యపు రోజులివి!
యత్నించుచునే కార్య
వైఫల్య మనుమాట
వినిపించరాదు!

విజ్ఞాన తేజమ్ము
వెల్లివిరిసేటట్లు-
దేశాన సౌభాగ్య
దీపాలు బెట్టు.

పదునారు వన్నెలా
బంగారు పాపవై
అందరకు ముంగుండి
అందుకో ఘనకీర్తి!!

నీ శక్తి వెల్గించి!
నీరాజనాలిమ్ము!
'భారతాంబకు కీర్తి
హారాలు తెమ్ము!!!

# పేయింగ్ గెస్ట్

(11-వ పేజీ తరువాయి)

"ఎందుకత్తా నీదగ్గర్నే వుంచు" అన్నాను.

"మీ అమ్మ ఇస్తే కాదంటావా. నీదగ్గరే వుంచు. ఏమైనా అవసరం వస్తే నీ దగ్గరికే వస్తాగా, ఇంద" అంటూ చేతిలో పెట్టింది

"దసరా వస్తోందిగా కొత్తబట్టలు కుట్టించుకో మొదటి పండుగ దసరాకు ఏం బహుమాన మిస్తావో" అన్నది అత్తయ్య.

ఆ మాటలే నా మనసులో ప్రతిధ్వనించ సాగాయి. దసరాకు అత్తయ్యకు మంచి బహుమాన మిద్దామనుకున్నాను. అత్తయ్య మాటవరస కన్నమాట లింతసంఘటనకు నాంది అని అప్పటికి తెలియదు.

* * *

దసరాలు నాలుగురోజులున్నాయి. ఎక్కడచూచినా ఆనందం, హడావుడి. ఏ గుమ్మం చూచినా పచ్చని పసుపుమీద రెండు రంగుల కుంకుమబొట్లతో, పచ్చని తోరణాలతో విలసిల్లుతున్నాయి గోపి ఇల్లంతా సందడిచేసేస్తున్నాడు

"అమ్మా నాకు రెండుగొట్టాలగిలక కొని పెట్టు. దాంతో నేను అందరిమీదా బుక్క కొట్టేస్తా కొంటావా అమ్మా కొంటావా" మారాం చేస్తున్నాడు గోపి 'సరే కొంటాలే' అని సముదాయించింది అత్తయ్య.

ఆనాటి సాయంత్రం గోపిచేతుల్లో రెండు గొట్టాలగిలక ఒకటి వుంచాను.

"మిస్టర్ రామారావ్ వాడికి కావలసినవి ఇయ్యడానికి మేమిక్కడున్నాంగా. మీరంతశ్రమ తీసుకోడం అవసరంలేదు" శశి విసిరింది మాటల్ని

"పండుగ సరదాలో శ్రమా గిమా కన్పించవు మిస్ శశీ"

"సరదాలు తీర్చుకోడానికిది స్థలం కాదు. .." అత్తయ్యగాని రాకపోతే ఆ సమయం ఎటువంటి పరిణామాలకు దారితీసేదో ఊహించలేను.

మరునాడు సప్తమి. అష్టమి, మహార్నవమీ, విజయదశమి రోజుల్లో ప్రతియింటా పూజలుచేస్తారు. ఐనా పట్నం కనుక ఆచరణలో ఏమైనా తేడా వుంటుందేమో ననుకున్నాను. కాని బొమ్మలగుకాణాలు, రంగుల రాట్నాలు కొత్తబట్టల దుకాణాలు చూసేసరికి ఇక్కడకూడా ఆచారాలింకా వున్నాయి అనిపించింది

సాయంత్రం బట్టలషాపుకి వెళ్లి మంచి చీరెలు రెండు, గోపికి చొక్కాలాగు, నాకొక జత బట్టలు కొన్నాను. అత్తయ్యకు పట్టుపంచె స్పెషల్ గా కొన్నాను పూజ చేస్తుందన్న ఉద్దేశంతో లక్ష్మీగణేశుల బొమ్మలు మిఠాయిలు కొని అన్నీకలిపి పేక్ చేయించి రిక్షా ఎక్కాను.

రిక్షా యింటిదగ్గర ఆగింది. ఇల్లు నిశ్శబ్దంగా వుంది. గోపి దసరాసరదాలలో వుండి వుంటాడనుకొన్నాను. పేకెట్‌తో సహా ఇంట్లో ప్రవేశించి "అత్తయ్యా" అని కేకవేశాను. అలికిడి లేదు. ఒక్కసారి చూపించి ఆనందపరుద్దామన్న ఉత్సాహంతో అత్తయ్యగది గుమ్మంలో అడుగుపెట్టాను. శశి ఎదురుపడింది.

"ఎందుకు మిస్టర్ అలా కేకవేశారు." ఈ పండుగపూటకూడ మిస్టర్ అని ముభావంగా మాట్లాడడంచూస్తే నాకు ఒళ్లు మండిపోయింది. నేను జవాబివ్వకుండా వుండడం చూసి మరింత దమాయించింది శశి

"మిస్టర్ రామారావ్ ఎందుకిలా వచ్చారు?"

"అత్తయ్యకోసం వచ్చాను. ఏది?"

"ఓహో! అత్తయ్య కోసం వచ్చారా. ఆ పేకెట్ దేనికి. అందులో ఏమున్నాయ్?"

పేకెట్ క్రింద పెడుతూ "నేను అత్తయ్య ఎక్కడవున్నదీ అడిగాను" అన్నాను.

"నే నడుగుతున్నది అందులో ఏమున్నాయని" శశి కఠినంగా ప్రశ్నించింది.

"ఇప్పిచూసిన వారికి తెలుస్తుంది. దీన్ని అత్తయ్యకోసం తెచ్చాను."

"ఓ థాంక్స్ మిస్టర్ రామారావ్. ఈ బహుమానాలకీ మెహర్బానీలకు దాచిపోయిన మొహాలమేం కాదు. తీసుకొనివెళ్లి గదిలో పెట్టుకోండి"

"నే నివి అత్తయ్యకిద్దామని తెచ్చాను."

"ఆ అత్తయ్య బదులుగా నేను సమాధానం ఇస్తున్నాను తీసుకెళ్లండి వాటిని."

"అది మీ సమాధానం మీద చేసే పని మాత్రం కాదు."

"మీరు తీసుకువెళ్తారా లేక ."

"లేక " గద్దించాను. శశి కాలితో పేకెట్‌ని ఒక తన్ను తన్నింది. లోపల వున్న విగ్రహాలు బద్దలయి పోయాయి మిఠాయిలు నేలమీద దొర్లాడాయి. నా హృదయం తూట్లు పడింది.

నెమ్మదిగా క్రిందికివంగి విరిగిపోయిన లక్ష్మీగణేశుల బొమ్మలను తీశాను. చేసిన తప్పు తెలిసి, కోపాన్ని తట్టుకోలేక బాధపడిపోయింది శశి ముఖం. నాలో సహనం పూర్తిగా నశించింది కాని తగిన విధంగా ప్రతీకారం చెయ్యడానికి మెదడు దారి చూపించలేదు బరువుగా మెట్లెక్కి గది తలుపులు వేసుకున్నాను.

పట్నంలో దసరా వేడుకలు చూడాలని వుందనీ ఈ దసరాలకి ఇంటికిరాననీ ఉత్తరం వ్రాసేశాను ఇంటికి పోదామని బుద్ధిపుట్టినా ప్రతీకారం చెయ్యనిదే వెళ్ళకూడదన్న పౌరుషం ఆపివేసింది. కళ్ళు మూసుకుని ఆలోచించాను. ఎలా గడిచాయో గంటలు. తొమ్మిదికి తలుపు తట్టబడింది.

"ఎవరది" నే నడిగాను.

"నేనండీ రాంబాబుగారూ. తలుపు తియ్యండి కంచం తీసుకొచ్చాను" గోపి సమాధాన మిచ్చాడు. అత్తయ్య ఎందుచేత రాలేదో తెలుసుకోవాలనివున్నా అడగలేదు. పడుకునే సమాధానమిచ్చాను.

"నా కాకలి కావటంలేదులే. తీసుకు వెళ్ళిపో."

"పోనీ కొంచెం తినండి" ప్రాధేయపడుతూ అడిగాడు.

"అవసరంలేదు గోపి వెళ్ళిపోయాడు.

అత్తయ్య రాకపోడం నాకు అనుమానం కలిగించింది. బంధు మర్యాద, ఆప్యాయతా ఒకవేపు, కూతురి కఠింపుతనం ఒక వేపూ: ఈ రెంటి మధ్య సతమతమౌతున్న ఆమెను తలుచుకుంటే జాలి వేసింది. ఏమైనా ఈసారి తేల్చి వేయాలి.

మరునాడు మహాష్టమి ఆకలిచేత త్వరగా తెలివి వచ్చింది. రాత్రి ఆలోచనలతో మస్తిష్కం వేడెక్కింది కళ్లెర్రబడ్డాయి. టూత్ బ్రష్ నోట్లో పెట్టుకుని మెట్లు దిగుతుంటే శశి కన్పించింది. ఆమె కళ్ళల్లోని పశ్చాత్తాపం గ్రహించాను. కాని ఆమెలోని పౌరుషం ఆమెను మాటాడనివ్వలేదు. నా నిశ్చయం నన్ను బాత్‌రూమ్‌కు దారి తీయించింది. గదిలోకివచ్చేసరికి గోపి టిఫిన్ ఓవల్టీన్‌లను బల్లమీద వుంచాడు.

"తీసుకువెళ్లు గోపీ నేను వీటి నిప్పుడు తినను."

"ఏమండీ కోపమొచ్చిందా రాంబాబుగారుకి మా అక్క దెబ్బలాడిందా?"

"ఏం లేదులే నువ్వు తీసుకెళ్లు వీటిని."

"మీ రబద్ధమాడుతున్నారండీ. మా అక్క ఎప్పుడూ అంతే" గోపి స్వానుభవమ్మీద నమ్మకంతో చెప్పాడు.

స్నానానికి బాత్ రూమ్‌లో ప్రవేశించాను. ఇంకా వేణ్ణీళ్ళు కాగలేదు

మాష్టారు: ఒరేయ్ గోపీ, బి.ఎ.,బి.ఎల్. అంటే ఏమిట్రా?

గోపి: బొత్తిగా అన్నానికి బట్టకు లేనివాడుసార్.

—తూబాటి ఆంజనేయులు (తుర్లపాడు)

# పేయింగ్ గెస్టు

వన్నీళ్ళోసుకుని బట్టలు వేసుకుని బయలుదేరాను. ఆఫీసుకి సెలవు. హోటల్లో ఆకలి తీర్చుకుని స్నేహితుడింటికి వెళ్ళాను. పదకొండు గంటలకి హోటల్లో భోజనంచేసి సినిమాకుపోయి మూడున్నరకు గదికి చేరా. ఉత్సాహం పూర్తిగా నశించింది. పత్రిక తిరగవేస్తూ కూర్చున్నాను.

శశి నెమ్మదిగా మేడ మెట్లెక్కి వచ్చింది. చేతిలో ఓవల్టిన్ గ్లాసువుంది. గ్లాసు బల్ల మీద ఉంచి వెళ్ళిపోయింది. ఎప్పుడు నిద్ర పట్టిందో కాని లేచేసరికి ఆరు గంటలైంది. ముఖం కడుక్కొని వెళ్ళొస్తుంటే శశి మెట్లుదిగింది. గదిలో టేబుల్ మీద వేడి ఓవల్టిన్ వుంది. ఆమె ప్రవర్తనలోని మార్పు కొంతవరకు సంతోషాన్నిచ్చింది. కాని నమ్మకం ఇంకా కుదరలేదు.

బట్టలు వేసుకుని బయలుదేరా. గుమ్మం దాటకు వస్తుంటే శశి మెట్లెక్కుతోంది. ద్వారం పక్కకు తొలగి నిల్చున్నాను. గ్లాసులోని ఓవల్టిన్ అలానే వుంది. బాధగా నా కళ్ళలోకి చూసింది. జాలి కలిగినా పైకి నిశ్చలత్వాన్ని కనబరిచాను. మాట్లాడకుండా గ్లాసును తీసుకుంది. గదికి తాళంవేసి మెట్లు దిగాను.

గదికి తిరిగి వచ్చేసరికి పది దాటింది. ఒకసారి తట్టగానే తెరుచుకుంది తలుపు. శశి నాకోసం నిరీక్షించిందని చెప్పనక్కర్లేదు. మాటాడకుండా గదిలోకి వెళ్లి తలుపులు వేసుకున్నాను. రెండుసార్లు మేడ మెట్లెక్కిన శబ్దం వినిపించింది. కాని తలుపు చప్పుడు కాలేదు. తన పౌరుషాన్ని వదులుకోలేక బాధ పడుతోంది శశి. పగలు నిద్ర పట్టడం చేత నిద్ర రాలేదు నవల చదువుతూ కూర్చున్నాను. గంటలు గడుస్తున్నాయి. రెండు గంటలరాత్రి. మేడ మెట్లమీద చప్పుడైంది. కిటికీ అవతల రెండు ఎర్రటి కళ్లు కనిపించాయి. అవి నావైపు చూస్తుండగానే కిటికీ తలుపులు వేసేను.

మూడున్నరకు నిద్రపట్టింది. ఏడున్నరకు పనిమనిషి తలుపు తట్టింది. తలుపు తీసి నిద్రపోయాను. ఎనిమిదిన్నరకి గోపి వచ్చి నెమ్మదిగా పిలిచి మెట్లమీదకు వెళ్లి "ఆయన లేవ లేదే అక్కా" అన్నాడు. తొమ్మిదయింది. గోపి మళ్ళీ వచ్చాడు. "రాంబాబుగారూ లేవండీ. ఇవాళ దసరాపూజ చేసుకోవాలని అక్క చెప్పింది. పూజ చేయించే ఆయన వచ్చేవేళయిందట అక్క లెమ్మంటోందండి" ప్రాధేయపడుతూ అన్నాడు. మాటాడకుండా పక్కకు తిరిగి పడుకున్నాను. గోపికి విసుగుపుట్టి వెళ్ళిపోయాడు.

క్రింద పూజకు కావలసిన ఏర్పాట్లు జరుగుతున్న సందడి వినిపిస్తోంది. తొమ్మిదిన్నర దాటింది. మళ్లా గదిలో ప్రవేశించిన అలికిడి...

"రామారావుగారూ" శశి పిలుపు. నాకు ఆశ్చర్యం కలుగలేదు. కాని నేను పలకలేదు.

"మీరండి పూజ చేసుకొని భోజనం చెయ్యాలి. లేచి స్నానం చెయ్యండి."

" . ... "

"పురోహితులుగారు వచ్చే వేళయింది. వేణ్ణీళ్లు తోడించాను. దయచేసి లేచి స్నానంచేసి పూజ చెయ్యండి."

"........ ."

ఒంటిమీద చెయ్యిపడింది. ఆశ్చర్యంతో కళ్లు తెరిచి చూశాను. శశి తడబడుతూ అంది "ఒంట్లో బాగులేదేమో అని. క్షమించండి ...నేను పూజ చేసుకొని భోజనం చెయ్యాలని మీకంటే లేవండి"

శశిలో మార్పు వచ్చిందని దృఢ పరచుకున్నాను. టూత్ బ్రష్ మీద పేస్టువేసి దగ్గరకొచ్చింది.

"కోపం పోలేదా. ఇవాళ శత్రువులుకూడా మిత్రుల్లాగ ఉంటారట. ఊఁ లేవండి" అనుమానిస్తూ చెయ్యి చాపింది. అప్రయత్నంగా నాచేయి సాగింది. లేచి కూర్చున్నాను. 'చెప్పులివిగో." కాళ్ళ దగ్గరే వున్నవాటిని చూపించడంలోని భావం? బ్రష్ నోట్లో పెట్టుకుని మెట్లుదిగాను. చెంబుతో నీళ్లు సిద్ధంగా వున్నాయి. బాత్‌రూమ్‌దగ్గర గోపి నన్ను చూసి నవ్వాడు.

పళ్లుతోముకోడం పూర్తిఅవుతుంటే శశి వచ్చి "మళ్ళీ పైకివెళ్ళడం దేనికి. స్నానం కూడా చేసెయ్యండి కాస్తత్వరగా. నేనన్నీ తీసుకువస్తాను" అంటూ గబగబ మెట్లెక్కింది. ఉత్తి ఆవేశపరురాలు అని నిశ్చయించాను. కాని ఇంకా నమ్మలేదు.

స్నానం చేశాను. శశి తమ ఇంట్లో వున్న పట్టుపంచను గోపి కిచ్చిపంపింది. పూజామందిరంలో నేను కొన్నలాటివే లక్ష్మి గణేశుల బొమ్మలున్నాయి. ఇంకా చిన్న చిన్నవి కృష్ణలీలలు, దుర్గబొమ్మలు చాలా వున్నాయి. కుంకుమలలో దీపాలు వెలుగుతున్నాయి. పురోహితులు పూజాసామగ్రి అంతాసిద్ధం.పూజపూర్తి కాగానే భోజనాలకి సిద్ధంచేసింది శశి.

పళ్ళేలలో మైసూర్‌పాక్, ఒబ్బట్లూ, పులిహోర, సేమ్యా పిండివంటలు గుమ్మని వాసన వేస్తున్నాయి. భోజనం పూర్తిచేసి గదిలోకి వచ్చాను. వెనుకనే గోపి కిళ్లీ అందించాడు. కడుపునిండా భోజనం, ఇంతవరకూ ఎరుగని అభిమానంతో పడేసరికి నిద్ర ముంచుకువచ్చింది. ఐదు గంటలకు మెలకువ వచ్చింది.

బాత్‌రూమ్‌కి వెళుతుంటే గోపి "అక్కా రాంబాబుగారు లేచారే" అని అరిచాడు. తిరిగివచ్చేసరికి శశి ఓవల్టిన్‌తో ప్రత్యక్షం. గ్లాసునందిస్తూ "నిన్నటి శిక్షమాత్రం తిరిగి విధించవద్దు. ప్లీజ్" ప్రాధేయపడింది. గోడమీదనున్న గాంధీమహాత్ముని ఫోటో నవ్వుతోంది. మాటాడకుండా త్రాగాను. బజారునుండి రావడం భోజనం చెయ్యడం అన్నీ సక్రమంగా జరిగాయి. కాని ఇంతవరకూ ఒక్కసారికూడా మాట్లాడలేదు శశితో. అత్తయ్య ఎక్కడకు వెళ్ళినదీ తెలియదు.

* * *

మరునాడు విజయదశమి. శశి మడితో వున్నట్లుంది. గోపి ఓవల్టిన్ తెచ్చాడు. ఇక ఉండబట్టలేక అడిగాను.

"గోపీ మీ అమ్మగారేరి?"

"దగ్గు ఎక్కువగావుందని కె. జి. లో చేర్పించిందండి మా అక్క. ఇవాళ ఇంటికి వస్తుందట మా అమ్మ."

"ఇన్నాళ్ళు ఎందుకు చెప్పలేదు" కోపంగా అడిగాను.

"మీరూ అక్కా దెబ్బలాడుకుని కోపంగా వున్నారని".

"చాల్లే" నవ్వాపుకోలేక పోయాను అంత కోపంలోనూ.

"ఇవాళ పూజ మీరిద్దరు చెయ్యండి. నాకు పనుంది. వీలయితే వస్తాను లేకపోతే లేదు" అనిచెప్పి బయలుదేరాను. శశి గుమ్మం దగ్గరకు వచ్చేసరికి నేను వీధిలో వున్నాను.

పదిగంటలకు నేనూ అత్తయ్యా టాక్సీ నుండి దిగాం గోపి గుమ్మందగ్గర్నుంచే అరిచాడు "అక్కయ్యా అమ్మొచ్చిందే."

ఒకపరుగులో గుమందగ్గరకొచ్చిన శశి నన్ను చూచి ముకుళించుకుపోయింది. అత్తయ్యను లోపలకు తీసుకువెళ్ళి పడుకోబెట్టాం. నెమ్మదిగా శశి "పూజ చేసుకోవాలి.ఆయనను లెండని చెప్పమ్మా" అంది వాళ్లమ్మతో.

"లేబాబూ త్వరగా స్నానంచేసి పూజ చేసుకో" అత్తయ్య చెప్పింది.

స్నానం, పూజ సక్రమంగా జరిగాయి. భోజనాలదగ్గర అత్తయ్య వడ్డించమంటుంటే ఒకటీ ఒకటీ మొహంలోకి చూస్తూ శశి వడ్డించేసింది. శశి నేనుకొన్న బట్టలు అత్తయ్యకు చూపించింది.

"మీ రందరూ తొడుక్కోండి ఒక్కసారి చూస్తాను" అత్తయ్య పలికింది.

తాంబూలంవేసుకు మేడ ఎక్కుతూంటే నేనుకొన్న ఆర్గండీచీర కట్టుకొని, పచ్చని పట్టుజాకెట్టుతో, ఆరబోసుకున్న జుట్టుతో శశి నా గదిలోంచి వస్తోంది. సగం మెట్లదగ్గర ఇద్దరం తారసిల్లాం.

"ఇంత మనసు న్రుయాత లూగించే పేయింగ్గెస్టును మా అమ్మ చేరదీసిందని నేను కలలో కూడ అనుకోలేదు" అని మెట్లుదిగింది.

గదిలో అడుగుపెట్టేసరికి పసుపు పెట్టబడిన క్రొత్తబట్టలు రంగులొలికిస్తూ నవ్వాయి.

త్వరగా వాటిని ధరించి క్రిందకు వెళ్ళి అత్తయ్యకు నమస్కరించాను. నాపక్కనే శశికూడా తలవంచింది. అత్తయ్య మమ్మల్నిద్దర్నీ చూస్తూ గోముగా కళ్ళొత్తుకుంది.






# మధుర విషాద సంగీతం 'చౌధ్వీకా చాంద్'

అనురాగంతో ఆలాపన ప్రారంభమై హృదయస్పందనలయగా గుండెలో నుంచు చినుకులు రాల్చే సంగీతం ఉంటే అది కథగా ఘనీభవిస్తుందని, వాతెరకథగానూ, తెరకథగానూ కూడా రాణిస్తుందనీ చిత్రవేదాంతుల నమ్మకం. గురుదత్ ఫిలింస్ వారి 'చౌద్వీకాచాంద్' అలాటి మధుర విషాద సంగీతం,

ఈ సంగీత కచేరికి దర్శకుడు ఎం. సాదిక్ ప్రముఖ గాయకుడు రెహమాన్ రాగంలో భావం వహీదా రెహమాన్ ప్రక్క వాద్యాలు గురుదత్, జానీవాకర్, మీనాముంతాజ్ వగైరా వగైరా.

లక్నో నగరంలో ఒకనాడు సంత ఒకటి జరుగుతుంది. ఆసంతకు నలుగురితో పాటు నవాబ్ (రెహమాన్) అనే యువకుడు, అతని మిత్రుడు షాయిదా (జానీవాకర్) కూడా వెడతారు. ఆసంతలో నల్లటి బురఖాలో దాగి ఒక్కసారి కనుపించిన చందమామవంటి సుందరవదనం చూసి నవాబ్ ముగ్ధుడౌతాడు. కొంతదూరం ఆ సుందరాంగిని వెంటాడుతాడుగాని ఆమె మళ్ళి నల్లబురఖాలో ముఖం దాచేసుకుంటుంది.

అమరువాడు ఒకసంబరంలో ఆఅమ్మాయి చీరకొంగు దర్వాజాకు తగిలి చిరిగిపోయి చిన్నముక్క మిగిలిపోతుంది. ఆ చీరముక్క ఒక తెలిసిన స్నేహితురాలికిచ్చి నవాబ్ ఆ అమ్మాయి ఆచూకీ, ఊరూ, పేరూ, కనిపెట్టమంటాడు. కాని ముస్లిం ఆచారం ప్రకారం ఆ సంబరంలో కన్యలు ఓణీలు మార్చుకుంటారు. అది స్నేహానికి లాంఛనం. నవాబ్ స్నేహితురాలు వచ్చి తన చేతిలో చీలికతో సరిమాసేసరికి 'బనూ' అనే అమ్మాయి ఆఓణీ ధరించి ఉంటుంది. తన ప్రేయసిపేరు 'బనూ' అనుకుంటాడు నవాబ్.

నవాబ్ తల్లి కోగిష్టిది ఆమెహజ్ యాత్ర చేయలేక తన తరఫున ఒక మౌల్విని పంపాలనుకుంటుంది. కాని వయస్సులో ఉన్న కన్న కూతురును విడచి తాను పోనంటాడు మౌల్వి. నవాబ్ ఆపిల్లను చేసుకుంటే తాను పోతానంటాడు. కాని ఇదివరకే మరొకరికి హృదయం దత్తం చేసిన నవాబ్ ప్రాణమిత్రుడయిన అస్లం (గురుదత్)ను మౌల్వి కూతురును చేసుకోమని తన ప్రేయసితో తనకు వివాహమయ్యేటందుకు సహకరించమని కోరతాడు. ప్రాణానికి ప్రాణమైన మిత్రుడిమాటకు సరేనంటాడు అస్లం. కాని తర్వాత తన ప్రేయసికోసం అన్వేషించి 'బనూ'ను కలుసుకునే ఏర్పాటు చేసుకుంటాడు నవాబ్. కాని విధికృతం 'బనూ' మరోపిల్ల తన ప్రేయసి కాదు!

మళ్ళి కొన్నాళ్ళకు సంతలో తొలినాడు తాను ప్రేమించిన యువతి కనిపిస్తుంది నవాబ్, అస్లంనీ, షాయిదాని వాళ్ళు వెళ్ళిన మసీదులోకి పంపుతాడు. కాని అస్లం జనసమ్మర్దంలో సరిగా గుర్తించలేడు. తరువాత నవాబ్‌తో పాటు వాళ్ళను అనుసరించివెళ్ళి వాళ్ళయిల్లు కనుక్కుంటాడు అస్లం. తీరా చూస్తే అది అస్లం బంధువులయిల్లే. తన బంధువయిన నసీమాను ప్రేమించివుంటాడని ఈ పెళ్ళి తప్పక ఏర్పాటుచేస్తానని మాట యిస్తాడు అస్లం.

ఒకరోజున నవాబ్ అస్లం యింటికి వస్తాడు అక్కడ అనుకోకుండా తన ప్రేయసిని చూస్తాడు. తర్వాత అస్లంతో చెబుతాడు. దీంతో అస్లం గుండెలో పిడుగు పడుతుంది. ఇన్నాళ్ళూ నవాబ్ ప్రేమిస్తున్నది తన భార్య జమీలయా (వహీదా రెహమాన్) నేనని తెలుసు-



గురుదత్ ఫిలింస్ 'చౌధ్వీ కా చాంద్' చిత్రంలో గురుదత్, వహీదా రెహమాన్

ఉంటాడు. భార్యే తనకోరుకునే చేసుకోమంటే తనకి కట్టిపెట్టి విధిచేత దగాపడిన నవాబ్ గాథ అస్లం గుండెలో తీరని బాధగా పర్యవసిస్తుంది. తన మిత్రుడి సుఖంకోసం తనే నాశనం కావాలనుకుంటాడు అస్లం. వ్యథ విస్మరించడంకోసం నాట్యకత్తెల యిళ్ళకు వెళ్ళి రాత్రులు అక్కడే గడపడం ప్రారంభిస్తాడు. ఏ గొడవా తెలీని జమిలియా కుమిలిపోతుంది. భర్త ప్రవర్తనకి బాధపడుతుంది. ఆమె తరఫువారు విడాకులు కోరతారు. అస్లం అందుకు ఒక షరతు పెడతాడు. జమిలియా నవాబ్‌ను చేసుకునే పక్షంలో ఒప్పుకుంటాడు. కాని జమిలియా తనకు ప్రాణమైన అస్లంను విడువలేనంటుంది. విడాకులు వద్దంటుంది.

అస్లం ఈ బాధతో నవాబ్‌కి కనిపించడం లేదు.

నవాబ్‌కు తాను ప్రేమించిన స్త్రీ అస్లం భార్య అని తెలియదు. కాని ఆమెతో వివాహం సాధ్యంకాదని నసీమాను వివాహం చేసుకోబోతాడు. ఆరోజుకూడా మిత్రుడు అస్లం కనిపించక పోయేసరికి నవాబ్ అస్లం యింటికివస్తాడు.

తన ప్రేయసి అస్లం భార్యా అని తెలుసుకుంటాడు. ఒక్కసారి ఒళ్లు ఝల్లుమంటుంది. పైగా అస్లం నవాబ్‌ను గురించి ఎంతగానో భార్యకు చెబుతూ వుంటాడు. నవాబ్ హృదయం పగిలిపోతుంది. తనమిత్రుడికి యింతద్రోహంచేసి బ్రతకడం అసాధ్యం అనే ఆవేశంతో ఆత్మహత్య చేసుకుంటాడు.

ముస్లిం సాంప్రదాయం ప్రకారం హృదయంగమమైన ఈ కథను అతి సమర్థంగా నిర్మించారు నిర్మాత గురుదత్, దర్శకుడు ఎం. సాదిక్.

ఇటీవల హిందీ తెరపైకి అనువదించిన 'నజ్రానా' (ముస్లిం కథ)కి "చౌధ్వీ కా చాంద్"కి పోలికలు చాలా ఉన్నాయి. ముస్లింల 'పర్దా' సంప్రదాయంపై చిన్న విమర్శ ఆ చిత్రంలో ఉంది. అందులో నాయకుడు చివరికి ఆత్మహత్య చేసుకోడు. ఇందులో చేసుకుంటాడు.

నటనలో మొదటిస్థానం నవాబ్‌గా రెహమాన్ అందుకున్నారు. అఖిలభారత తారాపథంలో విజయ(వాడ) తార వహీదా తన స్థానాన్ని మరోమారు నిరూపించుకుంది.

రవి సంగీతం ఎంతో బాగుంది. కాని, ముఖ్యంగా ఘజల్, కవాలి గీతాలు చాలా బాగున్నాయి. ఒక విరహగీతం అచ్చు 'అనార్కలీ' లోపాటకు కాపీ పెట్టినట్లు, ఛాయాగ్రహణంచాలా బాగున్నాయి.

ఉన్నకథను తెరకు అనువదించడంలో చక్కని డ్రామా సృష్టించాడు దర్శకుడు ఎం. సాదిక్. హృదయం కదిలించే ఈ కథను సమర్పించిన గురుదత్ ఫిలింస్, అభినందనీయులు. ఇది ఘనీభవించి హృదయం కరగించే మధురవిషాద సంగీతం ★



హైదరాబాద్ మూవీస్‌వారి 'జల్సారాయుడు'లో అభినేత్రి జమున.

# వార్తాభరణం

## మద్రాసు

సుభోదయ ప్రొడక్షన్స్‌వారి 'భక్త శబరి' పౌరాణిక చిత్రం ఆంధ్రలో జులై 15న విడుదల అయింది. ఇందులో పండరీబాయి, హరనాథ్, నాగయ్య, రామకృష్ణ, రాజశ్రీ, శోభన్ నటించారు. నిర్మాత బి. ఆర్. నాయుడు సంగీతం పెండ్యాల దర్శకత్వం చిత్రపు నారాయణమూర్తి.

* * *

కృష్ణచిత్రవారి 'బావ మరదళ్ళు' పద్మనాభం దర్శకత్వంలో పూర్తి అయింది. విడుదలకు నిరీక్షిస్తున్న ఈ చిత్రంలో రమణమూర్తి, కృష్ణకుమారి, మాలిని ప్రధాన భూమికలు వహిస్తున్నారు.

## హైదరాబాద్

'మాయింటి మహాలక్ష్మి' నిర్మాత గంగాధరరావు హైదరాబాద్ మూవీస్ పేరిట నిర్మిస్తూన్న 'జల్సారాయుడు' చిత్రం తాపీ చాణక్య దర్శకత్వంలో త్వరితగతిని తయారవుతున్నది. హిందీలో బాక్సాఫీస్ విజయం సాధించిన 'జాల్‌సాజ్' చిత్రానికి ఇది అనుసరణ. కిశోర్‌కుమార్, మాలాసిన్హాలు నటించిన పాత్రలు జగ్గయ్య, జమున నిర్వహిస్తున్నారు. ఈ చిత్ర నిర్మాణం సాగుతున్న సారధీ స్టూడియోస్ (హైదరాబాదు) లోనే 'ఏక్ హీ రస్తా' తెలుగు తమిళ భాషలలో తయారవుతూంది. సారధీవారి ఈ చిత్రంలో డెయిజీ ఇరానీకూడా నటిస్తూంది.

# వార్తాభరణం

సెప్టెంబరులో ఈ చిత్రం విడుదల కాగలదని వార్త.

కాగా సారథీవారు మరో చిత్రంకూడా ప్రారంభిస్తున్నారు.

* * *

తాను నిర్మిస్తున్న నూతన చిత్రంలో కొన్ని దృశ్యాలు చిత్రీకరించడానికి నిర్మాత-నటుడు సొహరాబ్ మోడీ ఇటీవల హైదరాబాదు వచ్చారు. హుస్సేన్‌సాగర్ సమీపంలో ఆయన బృందం కొన్ని ఔట్ డోర్ దృశ్యాలు 'షూట్' చేశారు.

* * *

## బొంబాయి

జలరుహావారి 'రాజనందిని' హిందీలోకి అదేపేరుతో 'డబ్' చేశారు. త్వరలో ఉత్తరాదిని విడుదల అవుతుంది.

* * *

లక్షలు ఖర్చుపెట్టి బ్రహ్మాండమైన సెట్టింగులతో నిర్మిస్తూన్న 'మొఘల్-ఇ-అజామ్' విడుదలకు ప్రేక్షకలోకం ఎదురుచూస్తూంది. దీనితోపాటు దిలీప్‌కుమార్ టెక్నికలర్‌లో నిర్మిస్తున్న "గంగా జమునా", రాజకపూర్ నిర్మిస్తున్న "జిస్ దేశ్ మే గంగా బహతీ హై", ఎస్. ముఖర్జీ (లవ్ ఇన్ సిమ్లా) తీస్తున్న "హం హిందుస్తానీ" కూడా ఈ ఏడాదిలోగా విడుదలకానున్నాయి.

* * *

రాజకపూర్ నిర్మాణం "జిస్ దేశ్ మే గంగా బహతీ హై" సుందర ప్రకృతి దృశ్యాలతో, గుండె కరిగించే కథతో, మధుర సంగీతంతో నిండిన అపూర్వ నిర్మాణమని రషెస్, చూసినవారు చెబుతున్నారు.

* * *

ఎస్. ముఖర్జీ 'హం హిందుస్తానీ' లో బొంబాయినగర జీవితాన్ని కళ్ళకు కట్టినట్టు చూపేందుకు కృషి చేస్తున్నారు. సునీల్ దత్, ఆశాపరేఖ్ జాయ్ ముఖర్జీ ఇందులో నటిస్తున్నారు. ఉషాఖన్నా సంగీతం దీనికి ఒక ఆకర్షణ.

* * *

అశోక్ కుమార్ నిర్మిస్తున్న, పద్మిని నటిస్తున్న 'కల్పన' ఒక నర్తకి కన్నకూతురు గాథ. కాశ్మీర్‌లోని నిషాత్, షాలిమార్ సుందరవనాలలో ఔట్ డోర్ దృశ్యాలు తీశారు.

ఈ చిత్రంలో ఓ. పి. నయ్యర్ కట్టిన బాణీలు అపూర్వమైనవని, మరపురానివనీ తెలుస్తోంది. చిత్రం సెన్సార్ అయింది.

# "ఐ వాన్ట్ టు లివ్"

నైట్ క్లబ్బులలో తిరుగుతూ, జూదం, తిరుగుడు వీటితో పొట్టపోసుకుంటూ రాత్రిచరుల వర్గానికి సన్నిహిత అయిన ఒకానొక స్త్రీ—న్యాయశాస్త్రానికి విరోధి అయి పరాజితఅయిన గాథ అతి వాస్తవంగా, వేగంగా యూనైటెడ్ ఆర్టిస్ట్సువారు 'ఐ వాన్ట్ టు లివ్' అనే చిత్రంగా నిర్మించారు.

ఈ చిత్రం చూస్తున్నంతసేపూ ఒక జీవితం దాదాపు తిలకిస్తున్నట్లు ఉంటుంది. ఇందుకు కారణం సహానుభూతి కావచ్చు. అందుకు కారణమైన దర్శక ప్రతిభ కావచ్చు. అసలు ఇది కట్టుకథ కాదని, జీవితమనీ ముందే దర్శకనిర్మాత మనకు 'అక్షరాలా' చెబుతాడు.

గ్రాహం అనే వివాహిత యువతి జూదంలో, మదిరాపానంలో మత్తెక్కి విచ్చలవిడిగా తిరుగుతూ ఉంటుంది. ఆమెకు పసికందు ఒక్కడు. ఆ పసికందు ఒక్కడూ లేకపోతే ఆమెలో ఉన్న మాతృత్వమనే ఒక్క మానవాంశా ఉండనే ఉండదు. అహర్నిశం అబద్ధాలాడి ఒక అబద్ధం కప్పిపుచ్చుకొనడానికి మరొకటీ మరొకటీ ఆడి బతుకంతా పద్మవ్యూహం పన్నుకునే అభాగిని. ఒక ఘోర హత్యలో హంతకురాలుగా ఆమెపై న్యాయశాస్త్రం నేరం మోపుతుంది. నేరం మోపిన మరుక్షణంనుంచీ ఆమెలో "నేను జీవించాలి. నేను చచ్చిపోకూడదు" అనే జీవన పిపాస ప్రబలమౌతుంది. ఇంతకూ ఆమె నేరం చేసిందా?

ఇదే మనకూ, న్యాయస్థానానికీ చిట్టచివరి మెట్టుదాకా తెలియని విషయం. చర్మచక్షువులతో చూస్తే మనం నమ్ముతాం. అలా మనం చూడలేము. అలా చూసినా న్యాయం నమ్మదు. అది న్యాయచక్షువుతో చూడాలి. మొత్తంమీద గ్రాహంకు హంతకురాలుగా మరణదండన విధింపబడుతుంది.

గ్రాహంలో జీవనదాహం అపారమౌతుంది. పసికందుపై మోహం మోసులు వేస్తుంది.

కోర్టుపై కోర్టుతో పోరాడి పోరాడి—ఇక పోరాటం ఆరాటం పడి పోరాడలేక ఆమె గట్టిగా చచ్చిపోవాలనుకుంటుంది కూడా. చిట్టచివరి కోర్టు తీర్పు కట్టకడపటి ఆశను చెరిపివేస్తుంది. గ్యాస్ ఛేంబరులో విషవాయువులో న్యాయసమ్మతంగా బలి అయిపోతుంది జీవనపిపాసి గ్రాహం!

చనిపోయేముందు ఒకసారి మతాధికారి అయిన ఫాదర్ ముందు గ్రాహం—భగవంతుని సాక్షిగా 'ఐ హావ్ సిన్‌డ్, ఫాదర్' అంటుంది.

ఫాదర్ దగ్గర అన్న మాటలలో జీవన పిపాస అరిపోయి—పోవాలని ఉన్నదనే నిస్పృహా చూపిన గ్రాహంను అర్థం



కృష్ణచిత్రవారి 'బావమరదళ్లు'గా రమణమూర్తి, కృష్ణకుమారి.

# "గాయం కరోతీతి గాయకః!"

# మన చిత్రసంగీతంలో కొరవడుతున్న తెలుగుతనం

సంగీతం పాడకోవడం - మందహాసంవంటి అందమైన వరమన్నాడు ఒక భావుక ద్రష్ట. అవును సంగీతం పాడటం సంతోషపడటం మానవులకే ప్రత్యేకమని నవ్వడం మనిషి తప్ప జంతువు లెరుగవనీ, శాస్త్రవిదులు అంటారు అనుభవం కూడా తద్భిన్నంగా సాక్ష్యం ఇవ్వదు. కనుకనే సంగీతం నా స్వంతం అనే ధీమా మానవుడిలో నిండి నిబిడీకృతమై ఇష్టారాజ్యంగా సంగీతంపై పెత్తనం చెలాయిస్తున్నాడు మానవుడు దానితో గాయకుడు కేవలం పాటకుడే కాక 'గాయం కరోతీతి గాయకః' అని చా చా భాషలో అర్థం చెప్పుకోవలసివస్తోంది నిజంగానే సంగీతానికి గాయాలు అనేకం తగిలాయి. అందుకు నిదర్శనం కేవలం చిత్ర సంగీతం వేస్తున్న వెర్రితలలు.

మానవుడికి నిత్యజీవితంలో కలిగే అనుభూతి విశేషాలలో అదనంగా కలిగే అవ్యక్త మధురానుభూతు లన్నీ 'కళా' రూపంలో వ్యక్తమవుతాయని విశ్వకవి రవీంద్రుని నిర్వచనం. దాన్ని ఆవేశమని కొందరంటే - కాదు 'కళ' అంటారు కొందరు. అలాగే హృదయంలో స్పందించే మధురభావాలు కొన్ని పొంగి బయటికి కవితగా, శిల్పంగా, చిత్రలేఖనంగా ఇత్యాదిగా వస్తాయి సంగీతంగా మానవుడు తీసే మూలుగులో, దీర్ఘంలో ఉన్న మాధుర్యమంతా అతని భావనలో మధురిమ, మధురిమలో మలయానిలం, అనిలంలో ఆప్యాయత, ఆప్యాయతలో నైర్మల్యమూను.

విశృంఖలంగా జన్మనెత్తిన ప్రతిదానికీ లోకంలో కొన్ని కట్టుబాట్లు చుట్టుకుంటాయి. బిడ్డడు పుట్టగానే బొడ్డుకోయడం నుంచీ వాడిదైనందినజీవితాన్ని మతం, సంప్రదాయం, శాస్త్రం శాసిస్తాయి తదనుగుణంగా వాడూ పెరుగుతాడు లేకపోతే మొక్కయి వంగనివాడు మానై అసలు లొంగడు వాడు సంఘానికి తీరనిసమస్య!

అలాగే ఉద్భవించిన ప్రతికళకూ కొన్ని సంప్రదాయా లుంటాయి దాని ప్రవర్తనానికి కొన్ని రీతులు శాస్త్రం నిర్దేశిస్తుంది. అది ఆనిర్దేశాలకు అనుగుణంగా ప్రవర్తిల్లి సంప్రదాయకమైనరీతిగా ఏర్పడుతుంది సంప్రదాయం త్రోసిరాజనని, అసలుకే ఎసరు పెట్టని ఏనవ్యరీతిఅయినా శాస్త్రం గౌరవిస్తుంది అది నూతనకళారీతిగా పరిఢవిల్లుతుంది. అలా పుట్టి పెరిగిన మన శాస్త్రీయ సంగీతానికి నేటి సుగమ (లలిత) సంగీతం ఒక నూతన రీతి. ఈ రీతికి దోహదం చేసినది నేటి కాలంలో ముఖ్యంగా చలన చిత్ర పరిశ్రమ. తరువాత ముఖ్యంగా చెప్పదగింది రేడియో.

సినిమాసంగీతం చూస్తే నాటికీ నేటికీ హస్తిమశకాంతరం భేదా కనిపిస్తున్నది. వెనక తెలుగుసినిమాలలో అచ్చు తెలుగు లలిత సంగీతం వినిపించేది తెలుగుగడ్డపై పుట్టిన గుండెకు అది గోంగూర ఘుమాయింపు, గడ్డ పెరుగు కమ్మదనం, అందించేది. కాని రానురాను ఇతరేతరసంగీత సౌరభ వైవిధ్యంతో తెలుగుపాటలో కల్తీ ఎక్కువయిపోయింది. హిందీవాసన గుప్పుమని తెలుగుతనం తెరమరుగైపోయింది కృత్రిమమూ, భావప్రధానమూ అనే పేరుతో ఎక్కువగా ప్రస్తారరీతిన సాగే ఔత్తరాహిక సంగీత ప్రభావం పడటంతో - ఆరకమైన బాణీలకు మాటలుకూర్చి తెలుగుకలం పడకట్టు రాళ్ళవంటి పట్టుదుముక్కలు 'ట్యూన్స్' లో పడవేసి కట్టుదిట్టంచేయడం జరుగుతోంది. ఇందుకు నిదర్శనంగా ఏ ఒకటి రెండు పాటలో తీసివేస్తే దాదాపు అన్ని పాటలూ మన సినిమాల్లో [illegible]బాణీలూ, వగైరా రాగాలుగానే ఉంటాయి. నేటికి తోడు పాశ్చాత్య నటుల గాత్రధారులు తీసే గవాయీసంగీతాలూ, రాక్ - ఎన్ - రోల్ పాటలుకూడా సంగీతానికి గొడ్డలిపెట్టుగా పరిణమించాయి ఇది కేవలం తెలుగు తెరకు పట్టిన తెగులు కాదు. ఇది సాముదాయికంగా తమిళ, హిందీ రంగాలకూ ఉంది.

అయితే ఈ నూతనరీతులన్నీ మంచివి కావంటారా అంటారేమో!

నిష్ఠూర్యమైనా నిజం చెప్పాలంటే నుత గామూ కావు. ఎంత గొప్పదయినా, అపూర్వమైనదైనా గుడ్డిగా అనుకరించడం తప్పు. కళ విషయంలో మరీ తప్పు. అలా అనుకరిస్తే అది అభ్యుదయం కాకపోగా సాంకర్యం అవుతుంది అది కళా రీతి పతనానికి, మన సంప్రదాయం సంకరం కావడానికి దారి తీస్తుంది.

బెంగాలీ సంగీతం చూడండి. అది నాటి నుంచీ నేటి దాకా వంగదేశపు రంగునే వేసుకుంటున్నది కాని, బొంబాయి షేర్వాణీలు గాని, మద్రాసు తలపాగాలు గాని ధరించడం లేదు. అందుకే బెంగాలీ చిత్రాలలోని సంగీతం బెంగాలీ సంప్రదాయాన్ని వినిపిస్తుంది. బెంగాలీ హృదయ సౌరభం గుబాళిస్తుంది అక్కడి జీవన గీతికగా భాసిస్తుంది. ఆ సంగీతం బంగాలీ హృదయాన్ని ఆవిష్కరిస్తుంది.

దీనికి కారణం ఏమిటి?

బెంగాలీ చిత్రాలలో సంగీతం అయిన దానికీ కాని దానికీ వినిపించదు. కూరలు కొనడానికి మార్కెట్ కు వెడుతుంటేనూ, పొయ్యి దగ్గర వంటచేసుకుంటుంటేనూ, చంద్రుడు కనిపిస్తేనూ, కనిపించకపోతేనూ, ఒంటరిగానో జంటరిగానో ఉంటేను, ఊరికే సంగీతం పొర్లి ప్రవహించదు బెంగాలీ చిత్రాలలో. కృత్రిమంగా 'హాచ్ టు ఓ' కలిపితే నీరయినట్టు - ఓపాటే గొంతూ, పాటేందుకు నాలుగుముక్కలూ, ప్రక్క వాద్యాలూ ఉంటే సంగీతం తయారుకాదు బెంగాలీ తెరమీద.

అదే వారికీ మనకూ భేదా. మన చిత్రాలు కృత్రిమ సంగీతం తయారించే "మ్యూజిక్ లేబరేటరీ" లయిపోతున్నాయి

ఈ దుస్థితి (లేకపోతే దురాచారం) తీరే వరకూ మన సంగీతం వెర్రితలలు వేయడం మానదు. ప్రతిదానికీ పాట కట్టడం మన సంప్రదాయం కాదు. బాణీ కట్టడమూ అంతే. అందుకనే మనం బాణీలు అరువు తెచ్చుకుని మన సంగీత రీతిని కలగాపులగం చేస్తున్నాం.

ఏ జానపద రీతినో, దక్కని సుగమగీతులనో అనుసరించి మూడుపూలు ఆరుకాయలుగా మన సంగీతం వర్ధిల్లడానికి చిత్ర సంగీత దర్శకులూ, గాయకులూ కృషి చేయాలి. సాంకర్యం తగదు.

"రామం"

---

నేసుకోవడానికి ప్రయత్నిస్తే - ఈ సినిమా అందరికీ అర్థం అవుతుంది. అప్పుడు ఇది సినిమా అనరు జీవితం అంటారు చూసినవారంతా.

గ్రాహంగా సూసన్ హేవర్డ్ నటించలేదు తన అనుభూతిని ప్రదర్శించింది ఈ చిత్రంలో తన పాత్రకు ఆమె ఆస్కార్ అవార్డు కూడా అందుకున్నది నటన అనగానే కృత్రిమ హావభావాల చాటు ప్రదర్శనం కాదని గుణపాఠం చెప్పే నటనలో ఈమె నటన ఒకటి చిత్రంలో 'జాజ్' సంగీతం టెంపోతో లయకలిపి గమనవేగానికి సాయపడింది.

జీవితం తెరపై బొమ్మవంటిదనేది వేదాంతం "కాదు నిజం. కావాలంటే ఈ చిత్రం చూడండి" అంటాడు దర్శకుడు రాబర్ట్ వైజ్.

చూసినవాళ్లు తలో రకంగా అనుకోడం సహజం అది ఎప్పుడూ తప్పదు. అందుకే చిత్రం కూడా అపవాదం కాదు. ★

# మగువ మనసు

(14-వ పేజీ తరువాయి)

మన్న స్త్రీకి, సమాజంలో స్వేచ్ఛ అన్న ఒక హక్కును కోరే స్త్రీకి—ఆ సహనం అనేది చాలా తక్కువ అని కొందరి వాదన. అయితే-కమల ఇంటర్ వరకు చదువుకున్నా; పట్నవాసంలో పెరిగినదైనా-సహనాన్ని ఒక హక్కుగా పరిగణించి, దాన్ని ఒక ఆభరణంగానే ధరించగలిగింది! లేకపోతే భర్త దెబ్బ తిన్నప్పుడే సరికిసరి అతనితో దించి—తన అనుబంధాన్ని రద్దుచేసుకోవటానికి ప్రయత్నించివుండేది!

భర్తలో పరివర్తన కలిగేంతవరకూ-తను సుభావంగా వుండకతప్పదని నిశ్చయించుకుంది కమల. ఆ సుముహూర్తం వీలయినంత త్వరలో రావాలనికూడా ఆశించింది.

అప్పుడు తనకున్న ఆవేశంలో—ముందు వెనకా ఆలోచించకుండా—కమల చెంప మీద కొట్టగలిగాడేగాని, ఆతర్వాత కొన్ని నిమిషాలలో తన పశుతత్వాన్ని గ్రహించి ప్రభాకర్ చాలా పశ్చాత్తాపపడ్డాడు. తప్పు చేయడం ఎవరికైనా సాధారణమే! ఆ సమయంలో,ఎదుటివారి తప్పును ఎత్తిచూపించి—వాళ్ళు చేయకుండా మానిపించడం ధర్మం. కాని పశువులా దండించడం మంచిపని కాదని గ్రహించాడు. పెళ్ళయినప్పటినుంచీ అన్యోన్యంగా జీవించారు. ఒకొక్కప్పుడు అల్లరిగా పోట్లాడుకున్నా, కమల మీద తానెప్పుడూ చేయిచేసుకున్నవాడు కాదు కానీ, ఈరోజు తను తప్పుదోవలో పడిపోయినందుకు పశ్చాత్తాపపడ్డాడుకూడా!

కమలను ఎలా సమాధానపరచాలన్న మార్గం ప్రభాకర్‌కు బోధపడలేదు కాబట్టే భోజనవేళకి - ఆహారాన్ని తనే వడ్డించుకుని తిని లేచాడు. మొహమాటంకొద్దీ ఏ విషయంలోనూ జోక్యం కలుగజేసుకోకుండా వుండిపోయింది.

వాడుక ప్రకారం భోజనం తర్వాత సిగరెట్ ముట్టించడానికి జేబులు తడివాడు. సిగరెట్ లేదు; జేబులో చిల్లర డబ్బులు గూడా లేవు బీరువా తెరిచి, లోపలి డ్రాయరు లాగాడు డ్రాయరులోని చిన్న కొయ్యపెట్టె తెరిచి, చిల్లర డబ్బులు తీసుకోబోయాడు. అందులో రెండు కాగితాలుండడం చూశాడు. వాటిని చేతికి తీసుకుని చూశాడు. ఒకటి మనియార్డరు చేసిన రశీదు, మరొకటి ఉత్తరం. దానిలో ఇలా వుంది

"ప్రియమైన ఒదినకు-క్షేమం; మీ క్షేమం కోరుతున్నాను. నేనీ వుత్తరం వ్రాయడంలో ముఖ్యమైన అవసరం వుంటుందని వూహించివుంటావు మా వారికి రెండు రోజులుగా జ్వరంగావుండి, డాక్టరు దగ్గరకు పోగా - టైఫాయిడ్ అని చెప్పారు. ఆస్పిటల్‌లో అడ్మిట్ చేసుకున్నారు. ఆఫీసుకు నెలరోజులకు పైగా సెలవులు పెట్టారు మందులకూ, ప్రత్యేకమైన ఖర్చులకూ వంద రూపాయలకు పైగా అవసరమని డాక్టరు చెప్పారు ఉన్నపళంగా వంద రూపాయలు మా కెక్కడినుండి వస్తాయి. ప్రభాకర్ అన్నయ్యను అడగడంలో, తనకు గౌరవరహితమని - ఆయన బాధపడుతున్నారు ఒదినా స్త్రీ మనస్సు ఒక్క స్త్రీకే తెలుసు! ఈ పరిస్థితుల్లో నేనేం చేయగలను? అన్నయ్య మినహా, మా కెవరూ లేరు అయితే, మా ఆయన అన్నయ్యను అడగవద్దని వారించారు కాబట్టే - నిన్ను ప్రాధేయపడవలసిన అవశ్యం ఏర్పడింది ఎలాగైనా సరిదిద్ది, వందరూపాయలు, వీలైనంత త్వరలో పంపించుమా ఆయన ఆరోగ్యం బాగా కుదుటపడ్డ తర్వాత, నెమ్మదిగా నీ ఋణం తీర్చుకుంటాము. ఈ విషయం, దయచేసి అన్నయ్యకు తెలియజెయ్యవద్దు. అన్నయ్యకు తెలిస్తే, చాలా బాధపడగలడు!—మరేం సంగతులు లేవు.. నీ సహాయంకోసం

# ప్రయాణంలో ప్రణయం

(23-వ పేజీ తరువాయి)

నీకు సైకిల్ తొక్కడం రాదుగా" అని రాధతో అని మూర్తివైపు చూస్తూ "మీకు సైకిలు తొక్కడం వచ్చునా" అంది.

వచ్చునన్నట్లుగా తలూపాడు మూర్తి.

"మీరు బండిమీద వస్తే మీకు కంపెనీ ఉండదు. మీ ఇద్దరూ ఒక సైకిలు మీద ఎందుకు రాకూడదూ?" ఆంగ్లంలోనే ప్రశ్నించింది భారతి.

మూర్తికి ఏం జవాబు ఇవ్వాలో తెలీక రాధవైపు చూశాడు. నవ్వేసింది రాధ తన కేమీ అభ్యంతరం లేనట్టు. ఇంకేం! రాధను ముందర కూర్చోపెట్టి సైకిలు తొక్కుతున్నాడు మూర్తి. ముందరకూర్చున్న రాధ బొంబాయి కాలేజీలను గురించీ, విద్యార్థులను గురించీ, వాళ్ళెంత సోషల్ గా ఉంటారో అన్నీ చెబుతోంది కబుర్లు చెప్పుకుంటూనే ఆ బంగళాకి చేరారు వాళ్ళందరూ కలసి.

కాఫీ, ఫలహారాలు పూర్తిఅయ్యాక ఎవరికి ఇష్టమయిన ఆటల్లోకి వాళ్లు వెళ్ళిపోయారు. రాధా, మూర్తీ చీట్లాట కేరమ్స్ మొదలూ "ఆన్ ఏన్ ఐలెండ్ విత్ యూ", "పాసింగ్ త్రూ ఏ రింగ్" ఆటలవరకు పార్ట్నర్స్‌గానే ఉన్నారు. కొద్ది సేపట్లోనే మూర్తీ, రాధల కొత్తదనంపోయి వాళ్ళుకూడా మెడికల్ కాలేజీ విద్యార్థులతో కలిసిపోయారు.

సాయంత్రం మళ్లీ సైకిల్ మీద కార్లా గుహాలు చూడటానికి పోయారు. సుమారు పదిమైళ్ళ దూరం వున్నా మూర్తికి రాధను సైకిలుమీద తీసుకుపోవడం అట్టే అంతకష్టం అనిపించలేదు దారిపొడుగునా ఏవో కబుర్లు చెబుతూనేవుంది రాధ. ఏదో ఎలిఫెంటా కేవ్స్‌ను గురించీ, ఆరేమిల్క్ కాలనీ ఎటువంటి పిక్నిక్ స్పాట్లో — ఒకటేమిటి? నదురూ బెదురూ లేకుండా మాటాడుతోంది. మొత్తంమీద మెడికల్ కాలేజీ పిక్నిక్ ధర్మమా అని మూర్తీ రాధలు ఎంతో సన్నిహితు లయ్యారు. సాయంత్రానికి పిక్నిక్ నుంచి తిరిగివచ్చారు బొంబాయికి.

అంతవరకూ మూర్తి తను అంతక్రితంరోజు ఇంటర్వ్యూకి వెళ్లానన్న సంగతే మర్చిపోయాడు. ఇంటికిచేరిన వెంటనే రాధతండ్రి మూర్తికి ఏదో ఒకకవరు ఇచ్చేటప్పటికి తన ఇంటర్వ్యూ సంగతి జ్ఞాపకంవచ్చి ఎంతో ఆశతో తెరిచాడు ఆ ఉత్తరాన్ని. ఒక్క గుక్కలో ఉత్తరం చదివేసి ఆశ్చర్యంగా "నన్ను ఎపాయింట్ చేశారండీ పదిరోజులు జాయినింగ్ టైమ్ ఇచ్చారు. అయినా వాళ్ళు నన్నడిగిన ప్రశ్నలనుబట్టి నాకు కొంచెం కూడా ఆశలేదు.

ఇంకా అతను చెప్పడం పూర్తికాకుండానే రెండు గొంతులు కంగ్రాచులేషన్స్ చెప్పాయి.

"నేను రేపుమధ్యాహ్నం రైలులోపోతానండీ. జాయినింగ్ టైమ్ పదిరోజులేవుంది" అన్నాడు మూర్తి.

"సరే నీయిష్టం. కాని ఇంతవరకూ నీతో చెప్పలేదు. చెబితే మొహమాటపడతావేమోనని. మీ నాన్న పరంధామారావు నాకు చిన్నతనంలో క్లాస్‌మేట్. ఏదో చిన్నప్లాటు దొరికేవరకూ మాఇంట్లోనే ఉండువుగానిలే మీ నాన్నని రమణారావు అడిగాడని చెప్పు"

ఏమిటీ! మూర్తితండ్రి మీనాన్నే హితుడా? ఇంతవరకూ చెప్పారుకాదేం? అన్నట్టుగా చూసింది రాధ.

మూర్తి ప్రయాణానికి రాధ ఏమీ అడ్డు పెట్టలేదు ఎలాగా ఓ వారంరోజుల్లో తిరిగి వస్తాడుకదా అని మర్నాడు పొద్దున్న రాధని తీసుకు షాపింగ్‌కి బయలుదేరాడు మూర్తి. మూర్తి చెల్లెలికీ మూర్తి తల్లికీ చీరెలు అని సెలెక్ట్‌చేసి పెట్టింది రాధ.

మూర్తి, రమణరావు రాధల ఆదరాభిమానాలకు ధన్యవాదాలు చెప్పి మధ్యాహ్నం రైలులో బయలుదేరి వెళ్ళిపోయాడు.

రాజమండ్రీ చేరగానే రమణారావుగారిని గురించి, ఆయన తనకు చేసిన మర్యాదలను గురించీ తెగ పొడిగాడు మూర్తి.

"ఓ రమణగాడా! ఇప్పుడేదో కంపెనీకి డైరెక్టర్ అనుకుంటా. చూసి చాలారోజు లయ్యింది. వాళ్ళూ మనవాళ్ళేరా. వాళ్ళది అసలు కాకినాడ," అన్నాడు రమణారావు గారిని గురించి పరంధామారావుగారు.

* * *

పదిరోజులు లోపులోనే డ్యూటీలో జాయినయ్యాడు మూర్తి. కాని మూర్తి రమణారావుగారి ఇంట్లో దిగకుండా ఏదో హోటల్లో మకాం చేశాడు. కాని డ్యూటీలో జేరినరోజు రమణరావుగారింటికి పోయి ఆ విషయం చెప్పివచ్చాడు.

రమణరావుగారూ, ముఖ్యంగా రాధా, మూర్తి ఏదోహోటల్లో దిగినందుకు చాలా బాధపడ్డారు. మూర్తి ఏదో సర్ది చెప్పేశాడు, మంచి ప్లాట్ దొరకడానికి చాలాకాలం పడుతుందనీ, అంతవరకూ వారింట్లో ఉండటానికి మొహమాటంగా ఉంటుందనీ.

మూర్తి తిరిగి తనరూమ్‌కి పోతుంటే వీలైనప్పుడు వచ్చి కనిపిస్తూ ఉండమనినీ ఆహ్వానించారు రమణారావుగారు.

"ప్రతీ ఆదివారం వస్తూఉండండి" అంది రాధ. ఇకనేం! మూర్తికి కావలసింది కూడా అదే. అది మొదలు ప్రతి ఆదివారమూ ఏదో పిక్నిక్‌లకో, సినిమాలకో పోతూనే ఉండే వారు ఆ ముగ్గురూను.

ఒకరోజు మూర్తికి పరంధామారావు గారి దగ్గరనుంచి ఉత్తరంవచ్చింది, ఆయనకి రమణారావుగారి దగ్గరనుంచి ఉత్తరం వచ్చిందనీ, రాధని మూర్తికి ఇద్దా మనుకుంటున్నారనీ దానిమీద తన అభిప్రాయం వ్రాయమనీ .

అభిప్రాయం వ్రాయడానికేముంది !!! కొద్దిరోజుల్లోనే మిస్ రాధ మిసెస్ రాధామూర్తి అయింది

తర్వాత కొద్దిరోజులకి మూర్తికి తెలిసిన విషయా లేమిటంటే. తను రమణారావు గారిని రైలులో కలుసుకొనేటప్పటికే రమణారావుగారు తయారుచేసిన పెళ్ళికొడుకుల జాబితాలో మూర్తిపేరు ఉందనీ, తను పని చేస్తున్న కంపెనీడైరెక్టర్లలో ఒకాయన రమణారావుగారికి ఆప్తమిత్రుడనీ, ఆయనరికమెండేషన్‌వల్లనే తను చేస్తున్న ఉద్యోగం వచ్చిందనీనూ కాని ఆ విషయాలు అప్పుడే ఎందుకు చెప్పలేదో తనకి!!!! అర్థంకాలేదు మూర్తికి.



---

ఎదురు చూస్తున్నాను మా పిల్లలిద్దరూ బాగున్నారు.

ఇట్లు,
అనసూయ."

ఉత్తరం చదివిన తర్వాత—ప్రభాకర్ మెల్లగా కూలిపోయాడు. తన చెల్లెలి సౌభాగ్యం కోసం—తన సొమ్ములు తాకట్టు పెట్టి—ఆ డబ్బును సహాయంగా పంపి, తన ఉత్తమ గుణాన్ని నిదర్శనం చేసుకున్న కమల అంతర్భావాన్ని గ్రహించలేక—తొందరపడి ఆవేశంలో చేయి చేసుకున్న పాపానికి ప్రాయశ్చిత్తంగా—

వెనక వాకిట్లో-ఒంటరిగా కూర్చుని చదువుకుంటున్న కమల – కాలు కాలినపిల్లిలా వచ్చి, తన చెంత కూర్చున్న ప్రభాకర్‌ను చూసీ-చూడనట్టుండి పోయింది.

"కమలా!. ... కోపమా?" అని ప్రశ్నించాడు జాలిగా. జరిగిందేదో తెలుసుకోడానికి ఆట్టేసేపు పట్టలేదు కమలకు.

"నీ డబ్బు నాచెల్లెలికి సహాయపడిందన్న సంగతి నాకెందుకు ముందే చెప్పలేదు, కమలా" అన్నాడు భర్త.

"ఎవరికి పంపించానన్న సంగతి చెప్పక ముందే, మీరు నన్ను కొట్టేశారుగా!" అని దెప్పిపొడిచినట్టు అంది కమల.

"తప్పు తప్పు! – ఇకమీదెప్పుడూ నిన్నే విధంగానూ అపార్థం చేసుకోను! మగువల మనస్సును అర్థంచేసుకోని మగవాళ్లలో— నేనూ ఒకణ్ణి!" అని చెంపలు వేసుకోబోయిన భర్త చేతుల్ని మందహాసంతో వారించింది కమల

చదరంగం:

# శ్రీ రెంటాల కొత్త పోకడలు

పాత పద్ధతులు అన్నా, వేసిన ఎత్తు మళ్లీ వేయడం అన్నా శ్రీ రెంటాల సుబ్రహ్మణ్యం గారికి కిట్టదు. చతురంగం ఆటగాళ్ళలో భీష్ముని తలపుకు తెచ్చే ప్రజ్ఞ ఆయనది ఎప్పటికప్పుడు కొత్త పోకడలు ప్రవేశపెట్టడానికి సదా ప్రయత్నిస్తూ ఉంటారు ఆయన. అదే ఆయన ఓటమికికూడా కారణం అవుతూ ఉంటుంది.

ఇటీవల కస్తూరికప్ పోటీలలో హైదరాబాదు ప్రతినిధి శ్రీ మహమ్మద్ హాసన్‌తో శ్రీ రెంటాల ఆడినఆట రసవంతంగాఉన్నది ఉభయులు కూడా పొరపాట్లు చేయక పోలేదు.

ఆ ఆటసాగిన క్రమం ఇది

శ్రీ రెంటాల—తెలుపు; శ్రీ హాసన్—నలుపు.

## బర్డ్సు ఓపెనింగ్

1. బ-రాశ 4 ; గు-రాశ 3.
2. గు-రాశ 3 ; బ-మ 4 (అ).
3. బ-శ 4 ; బ-రా 3
4. బ-రా 3 ; మగు-మ 2.
5. గు-శ 3 ; శ-రా 2.
6. బ-మగు 3 ; 0-0 (రాజువైపు కోట).
7. మ-శ 2 ; బ-శ 4
8. శ-గు 2 ; బ-మగు 3.
9. శ-మ 3 ; శ-గు 2
10. 0-0-0 (మంత్రివైపు) కోట (ఆ), బ-మఏ 4 (ఇ).
11. మఏ-శ 1? (ఈ); గు-గు 1.
12. రాఏ-గు 1 (ఉ); గు-శ 3.
13. బ-మఏ 3 ; బ-మ 5.
14. గు-మఏ 4 (ఊ) ; మ-శ 2.
15. బ-రాగు 4 (ఎ) ; బ-గు 3.
16. బ-ఏ 4 ! ; బ-రా 4 (ఏ).
17. శబ × రాబ (ఐ) ; గు × రాబ.
18. గు × గు ; మ × గు.
19. గు × గు బ ; మఏ-మ 1.
20. బ × బ ; బ × బ
21. బ-గు 5 ; గు-ఏ 4.
22. ఏ-రా 1 ; మ-మ 3.
23. గు-మ 5 ; శ × గు
24. బ × శ , ఏ-శ 1 (ఒ).
25. శ-శ 4 ; రాఏ-మ 1
26. రా-గు 1 (అం) , శ-శ 1.
27. మ-రా 4 , శ-గు 2
28. మ-రా 7 ; మ-గు 3
29. ఏ (గు1)-శ 1 ; ఏ-శ 1.
30. బ-మ 3 (క) , గు-గు 6.
31. ఏ-శ 2 ; గు-శ 4
32. మ-రా 2 ; గు-రా 6 (ఖ).
33. మ-శ 3 , మ-మ 3.
34. రా-ఏ 2 ; బ-ఏ 5
35. ఏ-మశ 1 ; ఏ-శ 4?
36. బ-గు 4 ; ఏ-శ 2
37. మ-శ 4, శ-రా 4.
38. మ-రా 4, గు-శ 4.
39. ఏ-రా 1, ఏ-రా 2.
40. మ-గు 4, గు-రా 6.
41. మ-శ 3; బ-శ 4
42. ఏ-రా ఏ 1 (గ), ఏ-మ శ 1.
43. శ-గు 5; గు × మ బ
44. శ - శ 4, ఏ-మ 2
45. బ- ఏ 5, రా-శ 1 (ఘ).
46. బ × బ, బ × బ
47. ఏ - ఏ 6?, గు - శ 6 + (షా).
48. రా - ఏ 1; శ - గు 2;
49. ఏ - ఏ 1 (చ), మ - రా 4.
50. శ - శ 1; ఏ × శ! (ఛ).
51. బ × ఏ, బ-మ 6.
52. శ - గు 2; ఏ-రా 2.
53. ఏ - మ 2? (జ); మ-రా 8 + (షా).
54. ఏ (2)-మ 1 (ఝ); గు × ఏ
55. శ × శ + షా; రా × శ
56. ఏ × మ; ఏ × ఏ
57. రా - గు 1; గు-రా 6 + (తెరిచి షా).
58. రా - గు 2; బ - మ 7.
59. మ - గు 7 (ట); రా - శ 1.
60. మ - గు 8 + షా; రా—రా 2?
61. మ - రా 5 + షా; రా(ర) మ 2.
62. మ - గు 7 + " రా - మ 3.
63. మ-మ 4 షా; రా-రా 2.
64. మ - రా 5 + షా; రా - మ 2.
65. మ - గు 7 + షా, రా - మ 3.
66. మ - మ 4 + షా; రా-శ 2.
67. మ - గు 7 షా; రా - మ 1;
68. మ - మ 4 + షా; రా - శ 1.

శాశ్వతంగా షా అనడానికి అవకాశం ఉన్న కారణంచేత ఆట డ్రా అయినట్లు ఉభయులు అంగీకరించారు.

(అ) తెలుపు నలుపు బలముల తారుమారుతో ఇది 'డచ్ డిఫెన్సు'లో ఒక పద్ధతిగా, తెలుపుచే అవలంబించబడినది.

ఇది శ్రీ సుబ్రహ్మణ్యంకు ఇష్టమైన ఓపెనింగ్ దానిలో ప్రధానమైన ఇబ్బంది ఏమంటే జి 1-ఎ 7 డయాగనల్ మీద నలుపు మొదటి ఎత్తునుంచి ఒత్తిడితీసుకొని వచ్చుటకు అవకాశము ఉన్నది

(ఆ) నలుపు రాజుపైదాడికి నాంది.

(ఇ) నలుపు బలముకూడా మంత్రి తట్టు దాడికి సన్నద్ధమగుట, తెలుపు నలుపు బలములు చేరియొకవైపు కోటకట్టుటలోని ఆంతర్యము ఈ రెంటిలోను తెలుపుచేయగల దాడి అతిశీఘ్రవంతమైనదిగా ఉండగలదు.

(ఈ) ప్రస్తుతము ఈ ఎత్తుకు అవసరము లేదు

(11) బ-రాఏ 3, (12) బ-రాగు 4; తెలుపుయొక్క సరియైన ఆటపద్ధతి సందర్భానుసారముగా, ఈ ఏనుగును రా 1 గు 1 లలో ఉంచవలసి వచ్చును.

(ఉ) ఇది మరియొక అనవసరమైనఎత్తు.

(ఊ) 14. బ × బ, బ × బ, (15) గు-మఏ 5; శ-శ 4 లేక (14) బ × బ; గు × బ (15) గు × గు; బ × గు (16) గు-గు 5 తెలుపుకు చాలా లాభదాయకముగా ఉండేదిది

(ఎ) ఇది ఎన్నడో ఇచ్చుటకు రావలసిన బంటు!

(ఏ) నలుపుకు మంత్రివైపు దాడిచేయుటకు ఏమాత్రము అవకాశము లేకపోవుటచే అతను కేంద్రంలో ఏదో చెయ్యాలి

(ఐ) (17.) బ-శ 5!; బ-రా 5 (18) బ × గుబ!; బ × శ (19) బ × ఏ బ షా; గు × ఏ బ (20) మ × మ బ; మఏ-మ 1 (21) బ-గు 5; గు-రా 4 (22) గు × గు; మ × గు (23) బ-బ 6; గు-శ 3 (24) బ × బ + షా; రా × ? (25) మ-గు 6 + షా-నలుపు ఆటపోవును 21—బ × రాబ (22) మ × రా బ అయితే తిరుగులేని దాడిచేయుటకు అవకాశము ఉన్నది.

(ఒ) 24 —మ × మబ? 25 ఏ × శ

(అం) 26. శ × మబ; మ × ఏబ + షా.

(క) (30) బ-మ 6; ఏ × శ? 31. బ × ఏ. శ—శ 3? 32 ఏ × శ; గు × ఏ 33. బ × గు; (మ × గు; ఏ—గు1 అయితే తెలుపు ఆటకట్టు) ఏ—గు 1 ? 34. మ—రా 8 (షా) ఆటకట్టు.

లేక 31 —బ-మ 7. 32 ఏ-రా 5!; శ × ఏ 33. మ × శ.

తెలుపు 30 వ ఎత్తు బ—మ 6 ఆడిఉండవలసినది

నలుపు వేసిన గుఱ్ఱపు ఎత్తులు చాలా బాగున్నవి. నల్లగుఱ్ఱమునకు ఇదియొక అమోఘమైన జాగా

(గ) 42. బ-ఏ 5; బ × బ. 43 మ × ఏబ; శ—గు 6.

(ఘ) ఈ తెరవను నలుపు ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా తప్పవలెను. ఎందువలన అనగా, నలుపు గుఱ్ఱము నలుపు జంతువులన్నిటిలోను అతిచాకచక్యము కలిగినదై ఉన్నది.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# గళ్లనుడికట్టు-12

## ఆధారాలు

### అడ్డము

1. ముక్కగా చేతునుకదా!
3 మెత్త.
5. క్రియతో కూడిన శాఖ.
7 కోరికలను తీర్చే చెట్టు.
8 వెంటతిరిగే ఛాయగా!
9 ఆకులను పరుచు లుబ్ధుని స్వాదనలా?
12 వేణువులో రాక్షసుడు.
14. తిరగబడిన మంచి.
15. సామధేయం ముందు గలము, అన్నసభ!
16 నుడికట్టునిండా కనుపించేది!
17. భూగర్భంలోనిది తిరగబడితే కలిగే మెరుగు.
20 పాదంలోని ప్రశ్న ఏది?
24. ఒక్కొక్క ముక్కకీ ఇచ్చిన బహుమానం అంటారు — మునపటి కాలంలో కవులకు!
25 చుక్కతో వేధించుకుతినేవాడు!
26. అర.
27. రెండువైపులా ప్రధానమైనదేనా?
28 మేము ఆగం! పాటలు తగ్గించుకోండి, అప్పుడైనా మోగుతాయి.

### నిలువు

1. కరుస్తాము! అని మరోవిధంగా అంటే అందులో ఒక భావ దొరుకుతుంది. [ఇది ఉత్తర అట్లాంటిక్ సమితిలోని దేశాలలో ఒకదానికి సంబంధించినది, మొట్టమొదట]
2. గంపములు!
3. చాలామంది.



4. ఆజినము.
5. ప్రజాదరము స్వీకనలు ముఖ్యంగా కావాలంటే వారిని అందులోనే వెతకాలి!
6 యక్షులుపాడే పాట కాదేమో?
10. బిందువుల రాజనిపిస్తుంది కాని నిజంగా చంద్రుడు.
11. ప్రవహించినా ధరించేది!
13. మంచు కరగడములోని గొడవ.
18. కఠినమైన దినుసు, అని అర్థం వచ్చేట్లు వ్రాసి చూడండి— చివరి మూడు మాటలలో చెయ్యి కలగా పులగమై ఉంటుంది!
19. మొదటి రెండక్షరాలు తారుమారైన నాలుగక్షరాల ఆశ (నెరవేరనిది).
20 తగ్గనిది.
21. పెనగుము, అంటే మొదటి ఏకారం తీసివేసి త్రవ్వేది ఏర్పరచండి.
22. 20వ శతాబ్దాన్ని ఈ యుగం అనవచ్చు— త్రయంబకముతో సంబంధం ఉన్నదనేనా?
23 మూడు ప్రథమా విభక్తులకు చేరిస్తే ఈ తినుబండారం లభిస్తుంది!

## 11-వ గళ్లనుడికట్టుకు జవాబులు



(ద) ఇది ఆలోచన లేక తెలుపు వేసిన 47వ ఎత్తు ఫలితము.

(ధ) ఈ ఎత్తుతో ఆటలో పైచెయ్యి నలుపు సంపాదించినది.

(జ) ఏ (శ 2) శ 1కి ఆడియుండిన, తెలుపు ఆట రక్షణకు ఎక్కువ ఉపయోగపడి ఉండెడిది.

(ఝ) (54) ఏ × మ?; ఏ × ఏ + షాతో తెలుపు ఆటకట్టు.

(ట) ఇప్పుడు తెలుపు ఓటమిని తప్పించుకొనుటకు, విరామము లేని 'షా' లు చెప్పగలిగి ఉండాలి. ఇది నలుపు తన రాజును 60వ ఎత్తులో తప్పుగా తప్పుకొనుటవల్లనే సాధ్యపడినది!

(ఠ) నలుపు రా–శ 2, కు తప్పి ఉండిన తెలుపు విరామములేని 'షా' లు చెప్పుట అసాధ్యమైన పని.

(60)—రా–శ 2 (61) మ–శ 7 + షా; రా–రా 3 (62) మ – శ 6 (లేక 8) + షా; రా–రా 4 (63) మ-రా 8 + షా; రా–శ 5 (లేక (63) మ–శ 7 + షా; రా–రా 5) (64) మ–గు 8 + షా; రా × బ (65) మ–మ 8 + షా; రా–గు 5 (66) మ × మబ?; గు × కబ + (షా) తో తెలుపు మంత్రి పోవును.

—చాగంటి బాపిరాజు.

# పొట్టి కథలు



ఏమోయ్ ఆనందరావూ....

కె. మంజులా దేవి (మచిలీపట్టణము)

గానకచేరి జోరుగా జరిగిపోతున్న సమయంలో సి.ఐ.డి ఒకడు గానసభ నిర్వహిస్తున్న కార్యదర్శిని చాటుగా పిలిచి "నేను సి. ఐ. డి. ఇలాకా పని మీద వచ్చాను. ఇక్కడేదో ఖూనీ జరుగుతున్నట్లు మా శాఖ కార్యాలయానికి మీ ఇరుగు పొరుగున ఉన్న ఒక ప్రముఖ వ్యక్తి ఫిర్యాదు పంపారు. నాకు మీ పూర్తి సహకారం కావాలి" అని అభ్యర్థించాడు.

ఆ కార్యదర్శి ఖూనీ అన్న మాట వినగానే భయంతో సగంచచ్చి ఎల్లాగైతేనేం చివరికి తెప్పరిల్లి "ఇక్కడ...మా గాన...సభలో, ఖూనీయా? ఎవరినీ? ఏమిటీ?" అని అడిగాడు.

"ఎవరో త్యాగరాజు అనే ఆయన్ను ఖూనీ చేస్తున్నారటగా? అంతటి పెద్దమనిషి ఫిర్యాదు పంపిస్తే అది అబద్ధమంటారా!" అన్నాడు ఆ సి. ఐ. డి.

* * *

"మా తాతగారి ఖడ్గం నా కంట పడినప్పుడల్లా నాక్కూడా యుద్ధంలోకి పోవాలనిపిస్తుంది."

"మంచిదే. మరి ఆలస్యం ఎందుకు?"

"కాని మా నాన్నగారి కొయ్యకాలు చూచినప్పుడల్లా 'ఎందుకొచ్చిన యుద్ధాలు లే' అనిపిస్తుంది."

సి. యస్. జ్ఞానేశ్వర్రావు ఉత్తర్కర్, (అనంతపురం)

* * *

"నెపోలియన్ సైన్యంలో ఒక సైనికునికి యుద్ధంలో ఒక చెయ్యి తెగిపోయింది. నెపోలియన్ ఆ సైనికునికి వీరత్వ బిరుదాన్నిస్తూ, 'ఇది నీ హస్తం తెగిన దానికి బహుమతి' అని చెప్పాడు. ఇది విని ఆ సైనికుడు 'అయ్యా, యుద్ధంలో నా రెండవ హస్తం కూడా తెగిపోయినచో ఏమయ్యేది?' అని అడిగాడు. 'అట్లా జరిగినట్లయితే సైన్యంలో పెద్ద పదవి ఇచ్చేవాడిని' అని నెపోలియన్ చెప్పిన మీదట ఆ సైనికుడు కత్తి తీసికొని తన రెండవ చేతినికూడా నరికివేసికున్నాడు" అని ఒకడు తన స్నేహితునితో చెప్పుతూ "ఎలా ఉంది ఈ సంఘటన" అన్నాడు.

స్నేహితుడు: "బాగానే ఉంది. కాని ఆ సైనికుడు తన రెండవ చేతిని ఏ చేత్తో నరుక్కున్నాడో చెప్పు?"

తాళ్ళూరి జయదేవ్ (ధర్మవరం)

* * *

ఇంకా యుద్ధం ప్రారంభం కాకముందు ఒక విమానంలో నలుగురు ప్రయాణం చేస్తున్నారు. వారిలో ఒకడు జర్మన్. రెండోవాడు జపాన్ దేశస్థుడు. మిగిలిన ఇద్దరిలో ఒకడు ఫ్రెంచి వాడు: రెండవ మనిషి ఇంగ్లీషు వాడు. ఇంతలో విమానం ఇంజన్ చెడిపోయింది. ఇంక ఎలాగూ బ్రతకమనుకున్నారు అందరూ. మొదట జర్మన్, "హైల్ హిట్లర్!" అని తలుపు తెరిచి దూకేశాడు. ఆ తర్వాత, "హారాకిరి!" అని జపాన్ దేశస్థుడు బయటకు దూకాడు. "గాడ్ సేవ్ ద కింగ్!" అని ఇంగ్లీషు వాడు ఫ్రెంచి దేశస్థుణ్ణి బయటకు తోసేశాడు.

—ఎస్. ఆర్

Printed and Published for NageswaraRao Estates Private Ltd, by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street Madras-1 Editor S. Sambhu Prasad

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.